## న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



# అతి సహనం అనర్థదాయకం

రష్యన్‌లకు ఒక మాట ఉంది. అది స్లైటర్‌పెలోస్ట్. దాదాపుగా దాన్ని బానిస సహనం అని అనువదించవచ్చు. ప్రభుత్వం గానీ, అధికారంలో ఉన్న వాళ్ళు గానీ స్పష్టంగా మీకు తప్పు అని తెలిసిన పని చేస్తున్నప్పుడు మీరు చాలా సులభంగా మరో వైపు చూపు తిప్పుకుంటారు. రష్యన్లు గత 71 సంవత్సరాలుగా, అంటే ఒక జార్‌ను తొలగించి, లెనిన్ అనే మరో జార్‌ను అధికార పీఠంలో కూచో బెట్టిన నాటి నుంచి ఇదే విధంగా ప్రయత్నిస్తున్నారు. అణచివేతకు, బలవంతపు సంతకాలకు, నిర్బంధ శిబిరాలకు, తప్పుడు విచారణలకు, రెండు కోట్ల కులక్‌ల హత్యతో సహా రాజకీయ హత్యలన్నిటికీ, శాస్త్రవేత్తలు, సంగీత వేత్తలు, రచయితలు పొందిన అవమానాలకు, అధికార కాంక్షాపరులైన దోపిడీ దొంగలు సమాజం మొత్తాన్ని తలకిందులు చేసి జరిపిన అత్యాచారాలకు రష్యన్లు ప్రభుత్వాన్నో, కమ్యూనిస్టులనో తప్పు పడుతూ వస్తున్నారు. కాని ప్రముఖ రష్యన్ కవి యెవ్‌తుషెంకో ఈ మధ్యనే ప్రకటించినట్టు, మొత్తం దౌర్జన్యానికి పాలకులను తప్పు పడుతూ, అవమానాల్ని భరించిన రష్యన్ ప్రజలు వీసమెత్తు ప్రతిఘటనను కూడా చూపలేదు,

"ఇతరులను తప్పు పట్టడం మనకు అలవాటు అయిపోయింది. ముఖ్యంగా కొరతకు, ఇతర సమస్యలకు ప్రభుత్వాన్ని తప్పు పడుతున్నాం. కాని మనం నిజాయితీగా ఒక విషయం అంగీకరిద్దాం. తప్పు. చేసినది పాలక వర్గం మాత్రమే కాదు, ఆ వర్గం ఇష్టారాజ్యంగా ప్రవర్తించేందుకు అనుమతించిన ప్రజలు కూడా తప్పు చేసినట్టే. నేరాలను అనుమతించడమంటే ఒకరకంగా నేరాలలో పాల్గొనడమే. అదే స్లైటర్ పెలోస్ట్. ప్రతిదానికీ ప్రభుత్వాన్నో, అధికారులనో, 'వాళ్ళ'నో, తప్పు పట్టడం మానెయ్యవలసిన సమయం ఆసన్నమైంది. మనం వాటితో కొనసాగుతున్నామంటే, మనం అందుకు అర్హులం అన్నమాటే" అన్నాడు యెవ్‌తుషెంకో.

భారతదేశంలో మనం కూడా స్లైటర్ పెలోస్ట్‌ను పాటించడం అనే తప్పిదం చేస్తూనే ఉన్నాం. ఇరవై ఏళ్ళకు పైగా మనం గాంధీలతో కలిసి కొనసాగుతున్నాం. సమాజం ప్రస్తుతం అనుభవిస్తున్న కష్టనష్టాలన్నీ ఈ కుటుంబం చేసిన తప్పుడు పనుల వల్ల, చెయ్యని మంచి పనుల వల్ల ఏర్పడినవే అని మనకు స్పష్టంగా తెలుసు. గత పధ్నాలుగు నెలలుగా మనం అది ఏదో డిటెక్టివ్ కథ అయినట్టు, మనకు దానితో ప్రత్యక్ష సంబంధం ఏమీ లేనట్టు బోఫోర్స్ గురించి చర్చిస్తున్నాం. అత్యున్నత అధికారపీఠాలలో ఉన్న వారు ఎటుపడితే అటు అబద్ధం చెపుతున్నారు. కాని బోఫోర్స్ గాని, మరే వివాదం గాని తమకు మచ్చ తేలేవన్నట్టుగా వాళ్ళు తమ పాలనను కొనసాగిస్తూనే ఉన్నారు. దేశంలో అతి పెద్ద రాజకీయ పార్టీ, ఏ ఎన్నికలలో నయినా మూడో వంతు కంటే ఎక్కువ వోట్లు తెచ్చుకునే పార్టీ, అలహాబాద్‌లో కూడా అటువంటి నిష్పత్తి లోనే వోట్లు సంపాదించుకున్న పార్టీ కాంగ్రెస్ మౌనంగా ఉండి పోయింది. పార్లమెంటులో విశ్వనాథ ప్రతాప సింగ్, మరొక గుప్పెడు మంది మినహాయిస్తే మరెవరికీ ఈ కుంభకోణంలో మొదటి నుంచీ భాగం పంచుకుని తప్పించుకు పోదామని ప్రయత్నిస్తున్న వాళ్ళకు వ్యతిరేకంగా మాట్లాడే సాహసం లేకపోయింది. భయం వల్లనో, తమ స్వంత వ్యక్తిగత కారణాల వల్లనో నేరంలో భాగస్తులుగా మారిపోయిన పత్రికలు, సంపాదకులు ఉన్నారు. టైమ్స్ ఆఫ్ ఇండియా, టెలిగ్రాఫ్‌తో సహా. సంపాదకులు కూడా పాలకవర్గానికే చెందుతారు గనుక, లేదా ఆ వర్గానికి చెందాలని కోరుకుంటారు గనుక దీన్ని అర్థం చేసుకోవచ్చు. కాని ఇతరుల సంగతి ఏమిటి? వ్యక్తిగత సంభాషణల్లో ఒక మాట మాట్లాడుతూ, బహిరంగంగా మరో మాట చెపుతున్న 400 పై చిలుకు కాంగ్రెస్ పార్లమెంటు సభ్యుల సంగతి ఏమిటి? కే. సి. పంత్ వంటి నిజాయితీ పరుడు పార్లమెంటులో మాటల గారడీ చేసి, మాటలను సందర్భం నుంచి విడదీసి ఉటంకించి, సమర్థించడానికి వీలులేని దాన్ని సమర్థిస్తున్నారు.

ఇప్పుడు మంత్రి వర్గంలోకి కొత్త ముఖాలు వచ్చాయి. ఈ మంత్రివర్గంలో మార్పు ఏదో విప్లవమన్నట్టుగా దాని గురించి చర్చలు జరుపుతున్నారు. చెత్త బుట్ట లోంచి ఒక ఆయారాంను బయటికి తీసి, గయారాం కుర్చీలో కూచో బెట్టడం, గయారాంను అదే చెత్త బుట్టలో పారవేయడం నిజంగా ఏమన్నా మార్పు తెస్తుందా?

తమ స్వంత మాటల్లోనే అసమర్థుడుగా మహారాష్ట్ర నుంచి తోసేసిన చవాన్‌ను ఆర్థిక మంత్రిత్వ శాఖకు అధిపతిగా కూచో బెడితే, గతంలో సంజయ్ గాంధీ చెప్పులు మోసి, ఇప్పుడు ఆయన సోదరుడి చెప్పులు మోస్తున్న తివారీ లాంటి మనిషిని ఆర్థిక శాఖ నుంచి తొలగిస్తే ప్రభుత్వంలో గాని, ప్రజలకు గాని నిజంగా ఏదన్నా మార్పు కనబడుతుందా? వీళ్ళు కొత్త రకం అధికారుల జాతి. వీళ్ళను ఒక ఉద్యోగం నుంచి మరో ఉద్యోగానికి, కేంద్రం నుంచి రాష్ట్రాలకు, రాష్ట్రాల నుంచి కేంద్రానికి, అత్యున్నత నాయకుని ఇష్టానుసారం బదలాయించవచ్చు. చవాన్ మహారాష్ట్రలో ఏమీ సాధించ లేక పోయాడు. అక్కడి ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్తంగా ఉంది. దేశంలో మొట్ట మొదటి పారిశ్రామిక రాష్ట్రంగా ఉండిన మహారాష్ట్ర వెనుకబడి పోతోంది. చవాన్ చేసిన ఒకే ఒక్క మంచి పని ఠాకరే వంటి వ్యక్తులకు మార్గం సుగమం చేయడం. రాబోయే ఎన్నికలలో కాంగ్రెస్ గూండాలకూ, శివసేన గూండాలకూ మధ్య ఘర్షణ జరుగుతుంది. మంచి గూండాలు గెలవనివ్వండి.

మనం ఎందుకింత బానిసత్వంలో పడిపోయాం? కమ్యూనిస్టులు ప్రజాస్వామిక వాదులు కారని, మనం ప్రజాస్వామిక వాదులమని చెప్పుకునే మనం స్టాలిన్, బ్రెజ్నెవ్‌ల కింద రష్యన్ ప్రజానీకం ఉన్నంత బానిసత్వంలో ఎందుకు ఉన్నాం? రష్యాలో పరిస్థితులు నిజంగా మారలేదు, ఎందుకంటే ఒక రకమైన ఫ్యూడల్ ప్రభువుల స్థానంలో మరొక రకం అధికారం లోకి వచ్చారు. కమ్యూనిస్టు చరిత్ర కారులు ఏమి చెప్పినప్పటికీ రష్యన్లు విప్లవంలో భాగం పంచుకోలేదు. స్టాలిన్ నెలకొల్పిన భయోత్పాతం ఒక కారణం అయితే కావచ్చునేమో గాని, అసలు వాస్తవం, కొన్ని వేల మంది అసమ్మతి వాదులు మినహా మొత్తంగా రష్యన్లు తిరగబడలేదు. లక్షలాది మంది నిర్బంధ శిబిరాలలో కి నెట్టబడ్డారు. తమ దురదృష్టాన్ని మౌనంగా భరించారు. ఈ అవమానాన్నే మెవ్‌తుషెంకో ప్రస్తుతం విమర్శిస్తున్నాడు. గ్లైటర్‌పెలోస్ట్ మినహా ఆయన దగ్గర కూడా మరే సమాధానమూ లేదు. గ్లైటర్ పెలోస్ట్ ఉన్నంత కాలం పెరిస్త్రోయికాకు అవకాశం లేదని ఆయన అంటున్నాడు. ఎందుకంటే ప్రజలు తమ విధికి బాధ్యులు తామె అవుతారు గాని కార్ల్ మార్క్స్ పుస్తకాలో, గోర్బచేవ్‌లాంటి ప్రభుత్వపు మనుషులో బాధ్యులు కాజాలరు.

భారత దేశంలో బానిసత్వపు సహనం దాదాపు ఒక స్వభావం. ఐతే అది మనుగడకు పనికొచ్చే స్వభావం అవునేమో గాని అభివృద్ధికి మాత్రం పనికి రాదు. ఈ లజ్జా పూరితమైన స్వభావాన్ని, బానిసత్వపు సహనాన్ని, ఓరిమిని పోగొట్టుకోనంత కాలం, పాలకులతో తలపడనంతకాలం అభివృద్ధి ఉండదు, ఏ స్థాయిలోనూ చెప్పుకో దగిన ప్రగతి ఉండదు. ఈ పాలకులు ఎవరు? తన స్వంత జీవితం నడుపుకోలేని శంకరరావు చవాన్ వంటి వ్యక్తి ఆర్థిక వ్యవస్థను ఎట్లా నడపగలడు? ఆయన తొలగించబడడానికి రెండు రోజులు ముందు ఉంటాడో, ఊడతాడో ఆయనకే తెలియదు. ఉప ఎన్నికలో మరో అపజయం తన రాజకీయ సన్యాసానికి దారి తీస్తుందని తెలిసిన తివారీ ఉత్తర ప్రదేశ్‌ను ఎట్లా పాలించ గలడు. తోలుబొమ్మలాటలో కేతిగాడు, బంగారక్కల లాగ ఈ మనుషులు వస్తూ పోతూ ఉంటారు. ఆట నడిచినంత సేపు ప్రేక్షకులు పొగడ్తలు కురిపించినా, వాళ్ళు చివరికి ఆడించబడే తోలుబొమ్మలుగానే మిగిలిపోతారు. భారతదేశం వంటి దేశం తోలుబొమ్మలతో పాలించ బడుతున్నదంటే నిజంగా విచారకరం. కాని, మనకు ఇష్టం ఉన్నా లేకపోయినా, గాంధీ కుటుంబం అధికారానికి వచ్చినప్పటి నుంచీ కచ్చితంగా మనకు దొరుకుతున్న పాలన అదే– మనం గ్లైటర్ పెలోస్ట్‌ను వదులుకొని, వాళ్ళను తొలగించనంత కాలం ఇదే విధంగా పాలించబడుతూ ఉంటాం. ప్రజాస్వామ్యం అంటే వోట్ల ముచ్చట కాదు, అది ఆత్మాభిమానానికి సంబంధించిన విషయం. వంశ పాలనను కూల దోయడం మన ఆత్మగౌరవాన్ని గణనీయంగా ఇనుమడింప జేస్తుంది. □

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి!
# దంతక్షయాన్ని ఎదుర్కోండి.

Colgate
Dental Cream
Colgate
STOPS

## కోల్గేట్
## రక్షణ చక్రాన్ని పొందండి!

నోటి దుర్వాసన మిమ్మల్ని నలుగురిలో ఇబ్బంది పెట్టేస్తుంది.
మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా, మీ పళ్లు దృఢంగా, ఆరోగ్యంగా
వుంచుకోడానికై క్రమం తప్పక కోల్గేట్‌తో బ్రష్ చేసుకోండి.
కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే మరి!



మీ పళ్ల సందుల్లో ఇరుక్కుపోయిన
ఆహారకణాల్లో దుర్వాసన, దంతక్షయం
కల్గించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తిగల నురగ
లోపలికి చొచ్చుకొనిపోయి, దుర్వాసన
కల్గించే ఆహారకణాలను, దంతక్షయాన్ని
కల్గించే సూక్ష్మక్రిములను తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్‌తో పళ్లు బ్రష్
చేసుకోవడంతో మీరు శుభ్రమైన
తాజా శ్వాస, దృఢమైన, ఆరోగ్యమైన పళ్లు,
పొందగలరు.

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

Rediffusion/CP/5707 e TL

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908




శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
23.9.88; 30.9.88
విభవ నామ సం. భాద్రపద శు. ద్వాదశి;
బ. పంచమి
సంపుటము 81 : సంచికలు 5; 6

ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

సంపాదకుడు :
మతుకుమల్లి మాధవరావు

విడి ప్రతి వెల రు. 3.00
పోస్టులో 6 నెలల చందా రు. 87.10
పోస్టులో 12 నెలల చందా రు. 174.20

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి : రాధ
(ఫోటో : ఈశ్వరి)






## సీరియల్స్

29-7-88, 5-8-88, ఆంధ్రసచిత్ర వార పత్రిక శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడి మా ఇంటిల్లిపాదిని ఆకర్షించింది. చల్లాగారి పవిత్ర పాపి సీరియల్ వారం వారం మేము ఊహించని మలుపు తిరుగుతోంది. ఈ సీరియల్‌లో రాకా, దేదీప్య పాత్రలను రచయిత మలిచిన తీరు అద్భుతంగా ఉంది. ఈ సీరియల్ ప్రారంభం నుంచి ఇంటరెస్టింగ్‌గా మాచే చదివిస్తున్న రచయిత గార్కి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

–పెయ్యేటి చాముండేశ్వరి,
–నాగచండీప్రియ, శ్రీకాకుళం

* * *

'తమస్' సీరియల్ చాలా బాగుంది. చదువుతున్న కొలది మరింత ఆసక్తిదాయకంగా ఉంటున్నది.

–బి. వి. రవిశంకర్, శ్రీకాకుళం.

## కథలు

'శ్రీదేవి' ముఖచిత్రం గల పత్రిక ఆకర్షణీయంగా ఉన్నది. ఆదూరి సావిత్రి గారి 'ఇచ్చుట కోడళ్ళు తగల బెట్టబడుదురు' కథ ఆలోచింపచేసేదిగా ఉంది. మహంకాళి పాత్ర ఈనాటి గయ్యాళి అత్తలకు ప్రతీకగా ఉంది. రచయిత్రికి నా అభివందనలు.

–కె. సత్యనారాయణ, మైలవరం.

* * *

శ్రీదేవి ముఖచిత్రం స్మార్ట్‌గవుంది. "ఇచ్చుట కోడళ్ళు తగలబెట్ట బడుదురు" ఎందరో కోడళ్ళ జీవితాలు బలితీసుకున్న అత్తలకిది గుణపాఠం. ఆదూరి సావిత్రిగారు అభినందనీయులు.

–శ్రీమతి విమలాపాల్, పలమనేరు.

* * *

ఆదూరి సావిత్రి గారి "ఇచ్చుట కోడళ్ళు తగల బెట్ట బడుదురు" కథ పత్రికకే హైలెట్. చదువు చున్నంత సేపు మా హృదయాలను కదిలించింది. 'వరకట్నం' అనేది ఎంతగా జీవితాలను బలితీసుకుంటున్నదీ చక్కగా వివరించారు. ఈ కట్నానికి బానిసలైన వారికన్నా రావణుడు లాంటి రాక్షసులే నయమని వివరించిన తీరు కడు అభినందనీయంగా ఉంది. హృదయ పూర్వక కృతజ్ఞతలు.

–హరిత, సుమతి,
కొమరవారిపాలెం(నెల్లూరు)

* * *

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం పత్రికలో 'గడియారం' 'చదువు' కథలు ఎంతో బాగున్నాయి. రెండూ రెండు రకాల సందేశాల్ని అందిస్తూ కొత్తదనాన్ని చిందించాయి.

–సి. వి. నరసింహదాసు, విజయనగరం.

## హైదరాబాద్ నోట్‌బుక్

29-7-88 తేది సంచికలో హైదరాబాద్ నోట్‌బుక్‌లో సిలబస్ – పరీక్షా విధానం మారాలి అన్న గోష్ఠి చదువుకోవటానికి బాగుంది. ప్రస్తుత పరిస్థితులలో అదంతా వృధా ప్రయాస. అదే సంచికలో చదువు అన్న కథలో చదువే కావల్సింది. మేధావులందరూ నిశాని దార్ల ముందర చేతులు కట్టుకు నుంచునే ఈ రోజుల్లో ఈ నోటుబుస్సులు – ప్రణాళికలు ఎవరికోసం?

–కె. రామారావు, హైదరాబాద్

* * *

'శ్రీదేవి' ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఆకర్షణీయంగా వుంది. డా. బ్రహ్మానందగారితో గోష్ఠి ఆసక్తిదాయకంగావుంది. –దామెర్ల గీత, నెల్లూరు

## గమనిక :

**9.9.88; 16.9.88 సంచికలోని 80వ పేజీలో ప్రచురించిన మనోహర్ అయిచ్ వ్యాసంలో పొరపాటున అయిట్ అని పడింది. పాఠకులు గమనించకోరుతున్నాము. అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము.** –సం.



సీరియల్

# వినాయక రావు పెళ్లి





మల్లాది వెంకట కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

బయటవున్నవాళ్ళలో ఒక్కరూ పెదవి విప్పలేదు. అందరినోటికి ఇంటూ ఆకారంలో తెల్లటి బేండేజీలు అతికించివున్నాయి. ఒకొక్కరిచేతిలో వాసంబద్దలకి మేకుతో కొట్టిన కార్డుబోర్డు అట్టలున్నాయి. తెల్లకాగితాలు అతికించిన వాటిమీద అనేకరంగుల్లో, స్కెచ్‌పెన్స్‌తో నినాదాలు రాసి వున్నాయి.

"ఆదిలక్ష్మి పెళ్ళి ఇతరులతో జరగడానికివీల్లేదు."

"ఆదిలక్ష్మి పెళ్ళి వినాయకరావుతోనే జరగాలి."

"ఆదిలక్ష్మి, వినాయకం ప్రేమ పెళ్ళికి అడ్డువచ్చే రమణమూర్తి మనసుమార్చుకోవాలి."

"ఆదిలక్ష్మితో వినాయకరావుపెళ్ళికోసమే మా పోరాటం."

అందరికన్నాముందు తేరుకొన్న పెళ్ళికొడుకు తండ్రి అడిగాడు రమణమూర్తిని –

"వీళ్ళంతా ఎవరు?"

"మా ఇంట్లో అద్దెకుండేవెధవలు" పళ్ళు పట పట కొరికి చెప్పాడు రమణమూర్తి.



జరిగిన కథ- 19: కామేశానికి ఎయిడ్స్ వ్యాధి ఉందని రమణమూర్తికి అనుమానం కలుగుతుంది. ఆదిలక్ష్మి నాదకర్ణి మనస్సులో కూడా అనుమానాన్ని ప్రవేశపెట్టి మొత్తానికి పెళ్ళి ప్రసక్తి రాకుండా చేస్తుంది. ఆదిలక్ష్మికి, వినాయకరావుకు పెళ్ళి చేసే ఆలోచన ససేమిరా లేదని రమణమూర్తి స్పష్టంగా చెప్పేస్తాడు. ముదునూరుకు కామేశం సినిమా కంపెనీ షూటింగ్‌కు రావడం కామేశం, సుబ్బలక్ష్మి మనసులు కలవడంతో పెళ్ళి సులభంగా జరిగిపోతుంది. రమణమూర్తికి సంఖ్యా శాస్త్రంలో నమ్మకం ఉండడంతో అటువైపు నుంచి ప్రయత్నిద్దామని శాస్త్రి సలహా చెప్తాడు. ఆదిలక్ష్మిని చూడడానికి వచ్చిన పెళ్ళి వారిని పథకం ప్రకారం ఇరుగు పొరుగు వాళ్ళు ఆశ్చర్యపరుస్తారు.

"ఇదంతా ఏమిటి?" అడిగి ంది పెళ్ళికొడుకు తల్లి.

"నేను ఇప్పుడే చూస్తున్నాను" చెప్పింది కనకమహాలక్ష్మి ఆదుర్దాపడిస్తూ.

"వినాయకరావు ఎవరు?" అడిగాడు పెళ్ళికొడుకు.

"ఆ తెల్లబట్టల్లోవున్న కుర్రాడు మా ఇంట్లో ఆ గదిలో అద్దెకుంటాడు" చెప్పింది కనకమహాలక్ష్మి.

"మీ అమ్మాయి, ఆ అబ్బాయి ప్రేమించుకుంటే, ఆ సంగతి తెలిసి మధ్యలో ఈ పెళ్ళిచూపులెందుకండి? అసలు మమ్మల్నెందుకు పిలిచారు, దరిద్రంగాను?" పెళ్ళికొడుకు తండ్రికోపంగా రమణమూర్తిని ప్రశ్నించాడు.

ఆయనకి వెంటనే ఏం సమాధానం చెప్పాలో తట్టలేదు. తడబడిచెప్పాడు –

"ఈ ప్రేమ పుట్టింది. అందరి అద్దె ఈ నెలసించిపెంచానన్న కోపంతో ఈ ఎత్తువేసివుంటారు. మీరు వాళ్ళని నమ్మకోకండి" చెప్పాడు రమణమూర్తి.

"ఏమే?" అడిగాడు రమణమూర్తి తన భార్యవంకచూసి, వాళ్ళు నమ్మినట్లు కనపడకపోతే, సపోర్ట్ కోసం.

"అక్షరాల అంతేనండి. మా అమ్మాయికి అసలు తప్పులేకుండా తెలుగులో ప్రేమ ఎలారాయాలో కూడా తెలీదంటే నమ్మండి" ఆవిడబదులు చెప్పింది.

"ఏమయ్యా? ఇదంతా నిజమేనా?" పెళ్ళికొడుకు తల్లి వినాయకరావు దగ్గరకివెళ్ళి అడిగింది.

అతను అవునన్నట్లుగా తనచేతిలోని ఆదిలక్ష్మితో వినాయకరావు పెళ్ళికోసమే ఈ పోరాటం అని రాసివున్న ప్లే కార్డ్‌ని ఓ సారి పైకి కిందకి ఆడించాడు. తర్వాత జేబులోంచి దూదితీసి రెండు చెవుల్లోపెట్టుకున్నాడు. మిగతావాళ్ళు అతన్ని అనుసరించి ఆ పనిచేశారు.

"ఇంకా నిలబడ్డావేమిరా వెధవా ఖానా. పద" పెళ్ళికొడుకు అక్కయ్య పెళ్ళికొడకు చేతినిపట్టుకుని నడిపించుకుపోయింది.



"నా మాట వినండి" అంటూ వాళ్ళవెంటపడ్డ రమణమూర్తిని ఛీత్కరించి చెప్పాడు పెళ్ళికొడుకు.

"మీ అమ్మాయి మనసున్న చోటే మనువు కానీండి. ఆ తర్వాత కలియుగ భారత, రామాయణాలు నేను పడలేను."

వాళ్ళు వెళ్ళిపోగానే రమణమూర్తి అందరివంకా రౌద్రంగా చూస్తూ అరిచాడు –

"నా పిల్ల పెళ్ళి పాడుచేసి ఏంబావుకుంటారు. ఖాళీచేయండి. మీ రంతా ఇరవైనాలుగ్గంటల్లోగా ఖాళీచేయండి. చేసితీరాలి. అంతే."

శతభిషం చేతిలోని ప్లే కార్డ్‌ని తిప్పాడు –

"ఖాళీ చెయ్యం" అని వెనకపక్క రాసుంది.

ఆయన భార్య తనచేతిలోని ప్లేకార్డ్‌ని తిప్పింది. దానివెనక 'అట్టే గొడవచేయక ఆదిలక్ష్మిని వినాయకానికిచ్చి పెళ్ళికానివ్వు. లేకపోతే నా ....' అని రాసివుంది.






## వినాయకరావు పెళ్ళి

'లేకపోతే? లేకపోతే ఏంచేస్తారు? అరిచాడాయన చిందులుతొక్కుతూ

చిట్‌ఫండ్‌కంపెనీలో పనిచేసే అతని భార్య 'తన చేతిలోని ప్లే కార్డ్‌ని తిప్పింది దానిమిద ఇలావుంది –

లేకపోతే ఈ ఇంటిని రెంట్‌కంట్రోల్ వాళ్ళని స్వాధీనపరచుకోమని అప్లికేషన్ పెడతాం'

అది రమణమూర్తికి ఇంకో షాక్! ఆయన, ఆయన కుటుంబం బ్రతికేది ఆ ఇంటి అద్దెలతోనే ఆయనకొచ్చే పెంక్షన్ ఓ నెలకి ఓ పిచ్చుక కూడా సుఖంగా తినలేనంత తక్కువ

'మీ అఘాయిత్యాన్నిభరించలేను మీ అందరిమీద పోలీసుకేసు పెడతాను నన్ను బ్లాక్‌మెయిల్‌చేసి నా కూతురిబ్రతుకు నిప్పుల్లోకి తోస్తున్నారని 'న్యూసెట్టుడే వాళ్ళని పిలిచి చెప్తాను అరిచాడాయన పిచ్చికోపంతో

వద్దండి మనమ్మాయిగురించి పేపర్లోకెక్కితే ఇక ఏ సంబంధం వాళ్ళయినా, కనీసం పెళ్ళిచూపులకయినా వస్తారా? అడిగింది కనకమహాలక్ష్మి బాధగా

ఆఖరిగా వినాయకరావు తన చేతిలోని ప్లే కార్డ్‌ని వెనక్కి తిప్పాడు

రమణమూర్తి మామగారు మా పెళ్ళికి వప్పుకోండి లేదా అని రాసివుంది

లేదా ఏం చేస్తారోయ్? అడిగాడు రమణమూర్తి కోపంగా

చేతిలోని ప్లే కార్డ్‌ని కిందపడేసి నోటికున్న ప్లాస్టర్‌ని తీసాడు వినాయకరావు సమాధానం చెప్పడానికి అప్పుడే బయటనించి లోపలకి అడుగుపెడుతున్న శాస్త్రి అక్కడిదృశ్యం చూసి, షాక్‌తిన్నట్టుగా ఓ ఫీలింగ్ ఇచ్చి పరిగెత్తుకుంటూవచ్చి అడిగాడు –

ఏవిటండి? ఏమిటిదంతా? ఏమిటీ గొడవ వినాయకం నీవు ఆఫీసుకిరాకుండా? ఏమిటండి రమణమూర్తిగారు ఈ తతంగం? నాకేం అర్థంకావటంలేదు

దుఃఖంతో రమణమూర్తి నోరు పెగల్లేదు. వినాయకరావే చెప్పాడు

ఆదిలక్ష్మికి పెళ్ళిచూపులు ఏర్పాటుచేసినప్పుడల్లా ఇక్కడజరిగే తతంగం ఇది

"ఛట్ అప్రాచ్యుడా, నీకు ఆదిలక్ష్మిని పెళ్ళిచేసుకోవాలనివుంటే ఇదా మామగారిని, పిల్లని అడిగేపద్ధతి? నో అంతపెద్దాయన్ని ఇలా అవమానించడం బావ్యంకాదు నీకుపుట్టగతులుండవు అని గుర్తుంచుకో




నేనేమైపోయినా సరే – ఆయన మా పెళ్ళికి వప్పుకోనిపక్షంలో ఈ శాంతి యుద్ధం చేసితీరుతాను సాటి వీళ్ళంతా సపోర్ట్‌గావున్నారు

అవును మేం సపోర్ట్‌గా వుంటాం అని అంతా నోటికున్న ప్లాస్టర్స్ తీసి గట్టిగా అరిచారు

ఇదెక్కడి గోలరా? చెప్పింది కనకమహాలక్ష్మి వూరికినే

శతభిషం చేతిలోని ప్లే కార్డ్‌ని విసిరేసి, చెవుల్లోంచి దూదితీసి పారేస్తూ చెప్పాడు –

చూడండి కనకమహాలక్ష్మిగారు – వినాయకరావు తాగుబోతు, తిరుగుబోతు అయితే మేం ఇలా అనేవాళ్ళంకాము ఆరేడు నెలలనించి చూస్తున్నాం అతనెంత మంచివాడో – ఆఖరికి చుట్ట బీడీ సిగరెట్ కూడా అలవాటుకాని మనిషి కులాలు కలిసాయి గోత్రాలు వేరు మంచి వుద్యోగంలో వున్నాడు మనసు పడ్డాడు ఆదిలక్ష్మి కూడా తండ్రి సరేనంటే సరేనంటుంది అలాంటప్పుడు ఎందుకు ఈ సంబంధం కాదని ఆయనగారు పరాయి సంబంధం తీసుకురావడం? ఎందుకు? చెప్పమనండి

'అవును ,చెప్పమనండి వినాయకరావులో ఏం లోపం ఏం అవలక్షణం వుందో చెప్పమనండి బట్టలకొట్టతను ఎడం అరచేతిలో కుడిచేతి గుప్పెటని కొడుతూ అడిగాడు కోపంగా

కనకమహాలక్ష్మి భర్తవంక చూసింది సమాధానం చెప్పమన్నట్టుగా

ఎందుకా? మా ఆది పెళ్ళి కామేశంతో కాకుండా చెడకొట్టినందుకు

అది నా పాపం వినాయకరావుకి ఆ పాడు సలహాయిచ్చింది నేనే చెప్పాడు శాస్త్రి వెంటనే

రమణమూర్తి ఆ మాటలు నమ్మలేదు

ఊర్కోవయ్యా! ఎవరయినా ఏంతో నవ్వపోతారు నువ్వేంటి? అలాంటి పాడుసలహాలివ్వడం ఏమిటి? ఇది ఆ వినాయకరావు పుర్రెకిపుట్టినబుద్ధే చెప్పాడాయన

పోనీ అలాగే అనుకోండి. జరిగిందేదో జరిగిపోయింది. అతనెందుకా పనిచేసినట్టు? మీ అమ్మాయిమీద ప్రేమతో నేగా? మీ అమ్మాయిని అంత గాఢంగా ప్రేమించే అబ్బాయిని మీ అల్లుడిగా చేసుకోవడంతో మీ అమ్మాయి ఎంత సుఖపడుతుందో ఆలోచించారా?' అడిగాడు చిట్‌ఫండ్ కంపెనీ అతను

'అన తీ ప్రేమ, డ్రామా లంటే నా కసహ్యం కుండబద్దలుకొట్టినట్టు చెప్పాడు రమణమూర్తి

'ఆల్‌రైట్ అసహ్యమే అలా అనిచెప్పి, మీ పెద్దమ్మాయిలా ఆదిని వినాయకం లేవదీసుకుపోలేదే కాళ్ళుకడిగి కన్యాదానం చేయమని మీ కాళ్ళమీద పడుతున్నాడు అతనిమాటని మన్నించి మీరు శాస్త్రప్రకారం వివాహంచేసారా సరే లేదా మీకు నచ్చని మీ పెద్దల్లుడు పద్ధతికి వచ్చేస్తాడు భాగ్యలక్ష్మి చెప్పింది

అవును అలావద్దామనుకుంటున్నాను' చెప్పాడు వినాయకరావు

"ఓసారి మీ ఇంట్లోంచి బయటకి కాలుపెట్టాక, మేమంతా గలిసి ఏ గుళ్ళోనో వాళ్ళిద్దరికీ వివాహంజరిపించాక ఇక మీ అమ్మాయిని మీరేం అనలేరు ఎదిరిమస్ట్ ఇంటికిరానివ్వరు. అంతేగా" చెప్పింది బట్టలకొట్టతనిభార్య

"ఇలాంటప్పుడు కాంటాంట్‌లోని పెద్దమనుషులం నలుగురం కల్పించుకురటే కానిపనికాదు" శతభిషంచెప్పాడు

'ఆ, తర్వాత ఈ ఇంటిని రెంట్‌కంట్రోలుకి అప్పగించకపోతే నా పేరు వినాయకరావు కాదు' బెదిరించాడు వినాయకరావు.

"ఇదంతా మరీ దౌర్జన్యంగా వుందే" చెప్పాడు రమణమూర్తి కళ్ళనీళ్ళతో

'వెళ్ళండి మీ రంతా ఇళ్ళల్లోకి వెళ్ళండి ఆయన్ని కాస్త ఆలోచించుకోనివ్వండి. ఇలాంటివి నిమిషాల్లో తేల్చేవ్యవహారాలు కావు రండి మాష్టారు మీరు ఇంట్లోకిరండి' శాస్త్రి అందరికీ సర్దిచెప్తున్నట్టుగా చెప్పాడు.

# నా ప్రపంచమే తలక్రిందులై పోయేది...



## నేను న్యూ ఇండియాతో పశువుల భీమా చేయించి వుండకపోతే



### నా ఎద్దులు చచ్చిపోయాయి, కాని పని మాత్రం ఆగి పోలేదు
### ఎందుకంటే, న్యూ ఇండియా సహాయంతో కొత్త ఎద్దులు కొనుక్కోగలిగా.

రైతుకు అతడి ఎద్దులు ఎంత విలువైనవో, అతడికి, అతడి కుటుంబం వారికి బాగా తెలుసు. కాని, ఆ ఎద్దులకు రోగమొస్తే, ప్రమాదంలో దెబ్బ తగిలి పనికి రాకపోతే... లేదా చచ్చిపోతే? అలాంటప్పుడు న్యూ ఇండియా ఎష్యురెన్స్ ఒక మంచి నేస్తంలా మీకు ఆధారంగా నిలుస్తుంది.

**న్యూ ఇండియా ఎష్యురెన్స్ వారి పశువుల భీమా**

ఒక ఏడాదిలో, పశువుల ఖరీదును బట్టి, ప్రతి 100 రూపాయలపై గరిష్ఠం 4 రూపాయలు చెల్లిస్తే చాలు! దేశమంతటా న్యూ ఇండియా ఎష్యురెన్స్ వారివి దాదాపు 1000 కార్యాలయాలు వున్నాయి. ఎక్కువ వివరాల కోసం నేడే మీ ఏజెంట్‌ను కలవండి లేదా మీకు దగ్గరలోని కార్యాలయానికి విచ్చేయండి.

## న్యూ ఇండియా ఎష్యురెన్స్




జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ

**పశువుల భీమా-నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం!**

R K SWAMY/NIA/3574/TEL

## వినాయకరావు పెళ్ళి

ఈ విషయం ఈ క్షణంలో ఇక్కడతేలాలి

ఏం? ఎందుకు తేలాలి? ఏమిటీయన బడాయి?" అడిగాడు శాస్త్రి వినయకరావు మీదకివెళ్ళి

'నే నీ హొ టల్‌తిండి తినలేకపోతున్నాను. పెళ్ళిచేసుకుని ఇంటి వంట తినమని డాక్టర్ చెప్పాడు'

శాస్త్రి వినాయకరావు కాలర్‌పట్టుకుని చెప్పాడు గట్టిగా –

కొట్టానంటేనా – వెళ్ళి కాలవలో పడతావ్! జాగ్రత్త ఏం రెంట్‌కంట్రోల్‌లో పెడితే మా కేమయన భయమా? సుప్రీంకోర్టు దాకా వెళ్తాం గెలిచినా, ఓడినా "

ముందు చొక్కా వదులు

ముందు నీవు నోరు ముయ్యి.'

'నా నోరు నా ఇష్టం నేను ముయ్యను

'అయితే నేను వదలను

'గూబ గుయ్యిమంటుంది జాగ్రత్త.

' చూసాం చాలా మందిని

వాళ్ళిద్దరి పోట్లాటచూసి, అది నిజం అనుకుని చెప్పాడు రమణమూర్తి శాస్త్రితో, వినాయకరావు చొక్కా బలవంతంగా విడిపిస్తూ –

'నువ్వూరుకోవోయ్ శాస్త్రి

'మీ రూరుకోండి మాష్టారు వీడి సంగ తేమిటో ఇవాలే తేల్చేస్తాను రెచ్చిపోయాడు శాస్త్రి.

అంతా కలిసి వాళ్ళని విడిపించారు

"నీవు లోపలకి రాబాబు. కాస్తంత మజ్జిగ తాగు ముందు చల్లబడతావు.'

రమణమూర్తి శాస్త్రిని తన పోర్షన్‌లోకి తీసు కెళ్ళాడు

"మీ రెండుకు అడ్డం వచ్చారండి వాడి రక్తం కళ్ళజూసేవాణ్ణి పిల్ల నడిగే పద్ధతి ఇదాండి తప్పయి పోయిందని బ్రతిమా లచ్చుగా మరీ ఇంత ఘోరట్వంటీ బిజినెస్సా?'

"ముందు ఈ మజ్జిగ తాగు బాబు" భార్య తెచ్చిన మజ్జిగ గ్లాసు శాస్త్రి చేతి కిచ్చాడు

శాస్త్రి వినాయకరావు గది వైపు చూస్తూ, రేయ్ వినాయకం! ఈ రోజు నీ అంతు చూడకపోతే చూడు అని అరిచాడు.

ముందు మజ్జిగ తాగనివ్వనా" కోప్పడ్డాడు రమణమూర్తి

శాస్త్రి గ్లాసులోని మజ్జిగని గటగట తాగేసాక చెప్పాడు–

'కుర్రాడివి 'నీకు ఆవేశం ఎక్కువ నాలా వయసొస్తే కాని నెమ్మది తనం రాదు

'నిజమే నండి మజ్జిగ తాగబట్టి తగ్గింది కాని లేకపోతే భలే ఆవేశం వచ్చిందండి'

చిన్నగా నిట్టూర్చి చెప్పాడు రమణమూర్తి –

ఇంత జరిగాక ఆదిలక్ష్మిని పరాయి వాళ్ళ కిచ్చి ఎలా కట్ట బెట్టను రహస్యంగా పెళ్ళి చేసినా పెళ్ళయ్యాక ఈ సంగతులన్నీ అల్లుడికి ఈ ముదనష్టపు వాళ్ళలో ఎవరయినా చెప్తే కాపరమే కూలిపోవచ్చు. వాళ్ళన్నట్టు అతనికేం తక్కువ?'

ఆ మాటలు వినగానే కనక మహాలక్ష్మి, ఆదిలక్ష్మి ఆనందంగా ఒకరి మొహాల్లు మరొకరు చూసుకున్నారు

'ఏం తక్కువ లేదని? ఆ గుండా గాడికిస్తారా? శాస్త్రి గట్టిగా అడిగాడు.

'మళ్ళీ రెచ్చిపోకోయ్ రాత్రికి అన్నంలోకి మజ్జిగ వుండదు. అలాంటి వాడు అల్లుడయితే ఇంటికి ఎలాంటి వాళ్ళు అద్దెకి వచ్చినా వాళ్ళతో వేగ గలుగుతాడు పెద్దల్లుడు బాగా మెతక, నా కెలాగూ కొడుకులు లేరు. ఒక అల్లుడయినా గట్టి వాడవుతే మంచిదని పిస్తోంది."

"అయితే మాత్రం? మిమ్మల్ని ఎన్నేసి మాట లన్నాడు మీరు ముసలి నక్కట పిచ్చి కుక్కట. పుచ్చు వక్కట కక్కలేక, మింగలేక ఇంత కాలం చెప్పలేదు అలాంటి వాడి కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తారా? నో! నేనొప్పను

మొన్న మా కామేశం గాడి పెళ్ళిలో చూసాగా, వాళ్ళూ స్థితి మంతులే. పోనీలే, ఏదో కుర్రాడు, నీలా ఆవేశంలో ఏవో వాగి వుంటాడు.'

'స్థితి మంతుడయినా వాళ్ళ నాయనకి కట్నం ఆశెకట్టి పైగా పోనీలే ప్రేమ పెళ్ళి గదా అని వూరుకోడు."

మగ పిల్లకాయల్ని కన్న వాళ్ళ కుండే ఆశ అది. నా తర్వాత ఎవరి కివ్వాలినేను? అదేదో ఇప్పుడే కట్నం పేరిట ఇస్తే పోలా!

మరీ లక్షన్నరా?"

"అంత తక్కువటోయ్? అయిదారు దాకా సిద్ధపడ్డాను నేను."

ఇలా పెళ్ళికి వప్పుకున్నారు. రేపు మీకు పుట్టబోయే మనవడి పేరు కూడా ఫలానా పెట్టాలని లేదా రెంట్ కంట్రోల్‌కి, వెళ్తామని ఈ అద్దెకుండే వాళ్ళు చీటికీ మాటికీ బెదిరిస్తే? మీరు లొంగి పోకూడదండి"

"అంతే నంటావా?", ఆలోచనగా అడిగాడు రమణమూర్తి.

'అంతేనండి.

## గడుసులోకం

— బాపు



# నాటి పెళ్లిముచ్చట్లు

 

## కల నిజమాయెగా!

మా పెళ్లి ఉదయం ముహూర్తం 10 గం.లకు జరిగింది. మా వారికి పెళ్లికొడుకు ముస్తాబు, ఆ తంతులు అన్నీ విసుగే, పట్టు పంచె ఎగదోసుకుంటూ ఒకటే చిరాకు పడుతూ పురోహితుడితో పెళ్ళంతా గంటలో కానిచ్చెయ్యాలి అన్నారట, మా మామగారు వినకుండాను. మాకు ఒక్కడే కొడుకు మంత్రాలవీ దాటియ్య వద్దని మామగారు చెప్పారట. ఇద్దరి మధ్య పురోహితుడి పాట్లు చూసి తీరాలి. సూత్రధారణకి చాలా టైము మిగిలింది. డ్రస్ మార్చుకొస్తానని వెళ్లిన శ్రీవారు ఫేన్ క్రింద కూర్చుని సిగరెట్లు కాలుస్తూ, అరమోడ్పు కన్నులతో కలలకంటున్నారుట. నేను అరగంట బుట్టలో కూర్చుని, కూర్చుని విసిగిపోయాను. ఆయన మీద పీకల దాకా కోపం వచ్చేసింది. వంటరిగా నా అవస్థ చూసిన పురోహితుడు 'పెళ్లికొడుకు భయం చేత అన్నీ స్పీడ్‌గా కానిచ్చేశానమ్మా రేపటి నుంచి ఆయన నీ చేతిలో 'మనిషే'' అన్నాడు నవ్వుతూ. అది విని అందరూ నవ్వేశారు. తీరిగ్గా టైముకి వచ్చి తాళి కట్టారు శ్రీవారు.



–పెద్దాడ సీతాలత, తణుకు

---

"అసలు నేను నీలా ఆలోచించలే దెందుకా అన్న ఆలోచన ఆలస్యంగా కలిగిందోయ్. అసలు మనం వాళ్ళకి ఎందుకు లొంగాలి?" అడిగాడు రమణమూర్తి.

ఈసారి కనక మహాలక్ష్మి, ఆదిలక్ష్మి భయంగా చూసుకున్నారు ఒకరి మొహాల వంక మరొకరు. తను "ఓవర్ ప్లే" చేసానని ఆలస్యంగా గ్రహించిన శాస్త్రి వెంటనే చెప్పాడు–

"అవన్నీ పక్కన వుంచండి. సంఖ్యా శాస్త్రం ప్రకారం వినాయకరావు పుట్టిన రోజు, మీ అమ్మాయి పుట్టిన రోజు కుదరాలిగా. ముందు అది చూడండి. కుదిరితే చేసేయండి. కట్నం కూడా కొంత ఆదా అవుతుంది. కుదరక పోతే మానేయండి."

"అలా అయితే అసలిద్దరి జాతకాలు కుదరనే లేదు."

వినాయకం వెంటనే ఆ గదిలోకి వచ్చాడు, చేతిలో ఓ వుత్తరంతో.

"మామగారూ ఇందాక బయట జరిగిం దానికి నన్ను పెద్ద మనసుతో క్షమించి ఈ వుత్తరం చదవండి. మా అమ్మ రాసింది."

"ఏమిటా వుత్తరం?" అడిగాడు రమణమూర్తి.

"ఈ నెల్లో నా పుట్టిన రోజుట. ఇంగ్లీష్ తేదీ రాయకుండా బహుళ శుద్ధ పాడ్యమి నాడు" అంటూ ఏమిటో రాసింది. దీనికి సరివ దే ఇంగ్లీష్ తేదీ ఏదో కేలండర్ చూసి చెప్తారా?" అడిగాడు వినాయకరావు.

"నీ పుట్టిన రోజు ఈ నెలా? నవంబర్‌లో కాదూ?" అడిగాడు రమణమూర్తి ఆశ్చర్యంగా.

"కాదండి. ఈ నెలే. నవంబర్‌లో అని మీ కెవరు చెప్పారు?"

"మా అమ్మాయి."

"మీ కెలా తెలుసండి?" అడిగాడు శాస్త్రి ఆదిలక్ష్మిని.

"ఆయనే ఓ సారి చెప్పారు."

"నవంబర్‌లో వచ్చింది నా పుట్టిన రోజు కాదండి. మా నాన్నగారిదని చెప్తే మీరు నాదని పొరబడి వుంటారు. మా అమ్మ తప్పు రాయదుగా. నేను పుట్టింది మార్చి నెల."

ఆయన వెంటనే ఓ తెల్ల కాగితం తెచ్చి గబగబ ఏవో లెక్కలు వేయసాగాడు. ఆ తేదీతో దాదాపు ఇరవై నిముషాలు కుస్తీ పట్టాడు. భాగహారాలు, ఇంటూలు, మైనస్‌లు, ప్లస్‌లు అన్నీ అయాక వచ్చిన "ఈజ్ ఈక్వల్‌టు" తొమ్మిది.

తొమ్మిది!

ఆయన మొహంలో సంతోషం గోచరించింది. మరోసారి లెక్క తప్పో రైటో సరి చూసుకుని చెప్పాడు–

"అరె! మా అమ్మాయి జాతకంతో నీది సరిపోయిందే!"

"జాతకం సరిపోవడం ఏమిటండి?" అడిగాడు వినాయకరావు ఏం తెలీనట్టు.

"నీడేట్ ఆఫ్ బర్త్, మా అమ్మాయిది సంఖ్య శాస్త్రం ప్రకారం సరిపోయాయి. ఆ కామేశ్వరరావు డేట్ ఆఫ్ బర్త్ కన్నా నీది ఇంకా కరెక్ట్‌గా సరిపోయింది. వాడికి తొమ్మిది రావడానికి రెండు పాయింట్లు తగ్గాయి."

"అయితే ఇంకేమండి? ఉన్న ఆ ఒక్క అనుమానం కూడా తీరిందన్న మాట." సంతోషంగా చెప్పింది కనక మహాలక్ష్మి.

"అవునే. అస లందువల్లే అనుకుంటా ఆ సంబంధం తప్పి పోయి ఇది కుదరటం."

"సంబంధం కుదరటం ఏమిటండి?" అడిగాడు వినాయక రావు అమాయకంగా.

రమణమూర్తి కాసేపు ఆలోచించి చెప్పాడు–

"కూర్చో!"

అతను కూర్చున్నాక చెప్పాడు–

"ఇందాక నీతో పాటు అల్లరి చేసిన వాళ్ళందర్నీ ఖాళీ చేయిస్తాను. అందుకు శిక్షగా అన్న మాట. నీకు వేసే శిక్ష ఈ ఇంట్లో శాశ్వత ఖైదు. అంటే ఈ ఇంటి అల్లుడు అవబోతున్నావన్న మాట."

"అంటే మీరు మీ అమ్మాయిని.... వప్పుకున్నారన్న మాట?" అడిగాడు వినాయకరావు ఆనందంగా.

"ఆహా. పూర్తిగా మీ అమ్మ, నాన్నల అడ్రస్ ఇస్తే నేను వెళ్ళి వాళ్ళని కలవాల్సిన అనవాయితీ. ఇతర మాటలు మాట్లాడేసుకుని వస్తాను" చెప్పాడు రమణమూర్తి.

వెంటనే జేబులోంచి ఓ కాగితం తీసిచ్చి చెప్పాడు వినాయకరావు–

"ఇది మా నాన్నగారి చిరునామా. మా వూరికి రైల్లో, బస్సులో వెళ్ళే రూట్లు వివరాలు. ఏ టైంలో మా నాన్న పొలంలో, ఏ టైంలో ఇంట్లో దొరుకుతారో కూడా రాసాను."

రమణమూర్తి దాన్ని తన జేబులో వుంచుకుని వినాయకరావుతో చెప్పాడు–

"నా కన్ని విధాలా నచ్చితే తప్ప, నీ బెదిరింపులకి లొంగి కాదు నీకు పిల్లనిస్తుంట."

"ఎలా అనుకున్నా ఒకటే లెండి" చెప్పాడు శాస్త్రి.

ఆదిలక్ష్మి మొహం ఆనందంతో వెలిగి పోతూంటే, సిగ్గుతో లోపలకి వెళ్ళి పోయింది. ఆయన తన భార్య వైపు తిరిగి చెప్పాడు–

"ఏమే కనకం. మా అందరి నోళ్ళల్లో ఇంత చక్కెర పోయాలని కూడా నేనే చెప్పాలా?"

"చక్కెరేం ఖర్మండి. నిన్న రాత్రి మీ ఇంట్లో కజ్జికాయలు చేసినట్టున్నారు?" చెప్పాడు శాస్త్రి.

ఆ విధంగా వినాయక రావు, ఆదిలక్ష్మిల పెళ్ళి తంతు అనేక కష్టాలు, గాలి దుమారాలు, అవాంతరాలు ఎదుర్కొని ఓ కొలిక్కి వచ్చింది.

ఇల్లలకగానే పెళ్ళయినట్టు కాదుగా. ఇక ముందు ముందు ఏం అవుతుందో చూడాలి మరి.

(ఇంకావుంది)

# ప్రశ్నావళి

## కె.రామలక్ష్మి



**బి. డి. నారాయణపేట**

★ అలహాబాదు నుండి పోటీ చేయమని రాజీవ్ గాంధీ నుండి పిలుపు వస్తే పోటీ చేస్తారా?

● పిచ్చా! వెర్రా. అని టెలిగ్రాం పంపుతాను ముందు. తరువాత మీ నాయకులకున్నంత భాషా జ్ఞానం నాకు లేదు. మీ పార్టీ పరువు దిగజార్చేలాగా నేను ఎలా మాట్లాడగలను? అని ఓ ఉత్తరం రాసి పారేస్తా. (కాంగ్రెస్ నాయకులు ఆంధ్రలో చేస్తున్నది అదే కద!) ఇంకా పీడిస్తే – వెళ్ళి త్రివేణీ సంగమంలో మునిగి "క్షమించు రాజీవా! నేను రాజకీయాలు ఇక్కడ వదిలాను" అంటాను.

★ తమరికి ఓపిక తగ్గిందన్నారు. ఇంకాస్త నశిస్తే.. గుడ్‌బై చెప్పక కూతురికి వారసత్వం యిచ్చి మా సందేహాలు తీర్చండి.

● ఓపిక శరీరానికి తగ్గుతుంది. బుర్రకి కాదు. బుర్ర వారసత్వంగా రాదుకదా... ప్రమాదంలేదు!

★ ఇతర దేశాలు అప్పు యిచ్చేటప్పుడు వడ్డీ తీసుకుంటాయా?

● ఎందుకు తీసుకోరు? వడ్డీకాదు - ఒక్కొక్క సందర్భంలో దేశపు ఆత్మాభిమానాన్నే కుదువ పెట్టుకోడం జరుగుతూ వుంటుంది. అప్పిచ్చేవాడు– లాభం లేకుండా యిస్తాడా?

**ఎన్. ఎన్. లక్నో**

★ టెర్రరిస్టులకి మచ్చ వేస్తే పారిపోయినా సులభంగా పట్టుపడతారు. ఉత్తర హిందూస్థానంలో పరిస్థితులు కె. ఆర్. గారికి తెలియును. పోలీసుల నుంచి తప్పించు కున్నవారు, విదేశాలకు పోయిన వారు– నిజంగా యిలా మచ్చవుంటే పట్టుబడే వారే (26/2)

● ఇది మరీ బాగుంది. కొబ్బరి చెట్టుకి మడిబట్ట కట్టితే కాయ లెత్తుకు పోరన్నట్టుంది గోల! మనిషిని పట్టి– ఏదీ మచ్చ? అని వెతికేదాకా టెర్రరిస్టు వూరుకుందుకేం చెవులో పువ్వు పెట్టుకున్నాడా?! అయినా ఇన్‌ఎడిబుల్ ఇంకు కనిపెడితే దాన్ని తుడిచేది కనిపెడ్తాడు– మనిషి. ఓటు మచ్చులు తుడిచి ఒకటికి మూడసార్లు, ఓట్లు వేసినవారిని చూడలేదా!?... అయినా ఆ సమాధానం– నేను అనుభవించిన స్త్రీని తిరిగి అనుభవించ వలసి రావలసిన ప్రమాదంలో పడకుండా "మచ్చ" వేస్తాననడం అభ్యంతరం అని సూచించారు. టెర్రరిస్టులకి, దొంగలకి మచ్చ లెందుకు?.... రాజకీయ వేత్తలకి వేస్తే లాభం వుంటుందేమో ఆలోచించడం మంచిది– ఏ ఎండ కే గొడుగు పడుతున్నారో సులభంగా పట్ట వచ్చునేమో!

**కె. ఎన్. గూడూరు**

★ ప్రతి వ్యక్తి సేవా ప్రజానీకానికి ఎంత ఉపయోగమో అంత అభివృద్ధికి నోచుకుంటారని విస్మరించ రాదు.

● ఎవరు?! తనకు మాలిన ధర్మం చేయరాదని మనకి పెద్దలేకద నేర్పింది!

**టి. ఎస్. ఆర్. నందిగామ**

★ ప్రేమ వివాహాలన్నీ జీవితాంతం కలతలు కన్నీరు లేకుండా సుఖాంతంగా జరుగు తున్నాయంటారా?

● ఎవరూ– ఈ వివాహం సుఖాంతం అవుతుంది అని ఖచ్చితంగా చెప్పలేరు– కథలో అయితే తప్ప ఇద్దరు వ్యక్తులు రోజు కిరవై నాలుగ్గంటలు– మూడొందుల అరవై అయిదు రోజులూ కలిసి ఒకే కొంపలో బ్రతుకు తున్నప్పుడు– కలతలూ, కన్నీరూ తప్పవు. వీటిని అధిగమించ కల్గిన స్నేహబంధం వుంటే– ఆ పెళ్ళి సక్సెస్ అనుకోవాలంతే.

**ఎం. ఆర్. వి. ఆర్. సికింద్రాబాదు.**

★ జీవితానికి అతి ముఖ్యమైన రెండు విషయాలు ఏమిటి?

మంచి అంతరాత్మ. మంచి మాటకారితనం – ఈ రెండూ కూడా జీవితానికి – అవసరం, ఉపయోగకరం.

★ పొదుపు గురించి అంత ప్రకటనలు చేస్తారుకదా? అది సాధ్యమా?

ఎలా? అసలు పొదుపన్న మాటే – దొరికేది పర్సుకి అట్టడుగునకద! □



# రెండులో ఒకటిని ఈ రోజే ఎన్నుకోండి




మా CAT 1000 సీరిస్. అవి కంప్యూటర్ సాంకేతిక సహకారంతో తయారుచేయబడినవి. ప్రతిసారి మీరు టి వి. చూసే సమయంలో మీకు దీని విశేష వుపయోగాలు తెలుస్తుంది. చక్కటి, సున్నితమైన, నిజజీవితంలోలా రంగుల దృశ్యం. ఇవన్నీ కంప్యూటర్ సహకార డిసైను, కంప్యూటర్ సహకార ఉత్పత్తి విధానం, పూర్తిగా కొరత నిషేధించబడిన ఎల్ఓటి, ఎస్ఎమ్పిఎస్, ఎమ్ఓఎస్ఎఫ్ఇటి, ఎలక్ట్రానిక్ ట్యూనర్, కలర్ ఐసిలు అన్నియు ప్రపంచ ఖ్యాతిగాంచినవారిచే ఉత్పత్తి చేయబడినవి వాడటం.

## ◄CAT 1000 SE

అతి అందమైన హుందాగా అగుపించే రంగుల టి.వి.




## CAT 1000 DX ►

(రిమోట్ మోడల్)

డిజిటల్ సింతసైజర్ ట్యూనింగ్ మరియు 39 ప్రోగ్రాం జ్ఞాపకశక్తి

వేరుగా అమర్చిన CAT 1000 DX చేతి స్విచ్ సెట్టుకు ప్రోగ్రాం, బ్యాండు, ఛానలు, శబ్దం, రంగుల విచక్షణ, పరిశుభ్రత, మీకు ఏది కావలిస్తే అది మీరు ఉన్న చోటునుంచే సరిచేసుకునేందుకు మైక్రో ప్రోసెసరు కంట్రోల్ కలదు.






ప్రచురించిన బొమ్మ సహకారం: మిస్ గీతాంజలి అయ్యర్ మరియు సుజాతా ఫిలిమ్స్ లిమిటెడ్‌వారి "అగ్నినక్షత్రం"లో స్టిల్లు.

# సాలిడైర్

Insight-DE-770

# చర్విత చర్వణం




జానకి బస్ స్టాండ్ చేరి అరగంట అయింది. ఈ అరగంటలోనూ ఒక బస్సూరాలేదు. యీ హైదరాబాద్ సిటీబస్‌ల గురించి ఒక ముఖ్య సిద్ధాంతం ఉంది. మనం ఎదురు చూసే బస్సు ఎన్నటికీ రాదు. అది తప్పించి అన్ని బస్సులు వచ్చి పోతూంటాయి. మనకి అవసరం లేనప్పుడు కూడా అన్నీ చక్కగా ఖాళీగా పోతుంటాయి.

అప్పుడే ఏడున్నరయింది. ఎనిమిది గంటల కల్లా అబిడ్స్ చేరుకోవాలి. అక్కడ్నించి అయిదు నిమిషాలు నడక. ఎనిమిదింపావు కల్లా స్కూలు చేరి ప్రిన్సిపాల్ ముందు ఉండక పోయిందో, తన టెంపరరీ ఉద్యోగం కాస్తా ఊడినట్లే.

"మిస్ జానకి, రేపైనా టైంకి రావాలి. అందులోనూ రేపు స్టూడెంట్సుని ప్రోగ్రెస్ కార్డ్సు తీసుకోడానికి రమ్మన్నాను. టైంకి రాకపోతే బాగుండదు!" అంటూ మర్యాదగానే కటువుగా చెప్పింది ప్రిన్సిపాల్ సూర్యకాంతం. పేరుకు తగ్గట్లే వ్యక్తి కొంచెం వేడిగా ఉంటుంది.

"ఎస్ మేడమ్!" అంది తను. అన్నమాట ప్రకారం చెయ్యకపోతే ఆవిడతో వేగడం కష్టం. అందుకే ఏడు గంటలకల్లా బస్ స్టాండ్ జేరింది. ఏం లాభం! కర్మ! ఒక్కబస్సూ రాలేదు. పోనీ, ఏ ఆటోలోనైనా పోదామంటే నెలాఖరు. జీతం ఆరోజే వస్తుంది. చేతిలో సరిగ్గా రెండు రూపాయలు ఉన్నాయి. ఆటోకి కనీసం 3 రూపాయలు అవుతుంది. పైగా తన లాంటి టెంపరరీ టీచర్లకి ఆటో యోగం కూడానా? విజయనగర్ కాలనీ నుంచి రోజు అబిడ్సుకి వెళ్ళిరావడానికి బస్‌కి రూపాయి చెల్లించడానికే యిబ్బందిగా ఉంది! జానకి ఆలోచనలతో సతమత మవుతూ బస్సుల్ని తిట్టుతూ ఎల్లాగైనా యీ గండం గట్టెక్కించమని దేవుళ్ళ నందర్ని వరుసగా ప్రార్థించసాగింది.

ఏదో ఆగిన శబ్దమైతే ఆలోచనలుంచి తేరుకొని ఆశగా చూసింది. కొంచెం ముందర పేవ్‌మెంట్ ప్రక్కన స్కూటరు ఆగిన శబ్దము. నిరాశగా దృష్టి మరల్చింది. కాని అతగాడు తననే గుచ్చి చూస్తున్నట్టనిపించి మళ్ళీ యిటు తిరిగింది. ఈ రోజుల్లో పెద్దా చిన్న లేకుండా ప్రతీ వాళ్ళకి యిదో జబ్బు. ఆడదంటూ కనిపిస్తే చాలు గుడ్లగూబలా గుడ్లప్పగించి చూడ్డం, రోడ్డుమీద కనబడ్డ ప్రతి ఆడదీ తమ సొంతం అన్నట్లు యిగాదిగా, ఇడియట్స్! బహుశా కలియుగ ప్రభావమేమో!

"చూడండి, మీరిక్కడ నలభై నిమిషాల నుంచి కాచుక్కూచున్నారు. బస్ కోసమనుకుంటా. కాని యివాళ బసెస్ రావు స్ట్రైక్ గదా!"

జానకి చుట్టూరా కలియ చూసింది. నిజమే. ఎవ్వరూ నిలబడలేదు. తను ఒక్కతె వెర్రిదానిలా బస్ కోసం చూస్తోంది. ముందే తెలుస్తే నడిచయినా యీపాటికి స్కూలు చేరేది. ఖర్మ! ఎలాగిప్పుడు? చేతిలో డబ్బు కూడా లేదు. జానకి గాభరా ఎక్కువైంది.

"మిస్ జానకీ".

ఉలిక్కి పడింది జానకి. తన నిలా పేరు పెట్టి పిలిచే దెవరు. ఎదురుగా తారుడబ్బాలాంటి ఆ నల్లని వ్యక్తి తప్పించి యింకెవరూ కనబడలేదు. యితగాడికి తనపేరెలా తెలిసిందబ్బా! అనుకొంటూ చికాకు, కోపం, విసుగు కలిపిన చూపొకటి అతనికేసి విసిరింది. ఆమె హేండ్ బాగ్పైన పేరు తెలిపేదేదీ



లేదు. చేతిలో పుస్తకాలు లేవు. మరి ఎల్లా తెలుసుకొన్నాడు తనపేరు? ఇతగాడికేదైనా దివ్యదృష్టిలాంటి దేదైనా వుందా ఏమిటి.

మీపేరు నాకెలా తెలిసిందా అని ఆశ్చర్య పోతున్నారా? దీనికంతగా ఆశ్చర్య పడాల్సిందేమి లేదు. నేనూ యీ కాలనీలోనే ఉంటున్నాను. ఒకసారి మీ అమ్మగారనుకుంటా. మిమ్మల్ని పిలవడం విన్నాను. ఇష్టమైన వాళ్ళ పేర్లు గుర్తుంచుకోడం ధర్మం గదా!" ఓ వెకిలి నవ్వు నవ్వాడు.

జానక్కి వంటి మీద గొంగళి పురుగులు పాకుతున్నట్లుంది. ఒక ప్రక్క స్కూలికి ఎల్లా చేరాలిరా భగవంతుడా అనే ఆరాటం, మరో ప్రక్క యీ వెకిలి వాగుడు! కాని ఏమీ చెప్పలేక ఉండి పోయింది. దేవుడిలా ఓ రిక్షావాడు కనిపించాడు. ఎలాగో రెండు రూపాయలకి ఒప్పించి దాన్లో ఎక్కి "హమ్మయ్య"! అనుకొంది.

ఈ రోజుకి గండం ఎలాగో గడిచింది. కాని స్కూటర్ వాలా మాత్రం ఆమెని రోజూ పలకరిస్తూనే ఉన్నాడు. ఏవో చిన్న చిన్న సహాయాలు చేస్తున్నాడు. క్రమేపీ మొదట్లో కలిగిన



అసహ్యం తగ్గిపోయింది జానకిలో.

అప్పుడప్పుడు జరిపిన మాటల సందర్భంగా అతను తెలిపిందేమంటే, వాళ్ళిద్దరిదీ ఒకటే కులం, ఒకటే శాఖ. అతను ఆంధ్రా బాంక్‌లో ఆఫీసరు. తల్లీ దండ్రీ ఉన్నారు. పేరు మాధవరావు. జానకంటే యిష్టం. అభ్యంతరం లేకపోతే పెళ్ళి చేసుకోడానికి సిద్ధం.

జానక్కి ఆకాశము నుంచి ఏ రెక్కల గుర్రమో వచ్చి స్వర్గానికి తీసుకు పోతానన్నట్లైంది. పెళ్ళి! ఆరెండు అక్షరాలు అమృత తుల్యాలు. ఆమాట అతను చెప్పిన మరుక్షణం నుంచి జానకి మనస్సు మనస్సులో లేదు. మయూరిలా నాట్యము చేస్తున్నట్లనుభూతి. అంత వరకూ తారుడబ్బాలా కనిపించిన వాడు మన్మథుడిలా కనిపించక పోయినా ఇప్పుడు ఫేయిర్ గానే కనిపిస్తున్నాడు.

సుందరమ్మ, సుబ్బారావుల మొదటి సంతానం జానకి. సుందరమ్మ తండ్రి రాఘవయ్య పోలీసు ఆఫీసరు. మధ్య వర్తుల మాటలు నమ్మి సుందరమ్మని సుబ్బారావుకిచ్చి పెళ్ళి చేశాడు రాఘవయ్య. రెండు మూడేళ్ళ దాకా సంసారం బాగానే నడచింది. క్రమేపీ సుబ్బారావు పేకాట మోజులో పడి యింటి విషయం పట్టించుకోడం మానేశాడు. జీతం రాగానే కనీసం మొదటి పది రోజులయినా మల్లిదండా, అప్పుడప్పుడు పావుకిలో పుల్లారెడ్డి స్వీట్సు తెచ్చే సుబ్బారావు పెళ్ళాం మొగం కనబడితేనే విసుక్కోడం మొదలు పెట్టాడు. రాత్రి పన్నెండు గంటల దాకా పేకాడి డబ్బులు బాగా పోగొట్టుకొని చికాగ్గా యింటికి వచ్చేవాడు.

అప్పటికి జానక్కి యింకా ఏడాది నిండలేదు. సుందరమ్మకి మళ్ళీ గర్భిణి. ఆ సమయంలో పాలడబ్బా అయిపోయిందనో, పిల్లకి జ్వరమనో, ఆవిడ చెప్పడం, సుబ్బారావు విసుక్కోవడం, మాటా మాటా పెరిగి సుందరమ్మని కొట్టడం మొదలైంది. పేకాట మూలంగా ఆర్థికంగా చితికి పోయిన సుబ్బారావు తన కష్టాలకి కారణం సుందరమ్మే నన్నట్లు ప్రతీదానికీ ఆమెనే నిందించటం మొదలు పెట్టాడు.

ఒకనాటి రాత్రి గర్భవతి అనే కనికారం కూడా లేకుండా కొట్టి సుందరమ్మని చంటి పిల్లతో సహా బయటికి గెంటేశాడు. ఆ రాత్రికి ఎవరో తెలిసున్న వాళ్ళ యింట్లో తల దాచుకొని మర్నాడు పుట్టింటికి జేరింది. ఆతర్వాత తండ్రి ప్రోత్సాహము, సహకారంతో ఎలాగో మెట్రిక్ పాసయి, టీచరు ట్రైయినింగు పూర్తి చేసి ఉద్యోగము సంపాదించుకొంది సుందరమ్మ.

ఉన్నట్టుండి మళ్ళా ప్రత్యక్ష మయ్యాడు సుబ్బారావు. యీదేశంలో ఆడదానికి మొగుడనేవాడు ఎలాంటి వాడైనా వాడి కట్టు బానిసగా పడుండటం ఆచారం, ధర్మం, కర్తవ్యం. పైగా తను ఇద్దరాడపిల్లల తల్లి. అందుచేత సుందరమ్మ ఉద్యోగం వదులుకొని యిద్దరు చంటి పిల్లలతో హైదరాబాదు వెళ్ళి సుబ్బారావుతో కాపురము మొదలు పెట్టింది.

కాని సుబ్బారావు మంచితనము ఓ నెలకన్నా ఎక్కువ నిలవలేదు. తిరిగి పాత రోజులు రావటానికి ఆట్టేకాలం పట్టలేదు. మళ్ళీ నెలతప్పడం, సుబ్బారావు యింటికి దూరంగావడం జరగ్గానే సుందరమ్మ ఎందర్నో బ్రతిమలాడి హైదరాబాదులోనే టీచరు ఉద్యోగము సంపాదించింది. సుబ్బారావు జీతం మాటిలా ఉన్నా తన జీతంతోనే జానకి, వనిత, సుధ ముగ్గురి పోషణ తన మీద వేసుకొని సంసారము గుట్టుగా సాగించింది. సుబ్బారావు బుద్ధి పుడితే సరుకులేవైనా తెచ్చేవాడు. లేక పోతే లేదు.

తల్లి పెంపకంలోనే పిల్లలు పెద్ద వాళ్ళయ్యారు. జానకి స్కూల్లో టింపరరీగా పని చేస్తోంది. వనిత బి. ఎ. పూర్తి చేసి ఖాళీగా ఉంటోంది. సుధ యింకా చదువుకొంటూంది.

జానకి పచ్చగా అందంగానే ఉంటుంది. అందమైన పెద్ద పెద్ద కళ్ళు, బారెడు జుట్టు – ఎవర్నైనా యిట్టే ఆకట్టుకుంటాయి. తల్లి ఎన్నో సంబంధాలు చూసింది. కాని ఒక్కటీ కుదరలేదు. అందులో సగం తండ్రి చెడగొట్టేవాడు. జానక్కి పెళ్ళి చేసేస్తే పేకాటకి డబ్బులు సరిపోవని బెంగకావచ్చు.

ఎందుకంటే జానకి జీతంలో సగం తండ్రే పుచ్చుకొంటాడు. కొందరికి కట్నాల ఆశ. కాని, వేరే ఏ ఆస్తి గానీ ఆదాయం గాని లేక ముగ్గురు ఆడపిల్లలున్న ఆయింట్లో పెద్ద పెద్ద కట్నాలు పోసి పెళ్ళిళ్ళు చెయ్యటం ఆ కుటుంబానికి సాధ్యం గాదు. అందులోను సుబ్బారావు లాంటి బాధ్యత లేని తండ్రి ఉన్నప్పుడు!

మాధవరావుతో జరిగిన మాటల సంగతి తల్లితో చెప్పింది జానకి. సుందరమ్మ ఎంతో సంతోషించింది. కళ్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు! "యిదే" అంటూ మురిసి పోయింది.

మంచి రోజు చూసుకొని మాధవరావు యింటికి బయలుదేరి వెళ్ళాలంది సుందరమ్మ. ఎడ్రసు కనుక్కోమంది జానకిని. మర్నాడు జానకిని కలిసినప్పుడు తల్లి అడగమన్న విషయము అడిగింది.

విజయనగర్ కాలనీ పోస్టు ఆఫీసు ప్రక్కన నాలుగిళ్ళ తరువాత ఉన్న మేడే మాది. మా నాన్నపేరు శ్యామలరావు– అంటూ ఇంటి నెంబరు వగైరా చెప్పాడు మాధవరావు.

మంచి రోజు చూసుకొని దశమి ఆదివారము మాధవరావు యింటికి బయలు దేరి వెళ్ళింది సుందతమ్మ. ఆదివారము కాబట్టి మాధవరావు కూడా ఇంట్లోనే వున్నాడు. జానకి తల్లి అని తెలియగానే "రండి, అత్తగారూ!" అంటూ ఆదరంగా పిలిచి లోపలికి తీసుకు వెళ్ళాడు.

కొడుకు మాట వింటూనే హాల్లోకి వచ్చింది తులసమ్మ.

"అమ్మా నేను చెప్పానే జానకి అనే అమ్మాయి గురించి. ఆమె, ఆమె తల్లిగారు!" అంటూ పరిచయం చేశాడు మాధవరావు తల్లికి.

"రండి, రండి! మా అబ్బాయి అంతా చెప్పాడు. యీరోజుల్లో పిల్లలు మనకాలంలో లాగ్గాదు. అన్నీ వాళ్ళే చూసుకొంటారు". అంటూ ఆదోలా నవ్వింది తులసమ్మ.

"మరేనండీ! వాళ్ళ యిష్టాయిష్టాలకి వదిలేసి దూరంగా ఉండి చూస్తుండాలి మ ). అంతే!" సుందరమ్మ అంది.

"అందుకే వాళ్ళ నాన్నగారు పట్టించుకోడం మానేశారు. పైగా యిద్దరూ ఒకర్నొకరు యిష్టపడి పెళ్ళి చేసుకొంటే ఆబాధ్యతంతా వాళ్ళదే! ఆ తర్వాత ఏ గొడవలొచ్చినా ఆపూచీ వాళ్ళదే, అంటారు! అలా వదిలేయ గలమా చెప్పండి" అంది తులసమ్మ.

మాటల సందర్భంగా చుట్టాలు, బంధువులు, సంబంధాలు అన్ని ఏకరువు పెట్టుకున్నారు. యిద్దరికీ ఒకరంటే ఒకరికి సద్భావం పెరిగింది. జానకి ఎంతో అదృష్టవంతురాలు. అందుకె ఇంత మంచి ఇంట్లో పడగలుగుతోంది అనుకొంది సుందరమ్మ.

"పిల్లలు ఒకర్నొకరు . . యిష్టపడ్డం అయిపోయింది. ఇక పెద్దలం మనం మాట్లాడుకోటం మిగిలింది." మాధవరావు తండ్రి శ్యామలరావు అన్నాడు.

"చెప్పండి, అన్నయ్యగారు! మీరెంతలో ఉన్నారో!" అంది సుందరమ్మ శ్యామలరావు అభిప్రాయము గ్రహించి.

"అబ్బాయికి పాతిక వేలు యిస్తామంటూ వస్తున్నారు. బ్యాంకులో ఆఫీసరుకదా!" అంది తులసమ్మ.

సుందరమ్మ తన వల్లగాదన్నట్లు మొగం పెట్టింది.

"అబ్బె, మిమ్మల్నింత యివ్వమని చెప్పడం లేదు. పైగా అబ్బాయికి నచ్చిన పిల్లాయెను! కనీసం కర్చులకోసమైనా ఓ పదిహేను వేలు అవుతుంది" తులసమ్మ ఓ మెట్టు దిగింది.

సుందరమ్మ తన సంసారం స్థితిగతులు, ఇంకా ఇద్దరాడ పిల్లల సంగతి వివరించింది.

అఖరి మాటగా పదివేలు అని తేల్చారు శ్యామలరావు, తులసమ్మ. ఈ కాలాన్ని బట్టి ఆమాత్రం ఉద్యోగమున్న వాడికి పదివేలు సబబేనేమో! పైగా ఇల్లు, స్కూటరు ఉన్నాయి. ఒక్కగానొక్క కొడుకు. అత్త మామలు మంచివార్లిలా ఉన్నారు– అనుకొంటూ తన తాహతుకి మించినా గాని సరేనంది సుందరమ్మ.

"అయితే వదినగారు! ఈ రోజు మంచిదే కదా! తాంబూలాలు పుచ్చుకొందాము! త్వరలో ముహుర్తాలు పెట్టుకోవచ్చు." అంది తులసమ్మ. పదినిమిషాలలో అన్ని ఏర్పాట్లు చేసేసింది. సుబ్బారావుకీ విషయం చెప్పాలి అని సుందరమ్మ చెప్పినా తులసమ్మ "అన్నయ్యగారు మీ మాట కాదంటారా వదినగారూ!" అంటూ తొందర చేసింది. తాంబూలాలు పుచ్చుకొన్నారు. జ్యేష్ఠ మాసంలో పెళ్ళి చెయ్యాలి అని కూడా నిర్ణయించుకొన్నారు.

అది వైశాఖమాసం. ఎండ నిప్పులు చెరుగుతోంది. ఆ రోజు జానకి పుట్టిన రోజు. స్కూళ్ళు పరీక్షలు అయిపోయాయి కాబట్టి మూసేసారు. మధ్యాహ్నం దాకా ఇంట్లో తల్లీ చెల్లెళ్ళ మధ్య కాలం గడిపింది. పింకు కలరు చైనా సిల్కు చీర, మాచింగు బ్లౌజు వేసుకొంది. జుట్టు రిబ్బన్ను పెట్టి పోనీ టైలులా కట్టింది. నాల్గు గంటలకల్లా తయారైంది. అమ్మో అంటూ దగ్గరికి వచ్చిన జానకి మనస్సు గ్రహించింది సుందరమ్మ.

"నువ్వూ అతనూ కలసి ఎక్కడి కయినా వెళ్దామనుకొంటే వెళ్ళిరండి. రాత్రి భోజనానికి మాత్రము యింటికి పిల్చుకురా. తొందరగా వచ్చెయ్యండి!" అంది సుందరమ్మ.

"అదిగాదమ్మ! అసలు నా పుట్టిన రోజని ఆయనకి చెప్పలేదు. సర్‌ప్రైజుగా ఆఫీసుకి వెళ్ళి కలుస్తాను. అక్కడ్నుంచి ఏ హోటల్‌కో వెళ్ళి టిఫిన్ తిని వచ్చేస్తాము. పార్టీ యిచ్చినట్లు ఉంటుంది. మళ్ళీ యింట్లో అరేంజ్ చెయ్యట మెందుకు?" అంది జానకి.

"సరే నీ యిష్టం!" అంది సుందరమ్మ.

మాధవరావు చెప్పిన వివరాల ప్రకారం బ్యాంకు చేరుకునే సరికి పావు తక్కువ అయిదయింది. మూడో అంతస్తులో క్రొత్తగా ఓపెన్ చేశారు. బ్రాంచి మొత్తం మీద ఇద్దరు ముగ్గురు గుమాస్తాలున్నారు. ఎక్కడా మాధవ రావు కనిపించలేదు. అందరూ బ్యాంకు క్లోజ్ చేసే



టిఫైనందువల్ల బిజీగా ఉన్నారు.

ఎడమవైపు గది తలుపు మీద "మానేజర్" అన్న బోర్డు తగిలించి ఉంది. జానకి తలుపుతోసి లోపలికి తొంగి చూసింది, ఒకవేళ అక్కడున్నాడేమోనని.

"ప్లీజ్ కమిన్!" అంటూ బట్టతల, కళ్ళజోడుతో ఓ యాభై సంవత్సరాల పెద్ద మనిషి ఏదో ఫైలు తిరగేస్తూ తలెత్తి ఆమెని పిలిచాడు.

జానకి యిబ్బందిగా లోపలికి అడుగు పెట్టింది.

"నమస్కారమండి. నా పేరు జానకి. మాధవ రావుగారని యిక్కడ పని జేస్తున్న ఆఫీసర్ని కలుసుకోడానికి వచ్చాను."

"నమస్కారం. మాధవరావు మీకు తెలుసా?"

"బాగా తెలుసండి"

"బలే బాగుందమ్మా!" అంటూ పగలబడి నవ్వాడాయన. జానకి అర్థం కానట్లు చూసింది.

"నాపేరే మాధవరావమ్మా. యిక్కడ ఉండే ఆఫీసరు నేనొక్కడ్నే".

"పోనీ మీరు కాకుండా మాధవరావు అని యింకెవరన్నా ఉన్నారా?"

"నాకు తెలిసినంత వరకూ ఎవ్వరూ లేరు. పైగా యిది చాలా చిన్న బ్రాంచి. అసలు ఉండేదే మేం అయిదుగురం. ఆఫీసరు, గుమాస్తాలు అందరూ కలిసి"

ఇంతలో తలుపు తెరుచుకొంది. ట్రేలో నీళ్ల గ్లాసులతో మాధవరావు లోపలికి వచ్చాడు.

జానకిని చూడగానే మొగాన్న కత్తి వాటు వేస్తే నెత్తురు చుక్కలేదు. అతన్ని నీళ్లగ్లాసు లందించే వాటరు బాయ్‌గా పోల్చుకోగానే జానకి కళ్లు ఎర్రబడ్డాయి.

"సారీ, సార్! వస్తాను". అంటూ జానకి బయటికి నడిచింది.

మాధవరావు బయటికి వచ్చి "జానకీ, జానకీ" అంటూ వెంట బడ్డాడు. మాధవరావు పిలుపు విన్న జానకి ఆగింది. దగ్గరకిరాగానే-

"చూడు మిష్టర్ యింకనన్ను అలా పేరు పెట్టి పిలవద్దు! గుడ్‌బై"

"కాదు. నేను చెప్పేది విను. నిన్ను మోసం చెయ్యడం నా ఉద్దేశ్యం గాదు. వాటర్ బాయ్ అంటే ఎన్నాళ్లయినా పెళ్ళిగావడం లేదని మా అమ్మ అలా అబద్ధం చెప్పమంది. అంతే! అయినా నాది పర్మినెంట్ ఉద్యోగం. జీతం కూడా ఎక్కువే!"

"చూడు మిష్టర్! నీ ఉద్యోగం చిన్నదయినా, జీతం తక్కువయినా నీకు చదువు లేక పోయినా నాకు బాధలేదు. నా బాధల్లా పెళ్ళికి ముందరే ఇంత మోసం, అబద్ధం చెప్పిన పెద్ద మనిషివి. యింకా తర్వాత నా బతుకులో ఎన్నినిప్పులు పోస్తావో అనే! యింక నా వెనక రావద్దు! అమ్మ చెప్పిందట! ఈ పెద్దమనిషి మోసగించాడుట! మీ అమ్మ రేపు ఈ కోడలు నాకు వద్దు, నిప్పు అంటిద్దామంటుంది. అప్పుడు అంటించి చంపుదువుగాని. నాతో ఎక్కడా మాట్లాడ్డానికి ప్రయత్నించద్దు!" అంటూ వెళ్లి పోయింది.

ఆమెకి తల్లి అనుభవించిన నరకం కళ్ళెదుట కట్టింది. అంతకన్నా పెళ్ళి లేకుండా ఉండి పోవటమే ఆడపిల్లకి మంచిదేమో! □

## అప్పుడే....!

మనిషి
మనసుల
మాసి పోవాలి.....
ద్వేషం!
అప్పుడే.....
ఐకమత్యంతో
అలరారుతుంది
దేశం!

—వాసాల నరసయ్య

## చర్వితచర్వణం



# సౌందర్యదీపం

చల్లా ఝాన్సీరాణి



చర్మ సౌందర్యాన్ని గురించి శ్రద్ధ తీసుకోవాలనుకునేవాళ్ళు మొదట మీది ఏ రకమైన చర్మమో తెలుసుకోండి. దాన్నిబట్టి ట్రీట్‌మెంట్ తీసుకోవాలి.

చర్మంలో నాలుగు ముఖ్యమైన రకాలున్నాయి.

1. నార్మల్ స్కిన్ (సాధారణమైన చర్మం)
2. ఆయిలీ లేదా గ్రీజీ స్కిన్ (జిడ్డుగా ఉండే చర్మం)
3. డ్రైస్కిన్ (పొడిగా ఉండే చర్మం)
4. కాంబినేషన్ స్కిన్ (ఆయిలీ - డ్రై మిశ్రమంలో వుండే చర్మం)

రాత్రి పడుకునే ముందు శుభ్రంగా ముఖం సబ్బుతో కడుక్కోండి. ఉదయం లేవగానే ముఖం కడుక్కోకుండా అద్దంలో చూసుకోండి.

ముఖం మామూలుగా మృదువుగా ఉంటే నార్మల్ స్కిన్‌గానూ - నూనె కారుతున్నట్లుంటే ఆయిలీ స్కిన్‌గానూ - పొడి పొడిగా బిగసుకుపోయినట్లుంటే

## మీది ఏ రకమైన చర్మమో తెలుసా?

డ్రైస్కిన్‌గానూ - కేవలం నుదురు, ముక్కు, గడ్డం మాత్రమే నూనె కారుతూ మిగిలినభాగం పొడిగా ఉంటే కాంబినేషన్ స్కిన్‌గానూ పోల్చుకోండి.

ఇలా పోల్చుకోవడం తికమకగా ఉన్నవాళ్ళకి మరో పద్ధతి ఉంది.

రాత్రి పడుకనేముందు ముఖంలో ఏ విధమైన మేకప్, క్రీమ్స్ లేకుండా శుభ్రంగా సబ్బుతో కడుక్కుని పడుకోండి. ఉదయం లేస్తూనే ఒక ట్రేసింగ్ పేపర్ అంటే ఉల్లిపొరలాంటి కాయితం తీసుకుని ముఖం పూర్తిగా కవరయేలా అంటే పేపర్ పూర్తిగా ముఖానికి అతుక్కుని కప్పి ఉంచాలి. రెండు నిముషాలయాక తీసేసి చూడండి. పేపర్ పొడిగా వుంటే నార్మల్ లేదా డ్రైస్కిన్‌గానూ, పేపర్ మొత్తం నూనె అంటుకుంటే ఆయిలీ స్కిన్‌గానూ - కేవలం పేపర్ మధ్య భాగం మాత్రమే నూనె అంటితే కాంబినేషన్ స్కిన్‌గానూ పోల్చుకోవచ్చు.

ఇకపోతే మీది సాధారణ చర్మమా లేక పొడి చర్మమా అన్నది తెలుసుకోవాలంటే ముఖాన్ని శుభ్రంగా సబ్బుతో కడుక్కుని తుడుచుకోండి. రెండు నిముషాలయాక అద్దంలో చూసుకోండి. ముఖం మృదువుగా వుండేట్టయితే నార్మల్ స్కిన్-గానూ మెరుస్తూ బిగుసుకుపోయినట్లుగా - పొట్టు లేస్తూ వుంటే డ్రైస్కిన్‌గానూ గుర్తించండి.



### సాధారణ చర్మం (నార్మల్ స్కిన్)

ఈ రకమైన చర్మం చాలా మృదువుగానూ మెత్తగానూ క్లియర్‌గా - మరీ జిడ్డుగా గానీ - మరీ పొడిగా గానీ లేకుండా చక్కగా వుంటుంది. చర్మం ఆరోగ్యవంతంగా మెరుస్తూ రక్త ప్రసరణ సక్రమంగా ఉండి చక్కటి మంచి ఆరోగ్యాన్ని సూచిస్తూ వుంటుంది.

దీనికి తీసుకోవలసిన రక్షణ చాలా స్వల్పం. రోజూ రెండు పూటలూ చర్మాన్ని మైల్డ్‌గా వుండే సబ్బుతో కడుక్కోవాలి. రాత్రి పడుకునేముందు ఇంట్లో తయారు చేసిన మాయిశ్చరైజర్ని రాసుకుని అరగంటయాక శుభ్రంగా కడుక్కుని పడుకోవాలి.

ఎప్పుడైనా మీ చర్మం ఎండిపోయినట్లుగానీ జిడ్డు కారుతున్నట్లుగానీ వుంటే తగిన విధంగా చర్య తీసుకుని మీ చర్మాన్ని కాపాడుకోండి. □

(వచ్చే వారం ఆయిలీస్కిన్...)




# బైద్యనాధ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాధ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

యమ్. యాదగిరి,(వయస్సు 17) నిజామాబాద్

ప్ర : తెల్ల వెంట్రుకలు, వెంట్రుకలు ఊడిపోవటం ఆలోచనలు తలనొప్పి, వణుకు.

జ : బైద్యనాధ్ బ్రైన్ టాబిలెట్ 2 మాత్రల చొప్పున బైద్యనాధ్ శంఖ పుష్పి సిరఫ్‌తో రోజు రెండుసార్లు ఉదయం సాయంత్రం లోనికి తీసుకోవాలి. బైద్యనాధ్ బ్రాహ్మీతేల్ మరియు బైద్యనాధ్ మహాభృంగ రాజతేత్ కలిపి తల నూనెగా వాడండి.

ఉషామదన్, నాగపూరు

ప్ర : వెంట్రుకలు ఎక్కువగా రాలిపోతున్నవి.

జ : బైద్యనాధ్ వారి సుందరీ కల్ప పొర్పు ఉదయం సాయంత్రం రెండు చెంచాల మందు రెండు చెంచాల నీరు కలిపి లోనికి సేవిస్తూ తలనూనెగా బైద్యనాధ్ మహాభృంగరాజ తేల్ వాడండి.

కె. ధనలక్ష్మి, తెనాలి; ఎ. మణి, కడప

ప్ర : కంటిక్రింద, ముఖం మీద అక్కడక్కడ తోలు పిలిపురులు ఆవగింజలంత కాయల వలె ఉన్నవి.

జ : బైద్యనాధ్ రక్త శోధక బటి ఒక మాత్ర చొప్పున బైద్యనాధ్ సురక్తా స్ట్రాంగ్ మందుతో ఉదయం సాయంత్రం కొన్ని రోజులు వాడండి.

పి. ఆర్. పి. రావు, గుడ్లూరు

ప్ర : ఉదయం నిద్రలేవగానే అరికాలు మడమల నొప్పి. కాలు క్రింద పెట్టనివ్వదు.

జ : లోనికి ఉదయం సాయంత్రం బైద్యనాధ్ యోగరాజ గుగ్గులు 1 మాత్ర. బైద్యనాధ్ వాతరీనా 1 మాత్ర చొప్పున వేడినీటితో వాడవలెను. ఉదయం సాయంత్రం బైద్యనాధ్ మహావిషగర్భ తేల్ మాలీష్ చేసి వేడినీటి కాపడం పెట్టండి.

అత్తులూరి సత్యప్రసాద్, చెన్నారం (ఖమ్మం)

ప్ర : నాకు ఫిట్స్ ఉన్నవి. 15 సంవత్సరముల నుండి నెలకు 1 సారి 2 సార్లు వస్తున్నది.

జ : మల బద్ధకము నులిపురుగులు లేకుండా చూసుకోండి. మలబద్ధకము ఉంటే బైద్యనాధ్ కబ్జహర చూర్ణం రాత్రి పరుండబోవు నపుడు వేడినీటితో సేవించండి. బైద్యనాధ్ స్మృతిసాగర రస 1 మాత్ర బైద్యనాధ్ వాత విధ్వంసనరస 1 మాత్ర ఉదయం సాయంత్రం బైద్యనాధ్ కుమారి ఆసవతో లోనికి కొన్ని రోజులు సేవించాలి.

రాజు, గుంటకల్

ప్ర : భార్యతో నా వల్ల సుఖములేదు. ఆడవాళ్ళ మధ్యకు పోతే శక్తి లేకుండా పోతుంది.

జ : బైద్యనాధ్ విటా – ఎక్స్ ఒకమాత్ర బైద్యనాధ్ శుక్రవల్లభరస 1 మాత్ర బైద్యనాధ్ చ్యవనప్రాశ స్పెషల్‌తో ఉదయం సాయంత్రం పాలతో సేవించండి. భోజనం తరువాత బైద్యనాధ్ అశ్వగంధారిష్ట రోజురెండు సార్లు తీసుకోవాలి. బలమైన ఆహారం అవుసరం.

ఆర్. సీతారామ్ (వయస్సు 35), కాకినాడ

ప్ర : తల తిప్పు, వణుకు, దద, జుట్టు ఊడి పోవటం, చుండ్రు.

జ : మలబద్ధకము ఉంటే బైద్యనాధ్ కబ్జహర చూర్ణం రాత్రి పరుండబోవు నపుడు వేడినీటితో సేవించండి. విరేచనము సాఫీగా అవుతుంది.

తరువాత బైద్యనాధ్ బ్రైన్‌టాబిలెట్ 1 మాత్ర, బైద్యనాధ్ విటాఎక్స్ 1 మాత్ర చొప్పున బైద్యనాధ్ శంఖ పుష్పి సిరఫ్‌తో ఉదయం సాయంత్రం కొంత కాలం సేవించండి. భోజనం తరువాత బైద్యనాధ్ సురక్తా స్ట్రాంగ్‌లోనికి వాడుతూ. బైద్యనాధ్ మహాభృంగరాజతేల్ తలనూనెగా ఉపయోగించండి.

జె. శ్రీనివాస్,(వయస్సు 16) ఏలూరు

ప్ర : ఎత్తు కావాలి అంటే ఏమి చేయాలి.

జ : వ్యాయామం చేస్తే ఎత్తు పెరగవచ్చు. బైద్యనాధ్ చ్యవనప్రాశ ఉదయం సాయంత్రం పాలతో సేవిస్తూ బైద్యనాధ్ లోహాసవ, కుమారి ఆసవ కలిపి భోజనం తరువాత రోజు రెండుసార్లు సేవించాలి. కొంత ఎత్తు పెరగవచ్చు.

జగన్మోహనరావు, మర్రిపాలెం

ప్ర : మా అబ్బాయి వయస్సు 12 సంవత్సరములు. తిన్నది జీర్ణము గాదు, బలహీనముగా ఉంటాడు. కడుపులో నొప్పి.

జ : బైద్యనాధ్ ప్రభాకరవటి 1 మాత్ర. బైద్యనాధ్ లివరెక్స్ 1 మాత్ర ఉదయం సాయంత్రం బైద్యనాధ్ కుమారీ ఆసవనెం 3 తో కొంతకాలము ఇస్తూ బైద్యనాధ్ లోహాసవ భోజనం తరువాత రోజుకు రెండు సార్లు ఇవ్వండి. బైద్యనాధ్ చ్యవనప్రాశ కూడా రాత్రి పూట పాలతో ఇవ్వండి. □

### కూపన్




### ఆంధ్ర సచిత్ర వారపత్రిక
### బైద్యనాధ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న : ..............................................

..............................................

..............................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :




(గత సంచిక తరువాయి)

పోలీస్ ఆఫీసర్ల సమావేశం ముగిసే వేళయింది. తన ముందు హాల్లో కూర్చున్న వున్నతాధికారులను చూస్తూ మరోసారి గొంతు సవరించుకున్నాడు డి. జి. పి. కళ్యాణ్‌రాం.

"ఫ్రెండ్స్! స్టేట్ గెస్ట్‌గా రాణీ గాయత్రీదేవి రెండు రోజులు మన నగరంలో వుంటారు. అప్పుడు రొటీన్ బందోబస్తు చాలు. ఇక ఆంధ్రమాత విగ్రహం దగ్గర కార్యక్రమం పదిహేను నిముషాలుంటుంది. ఈ పదిహేను నిముషాలూ వాటర్ టైట్ సెక్యూరిటీ వుంటుంది.

ఆ సెక్యూరిటీ వలయాన్ని ఛేదించుకుని ఏ దొంగ అయినా హారం దొంగలించే సాహసం చెయ్యలేడు. అయినా మన జాగ్రత్తలో మనం వుండాలి. మన సి. ఐ. డి.లు, సెంట్రల్ సి. ఐ. డి.లతో పాటు సి. ఎం. స్పెషల్ సెక్యూరిటీ అధికార్లు, ఇంకా రాణీ గాయత్రీదేవి స్పెషల్ సెక్యూరిటీగార్డులు వుంటారు, వాళ్ళకి ఐడెంటిటీ కార్డులుంటాయి. ఆ ఐడెంటిటీ కార్డులు చూశాక వాళ్ళని లోపలికి వాళ్ళవాళ్ళ పొజిషన్‌లలోకి పంపించండి! కార్యక్రమం అవుతూనే మళ్ళీ మనమంతా యిక్కడ మీట్‌అవాలి!" చెప్పాడు కళ్యాణ్‌రాం.

పోలీస్ అధికారులంతా మౌనంగా తమ అంగీకారం తెలిపారు.

"ఒక్క విషయం! ఆ కార్యక్రమం జరిగే చుట్టుపక్కల పోలీసు పెట్రోల్‌వాన్స్ వుంటాయ్! పబ్లిక్‌లో ఎవరికైనా ఏదైనా అనుమానంవస్తే కంట్రోల్‌రూంని కాంటాక్ట్ చెయ్యమని ప్రకటన యిస్తున్నాం" అని కమీషనర్ చక్రవర్తి వేపు తిరిగి-

"మిస్టర్ చక్రవర్తీ! అలాంటి మెసేజెస్ ఏమైనా వస్తే వెంటనే రిసీవ్‌చేసుకుని యాక్షన్ తీసుకోమని పెట్రోలింగ్ ఆఫీసర్లకి ఇన్‌స్ట్రక్షన్స్ యివ్వండి" అన్నాడు.

"ఓకే సర్!" వినయంగా చెప్పాడు చక్రవర్తి. ఆ తర్వాత పోలీస్ వ్యూహం గురించి సమీక్ష ప్రారంభమైంది.

* * * *

జైరాజ్ రహస్య స్థావరం –

"రా రాకా! రా!" అని సాదరంగా ఆహ్వానించాడు జైరాజ్ – అప్పుడే లోపలికడుగుపెట్టిన రాకాని చూసి.

"బావున్నావా దాదా?" అడిగాడు రాకా.

జైరాజ్ నిట్టూర్చాడు. "ఏం బాగోలే రాకా! రోజులు యింతకుముందులా లేవు. జనం తెలివిమీరిపోయారు. పోలీసులు వేటకుక్కల్లా తయారయారు. దానికి తగ్గట్టే శంభుదాదా లాంటివాళ్ళు గుంటనక్కల్లా పొంచివున్నారు.

ముఠాని పోషించడం, పట్టుబడినవాళ్ళకి బెయిల్ అరేంజ్‌చెయ్యడం లాంటి ఖర్చులు తట్టుకోవడం కష్టమౌతోంది రోజరోజుకీ" అన్నాడు జైరాజ్.

జైరాజ్‌దాదా అంటే రాకాకి ఏదో తెలియని అభిమానం. జైరాజ్ పూర్వపు రోజులకి చెందిన అండర్‌వరల్డ్ గింగ్! అతనికి ధనికులు – బ్లాక్‌మార్కెటీర్లు – కుహనా పెద్దమనుషులంటే ఎంత ద్వేషమో – వాళ్ళపట్ల ఎంత క్రూరంగా వ్యవహరిస్తాడో – పేదలపట్ల – సామాన్యజనం పట్ల అంత దయగా వుంటాడు.

వృత్తిరీత్యా అతను కర్కోటకుడైనా, ప్రవృత్తిరీత్యా దయా దాక్షిణ్యాలు కలిగినవాడు. జనసామాన్యానికి నష్టం లేదా హాని కలిగించే పనులు – అవి తనకెంత లాభం కలిగించినా జైరాజ్ చెయ్యడు. ఖాదీయిజం – ఆర్గనైజ్‌డ్ క్రైంకి కూడా ఒక నియమావళి వుందని – దాన్ని ఉల్లంఘించకూడదని అతని వుద్దేశ్యం. పేదలకు ద్రోహం చెయ్యడానికి అతనేమాత్రం ఒప్పుకోడు.

'రాకా'ని జైరాజ్‌దాదా స్వంత కొడుకులా అభిమానిస్తాడు. ఎన్నోసార్లు తన గాంగ్‌లో చేరమని జైరాజ్‌దాదా ఆహ్వానించినా రాకా మృదువుగా తిరస్కరించాడు.

జరిగిన కథ- 13: శ్రీనాధ్‌ను కాల్చి చంపిన దుండగులను దేదీప్య, సీతాదేవి విడి విడిగా గుర్తిస్తారు. ఇద్దరూ ఒకరికి తెలియకుండా ఒకరు ప్రతీకారాలు ఆలోచిస్తుంటారు. దేదీప్య తన రహస్యం రాకాకు కూడా చెప్పదు. శోభనం రాత్రి శైలజ భర్తతో విచిత్రంగా ప్రవర్తించి, రివాల్వర్‌తో కాల్చుకుని చనిపోతుంది. హిప్నాటిక్ సజెషన్ వల్ల ఈ ఆత్మహత్య జరిగి ఉంటుందని ఊహిస్తారు. శైలజ తండ్రి మోహనరావు తన తండ్రి హంతకుడు మురళీమోహనరావు ఒకరేనని దేదీప్యకు తెలుస్తుంది. దేదీప్య, రాకా కలిసి పథకం ప్రకారం, సోములును చంపేస్తారు. గయక్వాడ్ రాణి హారాన్ని దొంగిలించడానికి శంభుదాదా పథకం వేస్తాడు.

బ్రతుకుతెరువుకోసం తను నేరాలు చెయ్యడంలేదనీ – ఒకరికింద తలవంచి బ్రతుకుతూ, వాళ్ళు చెప్పిన నేరాల్ని తా నసలే చెయ్యలేననీ రాకా వివరించాడు. అందుకే తనని తిరస్కరించినా – రాకా నైజం జైరాజ్‌దాదాకి బాగా నచ్చింది. రాకాకి ఏదైనా కష్టంవస్తే జైరాజ్‌దాడా స్నేహ హస్తం అందిస్తాడు. అదీ వాళ్ళమధ్యనున్న అనుబంధం.

"గాంగ్‌లో కూడా ఎవర్ని నమ్మాలో తెలీడంలేదు. స్వార్థం, నీచత్వం పెరిగిపోయింది. డబ్బుకోసం ఎవ డెప్పుడు వెన్నుపోటు పొడుస్తాడో తెలీదు" అన్నాడు జైరాజ్.

రాకా జాలిగా చూశాడతనివేపు. సాధారణంగా జైరాజ్‌దాదా ఎప్పుడూ యిలా మాట్లాడడు. ఎంతో విరక్తి చెందితేనో.... దేనికో బాగా బాధపడితే తప్ప యింత బేలగా వుండడు.



"ఈ పరిస్థితిలో నేను ఈ ఫీల్డ్ నుంచి తప్పుకుని ఏ విదేశాల్లోనో సెటిల్ అవుదామనుకుంటున్నాను. నన్ను నమ్ముకున్న నా అనుచరులకు కూడా ఎంతో కొంత ముట్టజెబుదామనుకుంటున్నాను..... నువ్వు సహకరిస్తే – " అర్థోక్తిలో, ఆగిపోయిన దాదాని చూసి –

"నేను సహకరించడమంటే.....?" అడిగాడు రాకా.

"అపార్థంచేసుకోకు. నిన్ను తుచ్ఛమైన పనులు చెయ్యమని అధగను. ఒక వళ్ళుబలిసిన వ్యక్తి, అనంతమైన సంపదలో కొంత చేజిక్కించుకుంటే వాళ్ళకు పెద్ద నష్టమూ వుండదు. మన పనీ గడుస్తుంది" చెప్పాడు భైరాజ్‌దాదా.

"అదేదో స్పష్టంగా చెప్పుదాదా!" అడిగాడు రాకా.

"గయిక్వాడ్ రాణి గాయత్రీదేవి మన రాష్ట్రానికి ఎల్లుండి వస్తోంది. ఆమె తన దగ్గరున్న కోట్లాది రూపాయల విలువైన వజ్రాలహారాన్ని ఆంధ్రమాత మెడలో వేస్తుంధి..... ఆ సమయంలో ఆ హారాన్ని నువ్ కొట్టేయాలి!"

సన్నగా నవ్వాడు రాకా.

"అది అసంభవమని నీకు తెలుసుదాదా! పైగా ఆంత టైట్ సెక్యూరిటీ.... అన్ని లక్షలమంది ముందు...." ఏదో అనబోయాడు.

"నిజమే! ఈ పనిచెయ్యగలిగింది నువ్వొక్కడివేనని నాకు తెలుసు రాకా! ఆ ఛాలెంజ్‌ని మరెవ్వరూ ఎదుర్కోలేరు!" అన్నాడు దాదా.

"కానీ అంత ఖరీదైన వజ్రాలహారాన్ని కాజెయ్యాల్సిన అవసరం – అంత డబ్బు కక్కుర్తి నాకులేదు!" అన్నాడు రాకా నిష్కర్షగా.

"నిజమే! నీ కా అవసరంలేదు. కాని ఈ జీవితాన్ని వదిలేసి, నేను ఎక్కడికైనా

వెళ్ళి హాయిగా బ్రతకడానికీ — నన్ను నమ్ముకున్నవాళ్ళు అన్యాయం కాకుండా వుండడానికీ నా కా హారం కావాలి. రాణీ గాయత్రీదేవికి ఆ హారం పోయినంత మాత్రాన పెద్దనష్టమేమీలేదు. దానివల్ల ప్రజలకి జరిగేహానీ లేదు. ఇక నీకు..... ఆ వజ్రాలహారాన్ని కొట్టియ్యడం ఒక ఫీట్! నువ్వు కాదనకూడదు." చెప్పాడు భైరాజ్‌దాదా.

రాకా మాట్లాడలేదు.

"అన్ని కోట్ల ఖరీదైన వజ్రాలహారంలో వజ్రాలమ్మి ఆ సొమ్ము మొత్తాన్ని నేను అనుభవించదల్చుకోలేదు. మాకు అవసరమైనంత తీసుకుని మిగిలింది ఏ అనాధశరణాలయానికో అందే ఏర్పాటుచేస్తాను. నువ్వు ఊ అంటే చాలు...... ఏమంటావ్?" ప్రాధేయపూర్వకంగా అడిగాడు భైరాజ్‌దాదా.

రాకా నవ్వాడు సన్నగా. "దాదా..... నన్నెలా బోల్తా కొట్టించాలో నీకు బాగా తెలుసు!" అన్నాడు.

భైరాజ్‌దాదాకి వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది.

"గుడ్..... దాని సెక్యూరిటీ..... మన ప్లాను..... అన్నీ వివరంగా మాట్లాడుకుందాం" అన్నాడు భైరాజ్‌దాదా ఉత్సాహంగా.

****



# నాకు తెలిసినంత నేరం

## అయిదు హత్యలలో నిందితుడు

మద్రాసు నగరంలో సంచలనం సృష్టించిన ఐదు హత్యలలో నిందితుడు 30 సం. వయస్సు కల గౌరి శంకర్ అలియాస్ ఆటో శంకర్‌కు స్థానిక పోలీసులతో లాలూచి ఉన్నట్లు రుజువు చేసే విడియో క్యాసెట్లు, డైరీలూ పోలీసు ఉన్నతాధికారులకు లభించాయి.

ఏయే పోలీసులకు ఎపుడెపుడు లంచాలు ఇచ్చింది డైరీలో వ్రాసి ఉన్నాయి. ఆటో శంకర్ కొత్తగా గృహ ప్రవేశం చేస్తున్న సందర్భంగా ఏర్పాటైన ఒక వేడుకపై పోలీసులు దాడి చేసి విడియో కెమెరా స్వాధీనం చేసుకున్నారు. భవన నిర్మాణ ప్రాంతాలు, గుడిసెల వద్ద ఈ మధ్యనే పోలీసులు ఐదుశవాల్ని వెలికి తీశారు.

చీకటి వ్యాపారంలో పేరుమోసిన నేరస్థుడు ఆటోశంకర్‌కి శవాలు బయటపడిన ప్రదేశాలకి సంబంధం ఉంది. గత అక్టోబర్ నుంచి పెరియార్ నగర్ మురికివాడ ప్రాంతంలో ఈ హత్య పరంపర కొనసాగింది. గొంతు నులిమి, పెట్రోలుతో కాల్చి చంపినట్లు శవాలను పరిశీలించిన అధికారులు వెల్లడించారు.

రిక్షావాలాగా జీవితం ప్రారంభించి, ఆటో రిక్షాడ్రైవర్‌గా మారి అమ్మాయిలను తార్చి, స్మగ్లింగ్ చేసి ఐదేళ్ళు గడిపిన 'ఆటో శంకర్' ప్రస్తుతం ఒక లక్షాధికారి. పెరియార్ నగర్‌లోని 600 మంది పేదలకు ఆపదల్లో 'రక్షణ' ఇస్తూ, అవసరాలకు డబ్బులు కురిపిస్తూ "మంచి పేరు" సంపాదించాడు. పేదలకు బట్టలు దానం చేస్తూ వారి కోసం ఒక రాత్రి పాఠశాలను కూడ నడుపుతున్నాడు. పసిపిల్లలు అంటే ప్రాణాధికంగా ప్రేమించే శంకర్ ఇన్ని హత్యలకు కారకుడనే వాస్తవాన్ని ఆ ప్రాంత ప్రజలు ఇంకా నమ్మలేకపోతున్నారు. తను 'ప్రేమించిన' లలిత అనే వేశ్య సుదాల్లై అనే వ్యక్తితో లేచి పోవడాన్ని భరించలేక ఆటో శంకర్ ఆమెను గొంతు పిసికి తనకు చెందిన గుడిసెలో గత అక్టోబర్ నెలలో పాతి పెట్టాడు. ఆ తర్వాత సుదాల్లైను కూడా గొంతు పిసికి చంపి అతని శవాన్ని పెట్రోల్ పోసి బూడిద చేసి, బూడిదను సముద్రంలో కలిపేశాడు. ఈ విషయం తెలిసిన సుదాల్లై స్నేహితుడికి కూడా మార్చి 15 నాడు అదే గతి పట్టింది. ఆ తరువాత పాత కష్టమర్లయిన ఇద్దరు మిత్రుల్ని గాంధీనగర్‌లో తనకున్న రెండంతస్తుల బిల్డింగ్‌లోని ఒక గదిలో హతం చేసి ఆ సమీపములోని నిర్మాణంలో ఉన్న ఒక భవనము వద్ద ఆ శవాల్ని పాతిపెట్టాడు. ఆటో శంకర్

---

## పవిత్రపాపి

రాణీ గాయత్రీదేవి ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయ్. తనతో కూడా వచ్చే లగేజిని ఆఖరుసారిగా చెక్‌చేస్తోందామె.

ఇంతలో –

తలుపు దఢాలున నెట్టుకుంటూ ప్రతాప్‌వర్మ ఆ గదిలోకి దూసుకొచ్చాడు.




"ఏమండీ రాణీగారూ! మీ ఏర్పాట్ల హడావుడి మీదేగానీ నా సంగతి పట్టించుకున్నట్లు లేదు....." అన్నాడు.

"ఏమిటి?" అన్నట్లు తలెత్తి చూసింది భర్తని.

"మనవెంట నా సామాన్లు తీసుకురావడంలేదే!"

"సామాన్లంటే....? విస్కీసీసాలేగా? నేనే వద్దనిచెప్పాను" అంది కటువుగా.

"అదే.... వైనాట్? ఎందుకు? అని అడుగుతున్నాను?"

చిరాగ్గా చూసిందామె భర్తని. అతను రాకపోతే తన ప్రెస్టేజ్‌కి భంగం గనుక తీసుకెళుతోంది. లేకపోతే..... ఈ న్యూసెన్స్ పెట్టుకునేదికాదు.

"చెప్పరేం రాణీ! నా విస్కీ కోటా మాటేమిటి?" అడిగాడు వర్మ మళ్ళీ.

తాగుడువల్లో – కోపంవల్లోగానీ అతని కళ్ళు ఎర్రగా మెరుస్తున్నాయ్.

"ఎందుకు? అక్కడకూడా తాగి తందనాలాడ్డానికా? మీ తాగుబోతు వేషంతో నా పరువు అక్కడకూడా తియ్యడానికా?" అంది రాణి.

పకపక నవ్వాడు ప్రతాపవర్మ.

"పరువా? అసలలాంటి దేదైనా వుందా మనకు? మొగుణ్ణి మొగుడుగా గౌరవించలేని ఆడదానికి పరువెక్కడుంటుంది?" అడిగాడు.

"ఏం? నేనేం పరువుతక్కువపనిచేశాను? మీలా పెళ్ళాన్ని వదిలేసి దొరికిన దాసీ ముండలతో కులకడంలేదే.... ఎస్టేట్ వ్యవహారాలు పట్టించుకోకుండా మీలా క్లబ్బుల్లోపడి దొర్లడంలేదే!"

"ఓహో .... నేనలా తయారుకావడానికి కారణం ఎవరు? నువ్వుకాదూ? నీకు కేవలం అలంకారానికీ – గొప్పగా చూపించుకోడానికీ ఓ మొగుడు కావాలి! అందుకే నన్ను కట్టుకున్నావ్‌గానీ – నేను చచ్చానో – బ్రతికానో – వుంటున్నానో – తింటున్నానో ఏ రోజైనా ఆలోచించావా?

నేరాలలో సహకరించిన శశి అనే ఆటో డ్రైవర్‌ను సి. బి. ఐ. అధికారులు అరెస్టు చేశారు. ఆటో శంకర్‌ను అరెస్టు చేసినప్పటి నుంచి శశి పరారీలో ఉన్నట్లు పోలీసులు తెలిపినారు ఇతనికి కూడ అనేక నేరాలతో సంబంధం ఉన్నట్లు సి. బి ఐ. పేర్కొంది.

పసుపులేటి శ్రీనివాసులు,
అనంతపురం

★ ★ ★

## చౌక దుకాణం - అక్రమ వ్యాపారం

ఎన్నో ఏళ్ళ నుండి ఒకే ఊరిలో ఉంటున్న నాకు వేరు వేరు ప్రాంతాల గురించి తెలిసే అవకాశం లేకపోయినా ఒకే రకమయిన నేరం మాత్రం రెండుసార్లు కళ్ళు చూసే దుస్థితి ఏర్పడింది మొదటిది చిన్నతనంలో కాబట్టి ఏమీ చేయలేకపోయాను. కానీ యిప్పుడు మాత్రం అందరికీ తెలియజేసుకొనే అవకాశం ఆంధ్ర సచిత్ర వారపత్రిక ద్వారా లభించింది

పదవ తరగతి చదివేటప్పుడు జరిగిన ఈ నేరం యిప్పటికీ నా స్మృతి పథంలో మెదలుతుంది. పౌర సరఫరా విభాగానికి చెందిన చౌక దుకాణం మా యింటికి దగ్గరలో నే ఉండేది. ఆ దుకాణదారుడు 'తాను తెచ్చిన సరుకును ఎక్కువ'ధరలో బ్లాక్ మార్కెట్‌కు రహస్యంగా బండ్లలో వేసి తరలించేవాడు సరుకు తక్కువగా వచ్చినది అని ప్రజలను మభ్యపెట్టి మోసగించి కొంత మందికి మాత్రమే అంతంత మాత్రంగా సరుకును యిచ్చేవాడు. మిగిలిన వాళ్ళు ఖాళీ సంచులతో మొఖాలు వేలాడేసుకొని తిరుగుముఖం పట్టేవారు. ఆ దుకాణం మా యింటికి అతి చేరువలో ఉండటం వలన చీకటి పడ్డ తర్వాత 10, 11 గం. ల ప్రాంతంలో లేక తెల్లవారు జామున 3 గం. ల ప్రాంతంలో దొంగతనంగా తరలించడం చదువుకోటానికి లేచిన నాకు స్పష్టంగా తెలిసేది. కానీ చిన్నతనం కాబట్టి ఏమీ చేయలేకపోయాను.

అలాంటి పరిస్థితే యిప్పుడు ఎదురయింది. అందరికీ సరఫరా అవుతున్న పామోలిన్ ఆయిల్ మాకు మాత్రం అందటంలేదు. రెండు నెలలుగా మాకు యివ్వవలసిన నూనె డబ్బాలు ఎగురగొట్టి తనకు సరుకు అందటం లేదని మభ్యపెడుతున్నాడు. కానీ ఊరిలోని ప్రతిదుకాణదారుడు ప్రజలకు నూనె సరఫరా చేస్తూనే ఉన్నారు మా వీధికి తప్ప. సరుకును గోడవున్ దగ్గరనే ఎక్కువ ధరకు అమ్మివేసి మిగిలిన పైకం తాను (డీలర్) తీసుకొంటున్నట్లు వార్తలందుతున్నాయి. ఈ విషయం పై అధికారులకు విన్నపాలు వినిపించి ఫిర్యాదులు వ్రాసిచ్చి వ్యర్థమై విసుగొచ్చింది రాష్ట్రమంతటా పామోలిన్ సరఫరా అని ప్రభుత్వం వేనోళ్ళ చాటుతూ తామేదో ఘనత చేస్తున్నట్లు ప్రకటిస్తుంటే మాకు మాత్రం ఈ మోసగాళ్ళ, కుట్ర పన్నాగాల వల్ల సరుకు అసలు సరిగా అందకపోగా చాలా యిబ్బందులు ఎదురవుతున్నాయి యిది నాకు



తెలిసినచట్ట విరుద్ధ నేరం ప్రభుత్వాధికారుల నిర్లక్ష్య వైఖరికి, ప్రజల అసౌకర్యాలను గమనించని ప్రభుత్వ పరిపాలనకు యిది ఒక నిదర్శనం. యిలాంటి నేరాలు మరెన్ని ఉన్నాయో! యిలాంటి నేరాలకు అంతం ఎప్పుడో? సామాన్య ప్రజలు సుఖపడేదెప్పుడో?

- ధరణీ వాణీ, కర్నూల్

ఒక్క రోజైనా నోరారా పలకరించావా? నీకు నీ అలంకరణలమీద - షోకులమీద - షికార్లమీద వున్న శ్రద్ధ. ఓపిక మొగుడిమీద వుందా? నీ విలాసాలకీ, తిరుగుళ్ళకీ నే నెక్కడ అడ్డుపడతానోనని నాకు నువ్వే తాగుడు అలవాటుచేశావ్. నిన్ను కంట్రోల్ చెయ్యలేక నీ ఘరానా తిరుగుళ్ళు చూడలేక విస్కీలో నే మనశ్శాంతిని వెదుక్కుంటున్నాను. మన భాగోతం మన ఎస్టేట్‌లో నే కాదు చుట్టుపక్క లందరికీ తెలుసు. ఇంకా మనకి పరువెక్కడుంది?"

రాణీ గాయిత్రీదేవి ముఖం కోపంతో జేవురించింది. ఆమె పెదవులు ఆవేశంతో కంపించాయి

"పనిమనిషితో ప్రేమాయణం నడిపే మీకు పరువులేదేమోగాని నాకుంది. అనవసరంగా నన్ను రెచ్చగొట్టకండి" అంది.

"నీకంటే పనివాళ్ళే నయం! కనీసం నేను చచ్చానో, బ్రతికానో చూస్తారు. నీలా మొగుణ్ణి యింట్లోవదిలేసి ఉత్తమగృహిణి లక్షణాల గురించి ఉపన్యాసాలు యివ్వరు!" అన్నాడు ప్రతాపవర్మ.

"సరే - సరే! ఇప్పుడు తీరిగ్గాకూర్చుని నా గుణగణాలను గురించి మీరు ఏకరువుపెట్టనవసరంలేదు. మీపని మీరు చూసుకోండి!"

"నేనూ అదే చెబుతున్నాను. నీ పని నువ్వు చూసుకో. నేను అభ్యంతరపెట్టను. మనం కేవలం పేరుకిమాత్రమే భార్యాభర్తలమని నేను మర్చిపోలేదు.... కానీ - నా విస్కీ బాటిల్స్‌మాత్రం లగేజ్‌లో పెట్టించు!"

"ఆపని ఛస్తే చెయ్యను. అక్కడేదయినా పార్టీ యిస్తే తాగడమే.... అంతే..."

పకపక నవ్వాడు ప్రతాపవర్మ.

"ఛస్తే నువిచ్చేదేమిటి? అప్పు డీ దరిద్రపు గొడవ లేకుండానే నేను తాగగలను. నీతో వాదన అనవసరం! నా విస్కీ కోటా నాకు వస్తుందా రాదా?" అతని స్వరం తీవ్రంగా పలికింది.

"రాదు.... రాదు.... రాదు...."

ప్రతాపవర్మ విసురుగావెళ్ళి టేబుల్‌మీదున్న ఫ్లవర్‌వాజ్‌ను తీసి నేలకేసి కొట్టాడు. అది పెద్ద శబ్దంతో బద్దలైంది. కోపంతో అతని చేతులు వణుకుతున్నాయి!

"యూ.... బాస్టర్డ్!" అరిచింది గాయత్రీదేవి.



పవిత్రపాపి

"నీలాంటిదానికి మొగుడినయాక నేను బాస్టర్డ్‌నికాక మరేమవుతాను? ఇలా రెచ్చగొట్టావంటే నీ బతుకును బజారుకీడుస్తాను, తెల్సా?"

గాయత్రీదేవి హేళనగా – "ఏం చేస్తావ్? చంపుతావా?"

"అంత తెలిగ్గా నువ్వు ఛస్తే ఎలా? బ్రతికివుండే అనుక్షణం చచ్చేల్లా చేస్తాను. నీ గుట్టు రట్టుచేస్తాను.... ఆ వజ్రాల హారం.. ."

ఆ మాట వింటూనే గాయత్రీదేవి ముఖం పాలిపోవడం చూసిన ప్రతాపవర్మ గొంతుని యింకాస్త పెంచి –

"నువ్వు ప్రాణప్రదంగా కాపాడుకుంటున్న వజ్రాల హారం రహస్యం ...."

ఒక్క గెంతులో అతన్నిచేరి చప్పున నోటిని మూసేసింది గాయత్రీదేవి.

"ప్లీజ్! గొడవచెయ్యకండి మీ ఆరోగ్యం కోసమే విస్కీ సీసాలు పెట్టొద్దన్నాను. మీ యిష్టం. అలాగే తెస్తానుగానీ గోలచెయ్యకండి!" అంది. ఇప్పుడామె తిరగబడుతున్న ఆడపులిలా లేదు. శక్తుడిగిన పిల్లిలావుంది!

"దట్స్ గుడ్.... నేను అల్లరిచెయ్యకుండా వుండాలంటే విస్కీకావాలి!" అన్నాడు ప్రతాపవర్మ నవ్వుతూ.

"సరే..... యిక మీరు ప్రయాణానికి సిద్ధంకండి ."




"ఓకే.... ఓకే..." అంటూ వెళ్ళిపోయాడు వర్మ. అతను వెళ్ళిపోగానే నీరసంగా సోఫాలో వాలిపోయింది గాయత్రీదేవి.

మూసిన ఆమె కనురెప్పలక్రింద ఏదో మెరుపుమెరసినట్లయింది. ఏవో ఆలో చనలను ఆమె మనసులో ఒక రూపుదిద్దుకోసాగాయ్!

అవును.... అంతే.... అలాజరగాలి.... తన బాధలు కష్టాలు విరగడైపోవాలి శాశ్వతంగా.. .

రాణి గాయత్రీదేవి తీవ్రంగా ఆలో చించసాగింది

తలుపు ధడాలున తోసుకుని లోపలకొచ్చాడు ప్రతాపవర్మ. అతని కళ్ళు ఎర్రగావున్నాయ్. మనిషి తూలుతున్నాడు! రాణీ గాయత్రీదేవి చివ్వున తలెత్తి చూసింది భర్తని!

"జానీవాకర్ స్టాక్ అయిపోయింది. తెప్పించమని నిన్ననగా చెప్పాను. తెప్పించలేదా?" అడిగాడు ప్రతాపవర్మ.

"లేదు. ఒక బాటిల్ ఈరోజుకి సరిపోతుందిగదా అని తెప్పించలేదు. ఈ రోజుకి వెళ్ళిపడుకోండి!" అంది గాయత్రీదేవి.

"ఆ బాటిల్ ఎప్పుడో అయిపోయింది. నాకు మరో బాటిల్ కావాలి!" అన్నాడు మొండిగా.

"ఈ రోజుకి తాగింది చాలుగానీ నోర్మూసుకుని వెళ్ళిపడుకోండి!" అన్న రాణీ మాటలకి తన ముందున్న కుర్చీని బలంగా తన్నాడు వర్మ.

"నో.... ఐ వాంటిట్ యిమ్మీడియట్లీ! కమాన్! గెట్‌మీ విస్కీ!"

నిప్పులు కక్కే కళ్ళతో భర్తని చూస్తూ –

"మీరు హద్దుమీరి ప్రవర్తిస్తున్నారు. నేనిక సహించేదిలేదు. వెళ్ళండి!" అంది.

తూలి సోఫామీద పడబోయి నిలదొక్కుకున్న ప్రతాపవర్మ వెకిలిగా నవ్వుతూ –

"ఓహో ...... మీరు సహించరా?? మీ అఘాయిత్యాలు నేనెన్నో సహించానే! భరించానే! మరి? నువ్వు..... స్త్రీల నుద్ధరించే నాయకురాలివా? నేను నోరు విప్పానంటే నీ బ్రతుకు బండారం లోకానికి తెలిసిపోతుంది. అందుకే తాగుడుతో నోరు నొక్కేసుకుంటున్నాను.... గుక్కెడు విస్కీతో గుండె మంటల్ని చల్లార్చు కుంటున్నాను" అన్నాడు ప్రతాపవర్మ.

భర్తని అసహ్యంగా చూసింది గాయత్రీదేవి.

"ఛీ ఛీ! మీరు మనుషులుకాదు. పరువుకోసం మిమ్మల్నిభరిస్తున్నాను. లేకపోతే....."

"లేకపోతే ఏం చేసేదానివి? విడాకులిచ్చేదానివా లేక చంపించేదానివా?"

"ఛీ! బరితెగించినవాళ్ళతో నాకు మాటలనవసరం! మీరు అరిచి గీపెట్టినా యిప్పుడు విస్కీలేదు. గొడవచెయ్యకుండా వెళ్ళండి!" అంది.

"నాకు విస్కీ యివ్వకపోతే......"

"ఊ.... యివ్వకపోతే?" అడిగింది గాయత్రీదేవి.

"నేను.. .. నేను..... వజ్రాలహారం రహస్యం అందరికీ చెప్పేస్తాను!"

పక్కలో బాంబు పడ్డట్టు అదిరిపడింది రాణీ గాయత్రీదేవి. ఆమె ముఖం పాలిపోయింది.

ద్వేషం రగిలిన కళ్ళతో భర్తనిచూస్తూ బెల్‌నొక్కింది.

బేరర్ రాగానే –

"స్టోర్‌రూం తెరిచి ఓ స్కాచ్‌విస్కీ బాటిల్ తీసి రాజాగారి గదిలోపెట్టు" అంది. బేరర్ వినయంగా తలవూపి వెళ్ళిపోయాడు.

రాజా ప్రతాపవర్మ మెల్లగా ముందుకు కదిలి –

"థాంక్యూ రాణీగారూ! పరుషంగా మాట్లాడి మీకు ఖేదం కలిగించినందుకు క్షంతవ్యుణ్ణి!" అన్నాడు.

"షటప్! మీ సంజాయిషీ నా కనవసరం! ఇంకో క్షణం మీ రిక్కడుంటే నేనేం చేస్తానో నాకే తెలీదు!"

"ఆ వజ్రాలహారం సంగతి....." ఏదో చెప్పబోయాడు వర్మ.

"గెటవుట్!" పిచ్చిదానిలా అరిచింది రాణీ గాయత్రీదేవి.

ప్రతాపవర్మ గొణుక్కుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

★ ★ ★ ★

సేట్ చమన్‌లాల్ యిల్లు –

తన గదిలో వెల్వెట్ బట్టపైవున్న వజ్రాలను మాగ్నిఫైడ్ గ్లాస్‌లో పరీక్షిస్తున్న సేట్ చమన్‌లాల్ గుమ్మం దగ్గర అలికిడి వినిపించి తలెత్తి చూశాడు.

గుమ్మం దగ్గర –

ఓ బురఖా ధరించి స్త్రీ నిలబడివుంది!

"కౌన్హై?" చటుక్కున వజ్రాల క్లాత్‌ను మడిచి డ్రాయర్‌లో పెడుతూ అడిగాడు చమన్‌లాల్.

ఆమె సమాధానం చెప్పకుండా గదిలోకి అడుగుపెట్టి చమన్‌లాల్ దగ్గరకు వచ్చి అతని ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది!

"ఎవరు మీరు? ఏం కావాలి?" అడిగాడు చమన్‌లాల్ కంగారుగా.

ఆమె బురఖా తొలగించింది.

ఆమెని చూడగానే చటుక్కున లేచి నిల్చున్నాడు చమన్‌లాల్!

"అరె.... ఆప్! కాకితో కబురుపెడితే వచ్చేవాణ్ణి..... యింత రాత్రివేళ మీరు...."

గాయత్రీదేవి చిన్నగా నవ్వి .

"నీతో అర్జంట్‌పనివుండి వచ్చాను చమన్‌జీ. " అంది తాపీగా

"చెప్పండి ", అన్నాడు చమన్‌లాల్ వినయంగా

చమన్‌లాల్ ఉత్తర భారతదేశంలో పేరొందిన వజ్రాల వ్యాపారి రాణీకి సన్నిహితుడు.

"మరేంలేదు ఆంధ్రప్రదేశ్‌లో ఆంధ్రమాత విగ్రహానికి నా హారం అలంకరిస్తున్నాను తెలుసుకదా' అంది దర్పంగా

"తెలుసు. తమ హారానికి మెరుగు పెట్టించాలా?" అడిగాడు చమన్‌లాల్

రాణి తల అడ్డంగా ఊపింది.

"కాదు..." అన్న రాణి గొంతు తగ్గించి తను వచ్చిన పని వివరించింది. ఆమె చెప్పిన విషయాలను నోరు తెరుచుకుని విన్నాడు చమన్‌లాల్. అతనికి చెమటలు పట్టాయి. కుర్చీ అంచున ఉన్న టర్కీటవల్‌తో బట్టతల మీద కారుతోన్న చెమట బిందువుల్ని గట్టిగా తుడుచు కున్నాడు

"మీరు చెప్పిన పని కాస్త రిస్క్‌తో కూడిన పని .. "

"సేట్‌జీ!" మెల్లగా అన్నా పాము బుస కొట్టినట్టు ఉందామె కంఠస్వరం

"ఈ విషయం మీద మీ సలహా అడగడానికి రాలేదు నేను .. చెప్పిన పని చెయ్యండి. లేకపోతే నా వల్ల కాదని చెప్పండి.. మిగతా విషయాలు అనవసరం!"

"నిజమే మేమ్‌సాబ్! నన్ను మన్నించండి అదృష్టవశాత్తూ. అతను ప్రస్తుతం ఢిల్లీలో నే వున్నాడు. రేపే అతన్ని కాంటాక్ట్ చేస్తాను... " చెప్పాడు చమన్‌లాల్.

రాణీ గాయత్రీదేవి కళ్ళు ఆశతో మెరిశాయి!

"నో! ఇమ్మీడియట్‌గా కాంటాక్ట్ చెయ్యండి! అతన్ని అర్జంట్‌గా రమ్మనండి. నేనే అతని ఫ్లయిట్ ఫేర్ పే చేస్తాను మళ్ళీ నేను రేపు ఉదయం ఏడు గంటలకల్లా వస్తాను!" లేచి నిలబడి తలుపు వేపు నడిచింది రాణి. తలుపు తీసి వెనక్కి తిరిగి సూటిగా చమన్‌లాల్ కళ్ళల్లోకి చూసింది.

"చమన్‌జీ! మీరు చేసిన పనికి ఫలితం ఉంటుంది. కానీ ఈ విషయం బైటకు వచ్చిందా.... ఫలితాలు దారుణంగా వుంటాయ్! గుడ్..."

చమన్‌లాల్‌కి ముచ్చెమటలు పోశాయ్. మెల్లగా గొంతు ... ఏదో చెప్పబోయాడు.

కానీ– అప్పటికే–

రాణి గాయత్రీదేవి వెళ్ళి పోయింది!!




* * * * * * *

మర్నాడు–

"సారీ మేడమ్! మీరు చెప్పిన పనికి చాలా శ్రమ పడాలి. రిస్క్ ఎక్కువ. అందుకే అంత మొత్తం అడుగు తున్నాను. అనుక్షణం మిమ్మల్ని కనిపెట్టుకుని ఉండాలి ఏమాత్రం పొరపాటు జరగ కూడదు కదా!" అన్నాడు పాల్‌రోబ్సన్.

అతను ఇటలీలో స్థిరపడ్డ జర్మనీ దేశస్తుడు చమన్‌లాల్ పిలుపు నందుకుని వచ్చాడు.

రాణి– అతనూ– చమన్‌లాల్ పర్సనల్ రూంలో కూర్చుని మాట్లాడు తుంటున్నారు.

"నేను కూడా కొంచెం ఇబ్బందుల్లో ఉన్నాను. అంత "పే" చెయ్యలేను. పని పూర్తయాక నువ్వడిగిన మొత్తం ఇచ్చేస్తాను. మీ ఖర్చులతో పాటు తిరిగి మీ దేశం వెళ్ళడానికి ఫ్లయిట్ టికెట్ కొనిస్తాను" చెప్పింది గాయత్రీదేవి.

కాస్సేపు ఆలోచించిన పాల్‌రోబ్సన్. .. ఏదో నిర్ణయానికి వచ్చినట్టు తల పంకించి–

"ఆల్‌రైట్ మేడమ్! ఈ క్షణం నుంచి మళ్ళీ మీరు ఆంధ్రప్రదేశ్ నుంచి తిరిగి వచ్చేవరకూ మీ అంగరక్షకుడిగా వుంటాను!" అన్నాడు.

గాయత్రీదేవి చిన్నగా నవ్వింది.

"గుడ్! నీ ప్రయాణానికి ఇప్పుడే ఏర్పాట్లు చేస్తున్నాను...." అని, "ఓ సందేహం...." అంటూ ఆగింది.



"నిరభ్యంతరంగా అడగండి మేడమ్!" అన్నాడు పాల్‌రోబ్సన్.

"పాల్ రోబ్సన్ అంటే విశ్వ విఖ్యాత సంగీత కళాకారుడు, నువ్వు చేసే పని పేరు- మరి నువ్వా పేరు...."

పెద్దగా నవ్వాడు పాల్‌రోబ్సన్.

"నేనూ ఓ రకంగా సంగీత కళాకారుడినే. నాతో తలపడిన వాళ్ళ చెవుల్లో డెత్ మ్యూజిక్ వినిపిస్తాను. నా సహాయం కోరిన వాళ్ళ గుండెల్లో వేయి వీణలు మోగిస్తాను. అయాం పాల్‌రోబ్సన్!" అన్నాడతను.

"ఐ వాంట్ మ్యూజిక్ ఆఫ్ సక్సెస్–" అంది గాయత్రీదేవి నవ్వుతూ.

* * * * * * *

"దీప్యా!!

వజ్రాలహారం దొంగిలించడం నేనో నేరంలా భావించడం లేదు. అదో ఛాలెంజ్‌గా తీసుకుంటున్నాను. ఐ హేట్ దిస్ బ్లడీ డ్రామా! కోట్లాది రూపాయల ప్రజల సొమ్ముతో విగ్రహాలు పెట్టడం- లక్షలాది రూపాయలు ఖర్చుపెట్టి రాణీవాసపు చిలుకల్ని రప్పించడం- వాళ్ళు తమ రాచరికాన్ని చాటుకోవడానికి పేదల ముందు తమ జ్యూవెలరీని ప్రదర్శించడం.... వాటీజ్ దిస్ నాన్సెన్స్? వాటీజ్ దిస్ షో?" ఆవేశంగా అన్నాడు రాకా.

"అవును ఇదంతా డ్రామాయే. ఒప్పుకుంటాను. కాని నువ్వు అంత మందిలో ఎలా ఆ వజ్రాల హారాన్ని దొంగిలిస్తావ్?" అడిగింది దేదీప్య.

"అది చాలా కష్టమనీ- దాదాపు అసంభవమని నాకు తెలుసు. అందుకే ఇది నా ప్రతిభకూ, తెలివి తేటలకూ ఛాలెంజ్‌గా భావిస్తున్నాను. ప్రతి ఒక్కర్ని ఏమార్చి టి. వి. స్క్రీన్‌లను మాయం చేసి ఆ వజ్రాల హారాన్ని కొట్టేస్తాను. ప్రపంచ మంతా "రాకా" అంటే దిగ్భ్రమ చెందేలా చేస్తాను."

"మరి నీకు నేనేమయినా హెల్ప్ చెయ్యగలనా?" అడిగింది.

రాకాకి ఏదో విధంగా సాయపడుతూ అతని నీడలా వుండాలని ఆమె మనసు ఆరాటపడుతోంది.

"వద్దు. . ఇది ప్రాణాలతో చెలగాటం. ఏ క్షణాన ఏ ప్రమాదం ముంచుకొస్తుందో తెలీదు... నేను పోలీసులకి పట్టుబడ్డా పోలీసులు నన్ను కాల్చేసినా- ఆ రిస్క్ నేనొక్కడినే ఎదుర్కోవాలి!"

దేదీప్య నిరాశగా చూసింది.

"అంటే నువ్వొక్కడివే అభిమన్యుడిలా ఆ కురుక్షేత్రంలోకి దూసుకుపోతే నేను గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవాలా? నా వల్ల కాదు బాబూ .. ఆ టెన్షన్ భరించడం నా వల్లకాదు!" నిష్కర్షగా చెప్పింది దేదీప్య




"అదిగాదు దీప్యా...." ఏదో చెప్పబోయాడు

"ఇక నువ్వు ఏం చెప్పినా నేను విననుగాక వినను. నేను నీ కూడా ఉంటాను. అంతే!" చెప్పింది దేదీప్య.

రాకా కాసేపు ఆలోచించి–

"నువ్ 'సీన్ ఆఫ్ యాక్షన్'లో ఇన్‌వాల్వ్ కావొద్దన్నాను గానీ నీ సహకారం వద్దన లేదుగా? నువ్వు అక్కడే వుంటావ్.... ఇంతకీ మీ మమ్మీ ఆ. ఫంక్షన్‌కి వస్తారా?" అడిగాడు.

"ఊహు.... రాదు. అమ్మకి ఈ ఫంక్షన్లంటే ఎలర్జీ!" చెప్పింది దేదీప్య.

"గుడ్! అయితే మీ మమ్మీ ఇన్విటేషన్ తీసుకుని నువ్ డైరెక్ట్‌గా ఫంక్షన్‌కి వెళ్ళిపో. సరిగ్గా పదికి పది నిముషా లుండనగా నేను వస్తాను. హారం మాయమై పోయాక బాగా గందరగోళం జరుగుతుంది. ఆ తర్వాత జరిగే పరిస్థితుల్ని గమనించి ఇంటికి వెళ్ళిపో. మధ్యాహ్నం నేను నిన్ను కాంటాక్ట్ చేస్తాను." అన్నాడు రాకా.

"మరి.... నువ్వు ఎలా ఏ వేషంలో వస్తావో నేను నిన్ను గుర్తు పట్టడం ఎలా?" అడిగింది దేదీప్య.

"ఎవరెన్ని మారు వేషా లేసినా కావలసిన వాళ్ళ చూపుల్నుంచి తప్పించుకో లేరట!" అంటూ నవ్వి–

"ఎనీవే నేను నా కుడిచేతికి "లవ్" అనే అక్షరాలున్న పెద్ద ఉంగరం పెట్టుకుంటాను. అదే గుర్తు!" అన్నాడు రాకా.

"ఓ. కే! కానీ నువ్వు ఆ హారాన్ని ఎలా దొంగిలిస్తావో చెప్పవూ?"

"వెయిట్ అండ్ సీ దీప్యా! రాకా చెప్పింది చేస్తాడు. ఎలా చేసేది మాత్రం చెప్పడు. దటీజ్ రాకాస్టయిల్!" అన్నాడు నవ్వుతూ.

అదే.... ఆ ఆత్మవిశ్వాసమే అతనిలో ఆమెకి నచ్చిన గుణం. ఆరాధనగ అతన్నే చూస్తుండి పోయింది.

* * * * * * *

హైదరాబాద్ ఎయిర్‌పోర్ట్–

మధ్యప్రదేశ్ నుంచి వచ్చిన ప్రత్యేక విమానంలో దిగారు రాణీ గాయత్రీదేవి, ప్రతాపవర్మ, ఆమె పరివారం.

ముఖ్యమంత్రి ఏకాంబరం- ఆయన మంత్రివర్గ సహచరులు, అధికార- అనధికార ప్రముఖులు ఆమెకి విమానాశ్రయంలో ఘన స్వాగతం ఇచ్చారు.

రాణీ అందర్నీ పేరు పేరునా వరుసగా పరిచయం చేసింది. ఆఖరిగా పాల్‌రోబ్సన్‌ని పరిచయం చేస్తూ,

"ఇతను నా బాడీగార్డ్! అంతర్జాతీయ ప్రఖ్యాతి గాంచిన ప్రొటెక్టర్! ఈ ట్రిప్ కోసం ప్రత్యేకంగా ఇతన్ని ఇటలీ నుంచి రప్పించాను." అంది రాణీ గర్వంగా.

"అదేంటి మేడం? ఇక్కడ మీ రక్షణకేం లోటు జరిగిందని?" అన్నాడు ముఖ్యమంత్రి నొచ్చుకున్నట్టుగా.

"అబ్బే... మీ మీద నమ్మకం లేకకాదు. వజ్రాల హారం కోసం...."

"దాని రక్షణకి అన్ని ఏర్పాట్లు పూర్తి చేశాం మేడం! అందుకే ప్రోగ్రాంలో చిన్న మార్పు చేశాం...." అన్నాడు డి. జి. పి. కళ్యాణ్‌రాం ముఖ్యమంత్రి వేపు చూస్తూ.

ఏమిటన్నట్టు చూసింది రాణి

"రేపు ఉదయం అరున్నరకే రాణీగారి హారాన్ని ఆంధ్రమాత మెడలో అలంకరిస్తాం. ఆ హారం ప్రతిక్షణం కన్పించేలా దాని చుట్టూ టి. వి. సెట్లు ఏర్పాటు చేస్తున్నాం. ఆ టి. వి. సెట్లు సిటీ సెంట్రల్ కంట్రోల్ రూంకి- క్రైమ్ సెల్‌కి కనెక్ట్ చేసి వుంటాయి. అందుకే మీ హారానికి వచ్చే ప్రమాద మేమీ ఉండదు!" చెప్పాడు డి. జి. పి.

"అయినా నా జాగ్రత్తలో నేనుండాలి కదా!" అంది రాణి నవ్వుతూ.

ఆ తర్వాత రాణి, రాజా వారు- ఆమె బృందం ప్రభుత్వ అతిథి గృహానికి చేరుకున్నారు.

మర్నాడే విగ్రహావిష్కరణ!!

(ఇంకావుంది)

# దారి ఐటారి

జనం జనం

ఎటు చూసినా జనం ఒకటే జనం

పట్టణ శివార్లన్నీ కొత్త క్రొత్త ఇళ్లతో నిండిపోతున్నాయి

డబ్బున్నవాళ్లు వందలకి వందలు అద్దెలు పోసి పట్టణంలో ఉంటున్నారు సగటు జీతగాళ్లంధరూ ఊరికి దూరంగా వెలసిన ఇళ్లల్లోకి మారిపోతున్నారు అక్కడ కూడా అద్దెలు పెరిగి పోయాయి

మధ్య తరగతి వాడుగా కూడా చెప్పుకోడానికి వీలులేని సంగమయ్య ఊరికి దూరంగా ఇళ్ల స్థలం కొనుక్కొని చిన్న పాక వేసుకున్నాడు దానికి దారీ డొంకా ఏమీలేదు ఎప్పుడో పట్టణం అంత దాకా అభివృద్ధి చెందినప్పుడు నాయకులు దయ దలచి రోడ్లు వేస్తారని సంగమయ్యలాంటి అల్పజీవులు అనుకొన్నారు చివరికెలాగయితేనేం రోడ్లు వచ్చాయి ప్లానులు గీసారు రోడ్లు వేసారు

పాపం సంగమయ్య ఇంటికి మాత్రం ఎటు చూసినా రోడ్డు లేకుండా పోయింది మూడువేపులా ఇళ్లు ఒక వేపు మాత్రం ఖాళీ స్థలం ఉంది

ఆ ఖాళీ స్థలం హిరణ్యాక్ష నాయుడిది. ఆ స్థలం లోంచే ఇంత కాలమూ సంగమయ్య కుటుంబం నడిచింది ఆ విషయాన్నే హిరణ్యాక్ష నాయుడితో చెప్పి తనకు దా రి ఇప్పించమని మొర పెట్టుకున్నాడు సంగమయ్య

హిరణ్యాక్షనాయుడు ససేమిరా అన్నాడు. ఆ విధంగా బిగించేస్తే సంగమయ్య కూడా స్థలాన్ని అమ్మేస్తాడని అనుకున్నాడు అది కూడా తన స్థలంతో కలుపుకోవచ్చని అతని ఉద్దేశం

Rao



సంగమయ్య ఎంత బ్రతిమాలినా లాభం లేకపోయింది పై పెచ్చు చుట్టూ ప్రహరి కట్టించెయ్యడం మొదలు పెట్టాడు హిరణ్యాక్షుడు

సంగమయ్య దంపతుల దుఃఖానికి అంతం లేకుండా పోయింది ఏమి చెయ్యాలో పాలుపోక అలాగే దిగాలుపడి కూర్చుండిపోయారు తెలిసిన ఒకరిద్దరు పుణ్యాత్ములు హిరణ్యాక్ష నాయుడికి చెప్పి చూసారు

దానితో అతని అహంకారం మరింత పెరిగి పోయింది. మొత్తం పేట పేటంతా కొనేసెయ్యాలనే దురాశ హిరణ్యాక్షనాయుడిలో బుసలు కొట్టింది

సరిగ్గా సంగమయ్య వాకిలి ముందు గోడ కట్టబోతూ పనివాళ్ళు దిగాలుగా పడుకొని ఉన్న సంగమయ్యను అనుకోకుండా చూసారు చేతిలో ఉన్న ఇటికిరాయి జారి పడిపోయింది దారి మూసేస్తే ఎలా నడుస్తారు వాళ్ళు అనే భావం హృదయంలో మెదిలి తాపీ పట్టుకునే ఓపిక కూడా నశించింది పని వాళ్ళలో.

మేస్త్రీ కూర్చుండిపోయాడు

సరిగ్గా అప్పుడే పని ఎంత వరకూ వచ్చిందో చూద్దామని హిరణ్యాక్ష నాయుడు స్కూటర్ మీద రయ్యిమని వచ్చాడు పనంతా అయిపోయింది దాదాపు. కానీ సంగమయ్య గుమ్మానికి ఎదురుగా మాత్రం గోడ లేవలేదు

వళ్ళు మండిపోయింది హిరణ్యాక్షుడికి.

"ఏంట్రా కూర్చున్నారు పని పూర్తి చెయ్యండి. అని గద్దించాడు

"వద్దు బాబూ ఆ ముసిలోళ్ళకి దారి విడిచిపెట్టండి బాబూ.

ఈ దారి కూడా లేకపోతే ఎట్టా సామీ మేం ఈ పాపం పని చెయ్యలేం అని మేస్త్రీ దీనంగా అన్నాడు

"ఏంటీ నాకే నీతులు చెబుతున్నావా? ఒక్కొక్కళ్ళ్ని తప్పిపాతేస్తా. నా సంగతి తెలీదులా ఉంది. కానీండి లేచి మర్యాదగా పని పూర్తి చెయ్యండి ఏమనుకుంటున్నారో అంటూ హూంకరించి స్కూటర్ బర్రర్ మనిపించుకుంటూ వెళ్ళిపోయాడు.

మనిషి మంచి దూకుడు మీద ఉన్నాడేమో వెనకా ముందూ చూడకుండా స్కూటర్ నడిపిస్తూ పోతున్నాడు ఎదురుగా ఒక లారీ నత్త నడక నడుస్తూ ముందుకు పోతోంది.

తొందరగా పోవాలనుకుంటున్న హిరణ్యాక్ష నాయుడికి లారీ డ్రయివర్ మీద చర్రున కోపం దూసుకు వచ్చింది. అంతే

ఒళ్ళు తెలీకుండా నాలుగో గేర్ వేసి ఎక్సిలేటర్ బలంగా నొక్కి లారీ ప్రక్కగా స్కూటర్ని దూకించాడు సరిగ్గా అప్పుడే ఎదురుగా సిటీబస్ వచ్చేసింది. ఎడమ ప్రక్క లారీ స్పీడందుకుంది. కుడివైపున సిటీబస్ రాకెట్‌లా దూసుకొచ్చేస్తోంది ఎదురుగా నాలుగో గేర్‌లో హిరణ్యాక్షనాయుడు

ఒక్క లిప్తకాలం హిరణ్యాక్ష నాయుడికి ప్రమాదం ముంచుకొస్తోందని తెలిసింది. తప్పుకోడానికి ఎటూ దారిలేదని కూడా తెలిసింది అయినా మానవ ప్రయత్నం చేద్దామని స్కూటర్ని సిటీబస్‌కి అడ్డంగా తిప్పాడు అదే స్పీడులో

మూడు పల్టీలుకొట్టి స్కూటర్ అవతల పడిపోయింది కానీ అప్పటికే హిరణ్యాక్ష నాయుడు బొప్పాయికాయ దొర్లినట్టుగా దొర్లి సిటీ బస్ చక్రాల క్రింద పడిపోయాడు ఇరవయి గజాల దూరం నించీ సిటీ బస్‌ని ఆపాలని డ్రయివర్ విశ్వ ప్రయత్నంతో బలాన్నంతా కూడగట్టుకుని బ్రేకులు వేసాడు. కానీ ఇరవయిగజాలు రోడ్డుని ఒరుసుకుంటూ చక్రాలు జరిగి హిరణ్యాక్షుడి మీద ఎక్కి ఆగిపోయింది సిటీ బస్సు.

కబురు అందుకున్న పోలీసులు లాఠీలు కట్టుకుని దిగారు తాపీటూర్ అని ఏమీ సంబంధంలేని వాళ్ళ మీద ఎగిరి పడ్డారు

గోడ పూర్తి చేద్దామా వద్దా అని సందిగ్ధంలో పడ్డ తాపీమేస్త్రీకి ప్రమాదం కబురు తెలిసింది పరుగు పరుగున వెళ్ళారు రోడ్డు మీదికి. అప్పటికే ఎవర్ని పంపాల్సిన చోటికి వాళ్ళని పంపేరు పోలీసు వాళ్ళు. పని వాళ్ళు కూడా అటు నుంచి అటే ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు విషాదంతో

ఆ నాటినించీ ఈనాటి వరకూ సంగమయ్య వాకిలి ముందు గోడ ఎవరూ కట్టలేదు. అయన దారికి ఎవరూ అడ్డుపెట్టనూలేదు. ☐








తెనుగుసేత: డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద

హిందీమూలం: డా॥ భీష్మసాహ్నీ

(గత సంచిక తరువాయి)

బట్లర్, తోటమాలి, వంటవాడు, నౌకర్లు నిలబడి వీళ్ళనే విచిత్రంగా చూడసాగారు.

"లేదు! అది అక్కడ లేదు!" లీజా అరిచింది

గుమాస్తాకు ఒళ్ళంతా వణికిపోసాగింది.

"కాదు, నువ్వు హిందువు కాదు! నువ్వు అబద్ధం చెప్పావు"

"నో! మేడమ్. నేను హిందువునే హిందూ బ్రాహ్మణుడిని"

"నో! అయితే నీ పిలక ఏది?"

గుమాస్తా భయపడిపోయాడు అతను పట్నంలో అల్లర్ల భయంతో అతి కష్టం మీద ఆఫీసుకు చేరుకున్నాడు. లీజా మాటలతో అతను తేరుకొన్నాడు. అతని తెల్లని పళ్ళు ఒక్కసారి మెరిసాయి

"మేడమ్! నాకు పిలక లేదు"

"అయితే నువ్వు 'హిందువులు' కాదు"

లీజా చూపుడు వేలు వూపుతూ నవ్వుతూ అంది "నువ్వు అబద్ధం చెప్పుతున్నావు"

"నో! మేడమ్. నేను హిందువునే".

> జరిగిన కథ- 7: ఒక మసీదుముందు పడవేసిన పంది శవాన్ని బక్షీ, జనరల్ పక్కకు లాగివేస్తారు. అప్పటికే ఉద్రిక్తంగా మారిన స్థితిలో అవును వెంట తరుముతూ ఒక అగంతకుడు పరుగెత్తుకొస్తాడు సత్సంగ్ కార్యక్రమంతో హిందూ, సిక్కు పెద్దలు రక్షణ ఏర్పాట్ల గురించి చర్చిస్తారు. ఒక ప్రతినిధి వర్గం రూపొంది డిప్యూటీ కమిషనర్‌తో మాట్లాడడానికి వెళుతుంది. రణవీర్‌కు దేవవ్రత్ మాస్టర్ దీక్ష ఇస్తాడు. నూనె మరగించడానికి, ఆయుధాలు తయారు చేయడానికి సన్నాహాలు జరుగుతుంటాయి. డిప్యూటీ కమిషనర్‌తో ప్రతినిధివర్గం చర్చలలో ఏమీ తేలదు

"నీ కోటు తీసేయ్!"

"మేడమ్?"

గుమస్తా మళ్ళీ కంగారుపడిపోయాడు

"తీసేయ్! తీసేయ్ హర్రీ అప్"

గుమస్తా నవ్వుతూ కోటు తీసేసాడు

"వెరీ గుడ్! నీ చొక్కా గుండీలు తీసేయ్"

"నో మేడమ్!"

"వాట్ నో! నో అనడానికి వీలులేదు తీసేయ్ చొక్కా గుండీలు తీసేయ్"

గుమస్తా నిస్సహాయంగా లీజా ముందు నిలబడి నెక్‌టై కింద ఒక్కొక్కటిగా మూడు గుండీలు విప్పదీసాడు

"నీ 'త్రెడ్' చూపించు".

"వాట్! మేడమ్?"

"ఏమిటి? వాట్ మేడమ్! షో మి యువర్ హిందూ త్రెడ్"

గుమస్తాకు అర్థం అయింది లీజా జంధ్యం గురించి అడుగుతుందని తెలుసుకున్నాడు. అతనికి జంధ్యం లేదు. పదో తరగతి పాసై కాలేజీలో చేరేటప్పుడు పిలక తీసి వేయించాడు. పన్నెండో తరగతిలో ప్రవేశించేటప్పుడు జంధ్యం తీసిపారేసాడు.

"నాకు త్రెడ్ లేదు మేడమ్!" మెల్లగా సిగ్గుపడుతూ చెప్పాడు.

"త్రెడ్ లేదా! అయితే నువ్వు హిందువులు కాదు".

"ఒట్టు మేడమ్! నేను హిందువునే". అతను మరల భయపడసాగాడు

"లేదు, నువ్వు హిందువులు కాదు. నువ్వు అబద్ధం చెప్పావు.

"మీ బాసీకు చెప్తాను".

గుమస్తా ముఖం పాలిపోయిందీ. చొక్కా 'గుండీలు పెట్టుకుని, కోటు తొడుక్కుంటూ గాభరాగా చెప్పాడు.

"మేడమ్! నేను సిన్సియర్‌గా చెప్పుతున్నాను నేను హిందువునే, నా పేరు రోషన్‌లాల్".

"రోషన్‌లాల్! మన కుక్ పేరు రోషన్‌దీన్. అతను మహమ్మదీయుడు".

"ఎస్! మేడమ్!"

గుమస్తాకు ఏమీ అర్థం కావడం లేదు "మేడమ్! అతను రోషన్‌దీన్, నేను రోషన్‌లాల్, నేను హిందువుని. అతను మహమ్మదీయుడు.

"నో! మీ పేర్లు వేరు వేరుగా ఉంటాయని రిచర్డ్ చెప్పాడు". మరలా గుమాస్తా వైపు వేలు చూపిస్తూ-

"నువ్వు మరలా అబద్ధం చెప్తున్నావు నేను మీ బాస్‌కి చెప్తాను"

గుమస్తాకు గుండె కొట్టుకుంటున్నది గొంతు ఎండిపోతోంది.

పట్నంలో అల్లర్ల కారణంగా ఈమె అవన్నీ అడుగుతున్నదా! అసలు ఈమెకు ఏం కావాలి?

లీజా విసిగిపోయింది. "నువ్వు వెళ్ళు, నేను అంతా మీ బాస్‌కు చెప్తాను"

గుమస్తా ఫైలు తీసుకొని త్వరగా అక్కడ నుండి వెళ్ళిపోసాగాడు

వెనక మరలా లీజా గొంతు "గుమస్తాగారూ!" అని విన్పించింది

గుమస్తా వెనుకకు తిరిగాడు

"కమ్ హియర్".

దగ్గరకు వెళ్ళిన తర్వాత లీజా గంభీరంగా అడిగింది

"మీ బాస్ ఎక్కడ?"

"ఆయన ఆఫీసులో ఉన్నారు మేడమ్! ఆయన చాలా బిజీగా ఉన్నారు మేడమ్"

"ఆల్‌రైట్! పొండి, నువ్వూ నీ బాస్ పో! ఇక్కడి నుండి పో"

"ఎస్ మేడమ్!" గుమస్తా వణుకుతూ వెళ్ళిపోయాడు.

గుమస్తా వెళ్ళిపోయిన తర్వాత లీజాకు తల తిప్పుతున్నట్లుగా ఉంది సరదాగా ఉన్న మూడ్ విరక్తిగా మారిపోయింది. గుమస్తా భుజం ఒక వైపుకు వంగి వెళ్ళటం చూస్తే ఆమెకు ఏదో జంతువు వెళ్ళుతున్నట్లు అన్పించింది. రిచర్డ్ రోజంతా ఇటువంటి వాళ్ళతో కలిసి ఎలా పని చేస్తాడో ఆమెకి అర్థం



కాలేదు ఆమె మనసులో దీర్ఘమైన నిట్టూర్పు అడుగులు వేసుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది

* * * *

పట్టణంలో ప్రధానమైన వ్యాపార కార్యక్రమాలన్ని పంచబడినట్లుంటాయి బట్టల దుకాణాలు ఎక్కువగా హిందువులవి, చెప్పుల దుకాణాలు మహమ్మదీయులవి లారీలు మోటారు వాహనాల పనులన్నీ మహమ్మదీయుల చేతుల్లోను, దాన్యానికి సంబంధించిన పనులన్నీ హిందువుల చేతుల్లోను ఉన్నాయి చిన్న చిన్న వ్యాపారపు పనులు హిందువులు ముస్లింలు ఇద్దరూ చేస్తుంటారు

శివా మార్కెట్ కొత్త పెళ్ళికూతురిలా కళకళలాడుతోంది ఎప్పటిలాగానే మార్కెట్ చాలా సందడిగా ఉంది అక్కడ వాతావరణం చూస్తే ఉద్రిక్తంగా ఉందని ఎవరూ అనలేరు బంగారపు కొట్లలో బురఖాలు వేసుకున్న గ్రామీణ స్త్రీలు, వెండి నగలు బేరాలు చేస్తున్నారు హకీమ్‌లాల్‌రామ్, దుకాణం ముందు ఇద్దరు కాశ్మీరీ ముస్లింలు మందులు నూరుతున్నారు మిఠాయి దుకాణం వద్ద జనం ఎప్పటిలాగానే ఉన్నారు.

వాతావరణం ప్రశాంతంగా ఉంది ఉదయం జరిగిన సంఘటన కారణంగా ఉత్పన్నమైన ఉద్రిక్త పరిస్థితి తగ్గిపోయినట్లుంది ఖుదాబక్ష్ దుకాణం ముందు రోడ్డు ప్రక్కన గోడకు వీధి దీపాన్ని మున్సిపల్ పనివాడు నిచ్చెన వేసి ఎక్కి, శుభ్రం చేసి, నూనె పోస్తున్నాడు.

పట్టణపు కార్యకలాపాలన్ని యధాప్రకారంగానే జరిగిపోతున్నాయి అత్తరు వ్యాపారి ఇబ్రహీం, భుజాలమీద, వీపు మీద అత్తరు సీసాల సంచి వేసుకుని ప్రతి వీధి తిరుగుతూ లయాత్మకంగా అరుచుకుంటూ వెళుతుంటే, పట్టణంలోని ప్రతి పని ఆ లయకు అనుగుణంగా జరిగిపోతున్నదా అనిపిస్తుంది స్త్రీలు కుండలు తీసుకొని నీటి కోసం కాలువ దగ్గరకు వెళుతుంటారు అమాదిరిగానే వీధుల్లో టాంగాలు నడుస్తుంటాయి అదే విధంగా పిల్లలు స్కూళ్ళకు వెళుతుంటారు నగరపు కార్యక్రమాలన్నీ ఒక చక్కటి సహజమైన వాతావరణంలో నడుస్తున్నట్లు అన్పిస్తూ ఉంటాయి కాలచక్రం ఈ విధంగానే తిరుగుతూ వస్తుంది. ఆ పట్టణంలోని ప్రజలు యువకులుగా, వృద్ధులుగా ఒక లయాత్మకమైన క్రమానికి అలవాటుపడినట్లు అన్పిస్తుంటుంది

అంతమాత్రాన ఆ పట్టణ జీవితం ప్రశాంతంగా ఉంటుందని చెప్పలేం అప్పుడప్పుడు ఆ నగర జీవితంలో అలలు లేస్తూనే ఉంటాయి కాంగ్రెసు ఉద్యమం నడుపుతున్నప్పుడు పెద్ద పెద్ద అలలే లేస్తుంటాయి. ప్రతి సంవత్సరం గురుపూర్ణిమ సందర్భంగా సిక్కులు ఊరేగింపు ప్రారంభించినప్పుడు పట్టణంలో ఉద్రిక్తతలు మొదలౌతాయి ఊరేగింపు జామా మసీదు ఎదురుగా బాజాలు మ్రోగించుకుంటూ వెళుతుంటే గొడవలు జరుగుతూనే ఉంటాయి మహమ్మదీయులు ముహరమ్ పండగ సందర్భంగా రొమ్ములు బాదుకుంటూ 'యా హుస్సేన్' అని అరుచుకుంటూ ఊరేగింపుగా బయల్దేరితే అప్పుడు కూడా పట్టణంలో ఉద్రిక్తత పెరుగుతుంది అయితే తర్వాత ఉద్రిక్తత దాని అంతట అదే తగ్గిపోయి మరల ప్రశాంత వాతావరణం ఏర్పడుతుంది మరలా ప్రజలు నవ్వుతూ, తుళ్ళుతూ జీవితం గడుపుతూ ఉంటారు



దర్జీ ఖుదాబక్ష్ బట్టలు దుకాణం దగ్గర సర్దార్ హకీమ్‌సింగ్ భార్య "బట్టలు కుట్టి ఇచ్చేదేమైనా ఉన్నదా! రోజూ నీ కొట్టు చుట్టూ తిరగలేక చస్తున్నాను" అంటూ దీర్ఘాలు తీయసాగింది ఖుదాబక్ష్ చిరునవ్వునవ్వాడు పట్టణంలోని సంపన్న వర్గాల స్త్రీలందరూ ఖుదాబక్ష్‌తో ఇలాగే మాట్లాడుతారు బక్ష్ కొట్టు నిండా కుట్టవలసిన పెళ్ళి బట్టలు గుట్టలు పడి ఉన్నాయి

"అమ్మా! గుడ్డలు త్వరగా పంపండి, అంటే నా మాట వినలేదు. అలస్యంగా పంపారు. ఇప్పుడు వచ్చి పీకల మీద కూర్చున్నారు నాకేమి పదహారు చేతులు లేవుగా"

"అలస్యంగా ఎప్పుడు పంపాను?"

"శివరామ్ కుమారుని వివాహమైన పదిహేను రోజులకు మీ అమ్మాయి వివాహం నిశ్చయమైంది కదా! యిప్పుడు ఏ నెల నడుస్తుందో చెప్పండి? పైగా అలస్యంగా ఇవ్వలేదంటారు"

"తమ్ముడూ! నీకు అన్నీ తెలుసు ఇంతకీ అమ్మాయి బట్టలు ఎప్పుడు ఇస్తావు చెప్పు?" హకీమ్‌సింగ్ భార్య నవ్వుతూ అడిగింది

"శుభకార్యం ఎప్పుడు?"

"భలేవాడివయ్యా! నిశ్చయ తాంబూలాల తేదీ తెలిసిన వాడికి పెళ్ళితేదీ తెలియదా?"

"ఇరవై అయిదో తారీఖు కదా! ఇవాళ తారీఖు ఎంత? అయిదవ తేది ఇస్తానులెండి"

"ఇస్తానులెండి కాదు ఎప్పుడిస్తావో చెప్పు వివాహం రోజు మళ్ళీ నీ చుట్టూ తిరగవలసి వస్తుంది విద్యా పెళ్ళప్పుడు ఒక వైపున పెళ్ళివారొచ్చి కూర్చుంటే పెళ్ళికూతురు బట్టల కోసం నీ చుట్టూ మనుషులను పంపవలసి వచ్చింది ఎప్పుడిస్తావో ఖచ్చితంగా చెప్పు"

అమె మాట్లాడుతూ ఉండగానే వెనక నుండి బక్షీ వైపుకు ఒక బట్టల ప్యాకెట్టు విసిరి

"బక్షీ! గుడ్డ కొలిచి చూసుకో! ఒకవేళ తక్కువయితే బుద్ధసింగ్ దుకాణంలో నా పేరు చెప్పి తీసుకో' అన్న మాటలు విన్పించాయి.

అక్కడ ఒక స్త్రీ ఉన్నది, బక్ష్ గుడ్డలు నీళ్ళతో తడిపి అరవేసాడు చెవిలో పెన్సిల్ తీసి గుడ్డపై ఏదో వ్రాసి బీరువాలో పడవేసాడు

"ఇచ్చేస్తానమ్మా! నేనే మీ యింటికి తీసుకొస్తాను"

"మాటలు చెప్పటం బాగా వచ్చు ఈసారి బట్టలు టైముకు అందించకపోతే మరల నీ కొట్టుకొచ్చే పనే లేదు". అంటూ హకిమ్‌సింగ భార్య అక్కడి నుండి వెళ్ళిపోయింది

ఆమె వెళ్ళిపోయిన తర్వాత ఖుదాబక్ష్ దృష్టి శివాలే గోడ మీద పడింది. ఎవరో ఆ గోడ ఎక్కి ఉన్నారు ఖుదాబక్ష్ పరిశీలించి చూసాడు. గోడ మీద ఉన్నది కాపలా కాసే గూర్ఖావాడు. వాడక్కడేం చేస్తున్నాడు? గోడ వెనుక పట్టణపు అతి ప్రాచీనమైన దేవాలయం ఉన్నది. దాని గోపురం మెరుస్తూ చాలా దూరం కన్పించసాగింది ఆ దేవాలయపు గోడపైన ఒక గంట వున్నది. గూర్ఖా ఆ గంటను శుభ్రం చేస్తున్నాడు.

"ఏమిటి? వాడు అక్కడ ఎంచేస్తున్నాడు?"

ఖుదా బక్ష్ తన దగ్గర బట్టలు కుట్టేవాడిని చూసి అన్నాడు.

"గంట శుభ్రం చేసి బాగుచేస్తున్నాడు.

"యాహ్ అల్లా!...... ఖుదాబక్ష్ నోటి నుండి అప్రయత్నంగా వెలువడింది.

"పట్టణంలో అల్లర్లు జరుగుతున్నాయని అనుమానిస్తున్నారు.

ఇద్దరూ మాట్లాడటం ఆపేసి ఎవరి పనిలో వారు మునిగిపోయారు.

1926 అల్లర్ల తరువాత ఈ గంట ఏర్పాటు చేయబడింది. అప్పటి నుండి ఎండకు ఎండి వానకు తడిసి దాని మెరుపు చాలా వరకు తగ్గిపోయింది. మొట్టమొదట అల్లర్లు జరిగినప్పుడు ఖుదా బక్ష్ వయస్సు ఇరవై , ఇరవై రెండు సంవత్సరాలుండేది. అప్పుడు అతనికి కర్ర త్రిప్పాలని, కసరత్తు చెయ్యాలని కోర్కెగా ఉండేది. ఆరోజుల్లోనే తన తండ్రి బట్టలు కుట్టే దుకాణం లోనే కూర్చుంటూ ఉండేవాడు. ఆరోజుల్లోనే ఈ గంట ఇక్కడ ఏర్పాటు చేయబడింది. ఇప్పుడు ఖుదా బక్ష్‌కు సగం వయస్సు వచ్చేసింది. పట్టణంలో అతని దగ్గరకు బట్టలురాని వివాహాలు చాలా తక్కువ జరిగి ఉంటాయి. గోడమీద గంట శుభ్రం చేస్తున్న గూర్ఖా రామ్‌బలీ కూడా పాతవాడే. ఈ గంట అతని చేతులమీదుగానే అక్కడ పెట్టబడింది. గత అల్లర్లు జరిగినప్పుడు నుండీ ఖుదాబక్ష్ మిగతావిషయాలు వదిలివేసి సేవా భావంతో తన పనిలో నిమగ్నమై ఉండిపోయాడు. వయసుమళ్ళిన కారణంగా ముఖంమీద ముడతలు పడ్డాయి. కనుబొమలు మీద వెంట్రుకలు తెల్లబడ్డాయి. కాని గూర్ఖారామ్ బలీలో మాత్రం ఏవిధమైన మార్పు రాలేదు.

గంట శబ్దం మెల్లగా విన్పించింది. ఖుదా బక్ష్ దృష్టి మరలా గోడవైపుకు మళ్ళింది. గూర్ఖా గంటకు కొత్తతాడు కడుతున్నాడు. అందుకే గంటకదిలి నెమ్మదిగా మ్రోత చేసింది.

"ఈగంట మ్రోత వింటే శరీరం కంపించి పోతుంది. గత అల్లర్ల సమయంలో ఈ గంట మ్రోగినప్పుడు మార్కెట్‌లో దుకాణాలు నిప్పంటుకొని మంటలు ఆకాశంలోకి లేచాయి". ఖుదాబక్ష్ తనలో తాను అనుకుంటున్నట్లుగా అన్నాడు.

గోడమీద గూర్ఖా ఏదో పండగవస్తుందా అన్నట్లు ఇంకా ఆగంటను శుభ్రంచేస్తూనే ఉన్నాడు. ఆగంట తోమిన ఇత్తడి సామాను మెరుస్తున్నట్లు తళతళ మెరుస్తున్నది. దానికి తోడు కొత్తతాడు కట్టారు.

ఖుదా బక్ష్ దృష్టి గంటమీద నుండి ప్రక్క బంగారపు దుకాణంలో నగలు బేరం చేస్తున్న పల్లెటూరి దంపతుల మీద పడింది. వాళ్ళు తమ కుమార్తెకు చెవిపోగులు కొనడానికి వచ్చారు.

"నీకు ఇష్టంఐతే తీసుకోవచ్చుకదా? త్వరగా తీసుకో అవతల కొనవలసినవి చాలా ఉన్నాయి. పైగా మళ్ళీ గ్రామానికి వెళ్ళాలి.

కుమార్తె కళ్ళు ఆనందంతో మెరవసాగాయి. ఆ పిల్ల మాటిమాటికి ఆపోగులు చెవులకు ఆనించి సిగ్గుపడుతూ తన తల్లికి చూపించసాగింది.

"అమ్మా! ఎట్లా ఉన్నాయి?"

ఆపిల్ల అవితనకు నచ్చుతాయో లేదో అని ఆలోచించి కొనాలో వద్దో నిర్ణయించుకో లేక పోయింది.

ఖుదా బక్ష్ దృష్టి మరలా గంటమీద పడింది. గూర్ఖా గోడమీద నుండి క్రిందకు దిగుతున్నాడు. గంటకు కట్టిన క్రొత్తతాడు వ్రేలాడుతున్నది. ఖుదా బక్ష్ నోటివెంట 'యాహ్ అల్లా..... ' అన్నమాట అప్రయత్నంగా మరొక్కసారి వెలువడింది.

ఫజల్‌దీన్ రొట్టెల దుకాణం దగ్గర చిన్నసమావేశంలాగ ఉన్నది. మధ్యాహ్న సమయంలో పని తక్కువగా ఉన్నప్పుడు అందరూ అక్కడచేరి పిచ్చాపాటి మాట్లాడుకుంటూ ఉంటారు.

ఆరోజు ఉదయం జరిగిన సంఘటనతో చర్చ మొదలైనప్పటికి మాటలు చాలాదూరం వెళ్ళాయి. ముసలి కరీంఖాన్ "పాలకుల మనస్సు, సామాన్యులకు అర్థంకాదు. వారికి చాలాదూరదృష్టి ఉంటుంది. పాలకులకు కన్పించేది సామాన్యులకు కన్పించదు". అన్నాడు.

అక్కడే ఒకప్రక్కన కూర్చున్న నత్తూ వీరి సంభాషణ వినసాగాడు. మెల్లగా వాయి చప్పరిస్తూ వీళ్ళ మాటలు వినసాగాడు. అతను ఈ పంది గొడవనుండి బయటపడినప్పటి నుండి పట్టణంలో నాలుగు మూలలా తిరగసాగాడు. ఎక్కడ

కూర్చున్నా ఇదేచర్చ ఈ మాటలన్నీ వింటుంటే అతనికి ఆందోళన పెరగసాగింది ఇక్కడ రొట్టెల దుకాణంలో ఇదేచర్చ నత్తూకు అది తానుచంపిన పందేనా? లేక ఇంకేదైనా పంది గురించి మాట్లాడుకుంటున్నారా? అన్న ఆలోచన వచ్చింది. అయితే అచర్చంతా తాను చంపిన పందిని గురించేనని అతనికి అర్థమైంది ఏ విధమైన అల్లర్లు జరగకుండా ఉంటే ఇది చాలా మామూలు సంఘటన అయివుండేది

నత్తూకు ఒకసారి తనజేబు తడిమి చూసుకొన్నాడు నోటు చేతికి తగిలింది. మొత్తానికి మురాద్అలీ డబ్బంతా ముందే ఇచ్చేశాడు. ఎనిమిది అణాలు ముందు చేతిలో పెట్టి మిగిలినది తర్వాత ఇస్తానంటే తాను ఏమిచేయగల్గి ఉండేవాడు మురాద్ అలీ చాలా ఖచ్చితమైన మనిషి. మరితాను కూడా ఖచ్చితంగానే ఉండాలికదా! తాను మురాద్అలీ వచ్చేవరకు ఉండవలసింది పోయి, పారిపోయి వచ్చాడు మురాద్ అలీతో అక్కడే ఎదురుచూస్తూ, ఉంటానని ఒట్టుపెట్టి చెప్పాడు. కాని, అగుడిసెలో అతనికి ఊపిరాడలేదు

కాని పట్టణంలోకి వచ్చేసరికి ఎక్కడ చూసినా పందిని గురించిన చర్చే జరుగుతుంది

నత్తూకు లోలోపల చాలా ఆందోళనగా ఉంది. అతనికి రకరకాల ఆలోచనలు కలుగుతున్నాయి గాభరా పెరుగుతున్న కొద్దీ ఆలోచనలు అధికమవుతున్నాయి అతను ఘోరంగా మోసగించబడ్డాడు. పశువుల డాక్టరు పేరు చెప్పి మురాద్అలీ అతనితో పందిని చంపించి మసీదు ముందు పడవేయించాడు కాని, అది ఇంకొక పందేమో అన్న ఆలోచన కూడా అతనికి కల్గింది అతను మసీదు దగ్గర పందిని చూసాడు ఒకవేళ అది ఆ పందే అయితే ఏమవుతుంది? తానే పందిని చంపానని ప్రజలకు తెలిస్తే ఏం జరుగుతుంది? అతని మనస్సంతా ఆందోళనతో, గందరగోళంతో నిండిపోయింది ఇంటికి పరుగెత్తుకెళ్ళి లోపల గెడవేసుకు పడుకుందామా! అని ఆలోచన కొంచెంసేపు.

సందుల వెంట తిరుగుతూ ఉందామా అన్న ఆలోచన మరికొంత సేపు కలిగాయి. "నేను ఇంటికి వెళ్ళను. చీకటి పడిన తర్వాత మోతియా దగ్గరకు వెళతాను అమె రూపాయి అడిగితే అయిదు రూపాయిలిస్తాను రాత్రి అంతా అమె దగ్గరే ఉంటాను' అని అనుకున్నాడు.

కాని పగలంతా వీధులవెంట తిరిగే సరికి అతని భార్య గుర్తుకు రాసాగింది. ఇంటి దగ్గరుంటే ఈ పాటికి తోటి మాదిగలతో కలిసి చిలుంతాగుతూ కబుర్లు చెప్పుకుంటూ ఉండేవాడు. అతను తల విదిలించాడు నేను ఇంటికి వెళ్ళిపోతాను స్నానం చేస్తాను. చొక్కా మార్చుకుంటాను. ఇంటావిడ దగ్గర కూర్చుని కబుర్లు చెప్తాను. వెళ్ళగానే కౌగిట్లో బంధిస్తాను మురాద్ అలీ పేరు కూడా ఎత్తను. ఈ సంగతి అంతా అమెకు చెప్పవలసిన పనిలేదు. అమె గుండెమీద తల పెట్టి విశ్రాంతి తీసుకుంటాను. అక్కడే శాంతి లభిస్తుంది మోతియా ముందదగ్గరకు వెళ్తే కటువుగా మాట్లాడుతుంది. తిడుతుంది ఇంటావిడయితే మంచిగా ఉంటుంది. సుఖాన్నిస్తుంది. ధైర్యం చెప్తుంది. రెండురూపాయలు ముందకిచ్చే బదులు ఇంటిదానికి ఏమైనా తీసుకెళ్తాను సంతోషిస్తుంది నాకు అన్నీ ఉన్నాయి కదా! ఇవన్నీ ఎందుకు తెచ్చావు అంటుంది అది ఎప్పుడూ ఏమీ అడగదు. అమెను గురించి తలచుకుంటూనే అమె కౌగిలిలో ఉన్నట్లు అనిపించి నత్తూకు ఆందోళన తగ్గిపోయి నట్లనిపించింది. మగవాడు దుఃఖాన్నుంచి విముక్తి పొందడానికి మొట్టమొదట స్త్రీ వైపుకే మరలుతాడని, స్త్రీ కౌగిట్లోనే దుఃఖం యావత్తూ మాయమవుతుందని అతని నమ్మకం అమె చాలా మంచిది. అమె గుండెల నిండా ప్రేమేనిండిఉంది.

కాఫీకొట్లో నుండి పొగవస్తున్నది ఆ కాఫీ కొట్టుబయట ఉన్న రెండు బెంచీల మీద కూలీలు కూర్చుని రేకు పళ్ళాలతో అన్నం తింటున్నారు.

"ఏమిట్రా అది?" ఒకడు అడిగాడు.



## రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్రవారపత్రికకి పరిశీలనార్థం తమ రచనలని పంపే వారు ఈ కింది సూచనలని గమనించ కోరుతున్నాము

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరఠావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది వ్యాసాలు 3 అరఠావు పేజీలు మించరాదు వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫోటోలు జతపరిచి పంపటం అవసరం

రచనలు స్వంత రచనలై ఉండాలి అనువాదాలు, అనుసరణలు, కాపీ రచనలు పంపరాదు ఆ మేరకి రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి వ్రాత ప్రతి మీద రచయిత(త్రి) పూర్తి చిరునామా స్పష్టంగా పిన్‌కోడ్‌తో సహా రాయాలి.

కథల పరిశీలనకి 1–2 నెలలు, నవలల పరిశీలనకి కనీసం 6 నెలలు పట్టవచ్చును పరిశీలన అయిన తర్వాత ఏ విషయం ఆయా రచయిత(త్రు)లకి తెలియచేయటం జరుగుతుంది ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరేవారు తమ రచనతో పాటే స్వంత చిరునామా కల, తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన కవరు జత పరచి పంపాలి లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కానీ పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం

ఉత్తరాలు, తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు, పూర్తి చిరునామా ఇవ్వాలి రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు.

పరిశీలనకి పంపే రచనలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003" అనే చిరునామాకి పంపాలి కవరు పైభాగంలో శీర్షిక పేరు రాయటం మంచిది

– సంపాదకుడు

"ఏదో దండోరా! ఇటేవస్తున్నది." ఇంకొకడు సమాధానం చెప్పాడు.

ఇంతలో ఒకటాంగా కాంగ్రెస్ జెండా కట్టుకుని అక్కడకు వచ్చింది. అందులో ఒకమనిషి డప్పు వాయిస్తున్నాడు. అబండి తిన్నగా రొట్టెల దుకాణం ముందు వచ్చి ఆగింది. ముందు సీటు మీద కూర్చున్న మనిషి లేచి నిలబడ్డాడు. అప్పుడు డప్పు మోత ఆగిపోయింది. ఆ మనిషి ప్రకటన చేయసాగాడు.

"అయ్యలారా!

ఈరోజు సాయంత్రం ఆరుగంటలకు గంజ్‌మండీ దగ్గర జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్వర్యంలో ఒక పెద్ద బహిరంగ సభ జరుగనున్నది. స్వాతంత్ర్య పోరాటాన్ని భగ్నం చేయడానికి బ్రిటీష్ ప్రభుత్వం కుయుక్తులు తెలియజేయ బడతాయి. ప్రజలందరు పెద్ద సంఖ్యలో విచ్చేయ వలసిందిగా ప్రార్ధన".

టాంగా వెనక సీటుమీద జనరల్ డప్పు పట్టుకు కూర్చున్నాడు. ప్రకటన చేసిన వ్యక్తి శంకర్. ప్రకటన పూర్తయిన తర్వాత అతను తన సీటుపై కూర్చున్నాడు. తిరిగి డప్పు మోగసాగింది. జెండా ఎగురుతూ ఉండగా టాంగా అక్కడ నుండి కదిలింది.

టాంగా దూరంగా వెళ్ళిపోయిన తర్వాత అక్కడ ఉన్న ఒక కూలీ "గంజీమండేలో ఇంతకు ముందొకసారి జరిగిన సభలో ఒక బాబు స్వాతంత్ర్యం వస్తుంది అని అన్నాడు. నేను అడిగాను స్వాతంత్ర్యం వస్తే మాకేమిటి? మేము ఎప్పుడునుంచో బరువులు మోస్తున్నాం. స్వాతంత్ర్యం వచ్చినా బరువులు మోయవలిసిందే" అని అన్నాడు.

అప్పుడే కాఫీకొట్టులో కూర్చున్న మధ్యవయస్సు గల ఒక గెడ్డపు మనిషి మసీదు దగ్గర అకృత్యం చేసిన మనిషి దొరికాడా? వాడికి కాళ్ళు చేతులు పడిపోతాయి" అని అన్నాడు.

"అవును. చాలా దుర్మార్గమైన పని జరిగింది". ఇంకొకడు మాట కలిపాడు.

అక్కడే ఉండి ఈ మాటలు విన్న నత్తూకు శరీరం కంపించిపోయింది.

"ఏదో ఒక ఆవుకూడా చంపబడిందట కదా! ఎవరో చంపి మురుగు కాలువ దగ్గర పడవేశారని చెప్పుకుంటున్నారు" ఎవరో ఒకరు అన్నారు.

"అవును అదికూడా పాడుపనే" ఇంకొకడు అన్నాడు.

చిన్న చిన్న కళ్ళతో, నవ్వుతూ ఉన్న పెద్దమనిషి కరీంఖాన్ ఈ మాటలు విని, మెల్లగా చెప్పసాగాడు. "మనుషుల కార్యకలాపాలన్ని తన ఆజ్ఞప్రకారమే జరుగుతుంటాయని, తన ఆజ్ఞతోనే పొలాలలోని పంట నిలబడి ఉంటుందని, తన ఆజ్ఞ లేకుంటే పంట నాశనమైపోతుందని, తన ఆజ్ఞపైనే వరదలు వస్తుంటాయని, నగరాలకు నగరాలు కొట్టుకు పోతుంటాయని, ఖురానులో భగవంతుడు చేత చెప్పబడింది. అంతా ఆభగవంతుని చేతిలోనే ఉంది. మనుషులచేతిలో ఏమీ లేదు. పనులన్నీ భగవంతుని ఆజ్ఞమేరకే జరుగుతాయి. అతని ఆజ్ఞ ఏదైతే అదే జరుగుతుంది".

చుట్టూ ఉన్నవాళ్ళు తలలూపారు. హుక్కావరుస నడుస్తూనే ఉంది.

అప్పుడే రోడ్డు మీద హడావుడి మొదలయింది. నడుస్తున్న వాళ్ళు ఆగిపోయి కుడి వైపుకు తిరిగి జమామసీదు వైపు చూడసాగారు.

"పీర్‌సాహెబ్‌గారు వచ్చారు. గోలాడా శరీఫ్ పీరుసాహెబ్‌గారు వచ్చారు".

రోడ్డు మీద నిలబడ్డ వాళ్ళలో ఒకరు రొట్టెల దుకాణపు యజమాని ఫజల్‌దీన్‌తో అని, గుండెమీథ చెయ్యివేసుకుని పీర్‌సాహెబ్‌కోసం ఎదురు చూడసాగారు.

ఫజల్‌దీన్ కూడా లేచి నిలబడ్డాడు. కాఫీ కొట్టులేని వాళ్ళంతా బయటకు వచ్చి పీర్‌సాహెబ్ రాకకోసం ఆత్రంగా చూడసాగారు.

గడ్డం ఉన్న పొడుగాటి వ్యక్తి, ముందు నడుస్తున్నాడు. నల్లని పొడవైన సొక్కా, మెడలో నాలుగు పెద్ద పెద్ద హారాలు, తలగుడ్డ వెనుక మెడమీద పడే ఎద్ద జుట్టు. చేతిలో జపమాల వేడల్పాటి తెల్లటి ముఖం ప్రకాశవంతంగా ఉంది. ఆయనకు రెండుప్రక్కల, వెనక అనుచరులు వస్తున్నారు.

ఫజల్‌దీన్ ముందుకు వచ్చి తలవంచి ఛాతీమీద చేయివేసుకుని రోడ్డు మధ్యగా నిల్చున్నాడు. పీరుసాహెబ్ ఎడంచేయి ముందు చాపాడు. ఫజలదీన్ వంగి చేతిని అందుకుని కళ్ళకు అద్దుకున్నాడు. మరల తన ఎడంచేతిని ఛాతీమీద ఆనించి ముందుకువంగి నిలబడి ఉన్నాడు పీరుసాహెబ్ తన చేయి కొంచెం పైకి లేపి ఏం మాట్లాడకుండా ముందుకు సాగిపోయాడు. రోడ్డు ప్రక్కన వారందరూ ఒక్కొక్కరూ పీర్‌సాహెబ్ చేతిని కళ్ళకద్దుకున్నారు. పీరుసాహెబ్ అందరినీ ఆశీర్వదించారు.

"ఈ పీర్‌సాహెబ్ చాలా గొప్పవాడు. ఆ ముఖంలో వెలుగు చూడండి. ఫజల్‌దీన్ అన్నాడు.

కొందరు అక్కడ నుండి తిన్నగా ఇంటికి వెళ్ళిపోగా కొందరు కాఫీ కొట్లోకి వెళ్ళారు. కాఫీ కొట్లో పీర్‌సాహెబ్ గురించి చర్చసాగుతుంది.

"ఈయన గొప్ప మహిమగలవాడు. మనసులో మాట ఇట్టే తెలుసుకోగలడు. నేను ఒకసారి పూజచేయడానికి గోల్డాశరీఫ్‌లో ఉన్న పీర్‌సాహెబ్ దగ్గరకు వెళ్ళాను. ఆయన నన్ను చూసి ఎదురుగా వున్న గోధుమగింజల గుట్టలో నుండి కొన్ని గింజలు తీసుకు రమ్మన్నారు. నేను ఒక గుప్పెడు గింజలు తీసుకున్నాను. పీర్‌సాహెబ్, నీ గుప్పెట్లో నూటడెభ్భై గింజలు ఉన్నాయన్నారు. నేను అక్కడే కూర్చుని హడావిడిగా నా గుప్పెట్లో గింజలు లెక్కపెట్టాను. అవి ఖచ్చితంగా




నూటడెభ్భైగింజలే ఉన్నాయి" ఫజల్‌దీన్ అక్కడి వాళ్ళతో చెప్పసాగాడు.

కరీంఖాన్ కల్పించుకొని "ఈయన చేతుల్లో గొప్ప మహత్తుంది. మా మనుమడు చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడు ఒకసారి గవదల వ్యాధి వచ్చింది. రెండు గవదలు వాచిపోయాయి. గోలడా శరీఫ్ దగ్గరకు తీసుకు వెళ్ళమని ఎవరో చెప్పారు. తీసుకు వెళ్ళాను. పీర్‌సాహెబ్ పిల్లవాడిని ఆయన ముందు పడుకో బెట్టమన్నాడు. ఆయన ప్రక్కనే ఉన్న పెద్ద కత్తితో పిల్లవాడి చెంపల్ని తాకించాడు. తన చేతిని పెదవులకు ఆనించుకున్న తర్వాత పిల్లవాడి చెంపలకు ఆనించాడు. అంతే నేను పీర్‌సాహెబ్‌కు నమస్కరించి పిల్లవాడిని తీసుకుని వచ్చేశాను. ఇంటికి వచ్చేసరికి పిల్లవాడి చెంపవాపు తగ్గటమే కాక జ్వరం కూడా తగ్గిపోయింది" అన్నాడు.

పీర్‌లకు, దస్తగీర్‌లకు చాలా మహిమలుంటాయి".

అయితే ఈ పీర్‌సాహెబ్ నాస్తికులను ముట్టుకోరు. వారిని అసహ్యించు కుంటాడు. మొట్టమొదట పీరుసాహెబ్ దగ్గరకు అందరూ వెళ్ళేవారు. ఎవరైనా నాస్తికులు చికిత్స కోసం వస్తే తన బెత్తాన్ని అతనినాడి మీద పెట్టి రెండవ వైపున తన చెవిదగ్గర పెట్టుకుని శబ్దం విని వైద్యం చేసేవారు. ఇప్పుడు నాస్తికులను ఎవరిని దగ్గరకు రానివ్వటంలేదు.

"వేసవికాలంలో సామాన్యంగా పట్టణానికి రాడు. ఈసారే ఎందుకో

వచ్చాడు.

"పీర్‌లకు ఎండా, చలి, వాన ఏముంటాయి?"

"బహుశా మసీదు సంఘటన ఆయన వరకు వెళ్ళిందేమో?"

"ఆయనకు అన్ని వార్తలు తెలిసిపోతాయి. ఆయనకు ఎవరూ చెప్పవలసిన పనిలేదు. ఆయన తన మహిమతో తెలుసుకొని ఉంటాడు. అందుకే వచ్చేసారు."

"ఆయన దయ చాలా అవసరం. పీర్‌లు, ఫకీర్‌ల శాపంతో పట్టణాలకు పట్టణాలే నాశనమైపోతాయి".

"వచ్చినవారు శుక్రవారం వరకూ ఉంటారు. ధర్మబోధచేసి పట్టణాన్ని పవిత్రం చేసి వెళతారు."

నత్తూ అక్కడినుండి బయలుదేరేసరికి మధ్యాహ్నం దాటిపోయింది. అతను మనసు కొంచెం తేలికపడింది. ఉదయంనుండి అతని మనస్సును పీడిస్తున్న అజ్ఞాత భయం కొంచెం తగ్గినట్లయింది. పట్టణమంతా మామూలుగానే ఉంది. ప్రజలు అక్కడక్కడ పంది సంఘటన గురించి చెప్పుకుంటున్నారు. అయితే అది కొంచెం సేపు మాత్రమే. ఎవడో పిచ్చి వెధవ చేసి ఉంటాడని అనుకుంటూ ఎవరిపనిలో వారు మునిగిపోతున్నారు. ఈ విషయాన్ని పట్టుకొని ఉదయం నుండీ బాధపడుతున్నాడు. అందులో తన పాత్ర ఉందని ఏ ఒక్కరికీ తెలిసినట్లు లేదు. అందురూ ఎవడో పిచ్చివాడో, జులాయో ఆకతాయితనంగా చేసి ఉంటాడని అనుకోసాగారు. మురాద్ ఆలీ ఒక్కడికే ఈ విషయం తెలుసు కాని మహమ్మదీయుడై ఉండి ఈ వెధవ పని చేసానని ఎలా చెప్పుకుంటాడు?

నత్తూకు మనసుతేలిక పడటంతో చుట్టుప్రక్కల ఉన్న వాతావరణమంతా చాలా బాగున్నట్లనిపించింది. ప్రక్కన ఉన్న బట్టల దుకాణంముందు ఒక పల్లెటూరి మనిషి తన భార్యను చెప్పులు తీసుకోమని నచ్చచెప్పుతున్నాడు.

"నేను చెపుతున్నానుగా, తీసుకో, నీ చెప్పులు తెగిపోయాయి. మంచి చెప్పులు తీసుకో!"

ప్రక్కనే బురఖాలో ఉన్న అతని భార్య తీయని గొంతుతో భర్తను వారిస్తున్నది.

"నాకు అవసరంలేదు. నా పని ఎలాగో గడిచిపోతుంది. నీకు మంచి చెప్పులు లేవు. నువ్వు ఎక్కువగా నడుస్తుంటావు."

నత్తూ ముందుకు సాగాడు. అతనికి ఎంతో హాయిగా ఉంది. రోడ్డుదాటి ఎడం వైపుకు తిరిగాడు. అక్కడ రొట్టెలదుకాణాలు వరుసగా ఉన్నాయి. పెద్ద పెద్ద పాత్రలు ఆపాత్రలలో నుండి, మాంసాహారం, మసాలాల సువాసన, రొట్టెలు గుట్టలుగా ఉన్నాయి, దుకాణాలు చాలా రద్దీగా ఉన్నాయి. కూలీలు, బరువులు మోసేవారు, చుట్టుప్రక్కల గ్రామాలనుండి వచ్చిన కుటుంబాల వాళ్ళు రొట్టెలు తింటున్నారు. ఈ బజారు పట్టణానికి ఒక ప్రక్కగా ఉంది. తినడం తాగడం పూర్తి అయిన తరువాత రైతులు ఎద్దుల బండ్లు తోలుకుంటూ గ్రామాలకు సాగిపోతున్నారు.

రొట్టెల దుకాణాల వెనుకగా, జామామసీదు ఎత్తుగా కన్పిస్తున్నది. మధ్యాహ్నపు ఎండలో మసీదు భవనం ఇంకా తెల్లగా కన్పిస్తున్నది. నత్తూకు అది రోజూ కన్పించే దృశ్యమే. మసీదు మెట్ల మీద బిక్షగాళ్ళు విశ్రాంతి తీసుకునే కూలీలు, వచ్చే పోయే జనాల గుంపులతో నిండుగా ఉంది.

ప్రధాన ద్వారం గుండా ఒక్కసారిగా వందలమంది బయటకు రావడం మెట్ల మొదట్లో చెప్పులు తొడుక్కొని క్రిందకు దిగడం నత్తూ చూసాడు. సాధారణంగా ఈద్ పండగరోజు ఇంతమంది జనం ఉంటారు. ఇవాళ ఏమైనా ధర్మబోధ ఉన్నదేమో గోలడా శరీఫ్ పీరసాహెబ్ వచ్చిన సంగతి అతనికి గుర్తువచ్చింది. బహుశా ఆయన ధర్మబోధచేయడానికి వచ్చేరేమో! ధర్మబోధ చేసిన తర్వాత ఆయన తిరిగి వెళ్ళడం లేదా అన్న ఆలోచన నత్తూ మనసును కలవరపరచింది. మసీదులో సమావేశమైన వారంతా తాను చేసిన పనిని గురించి చర్చించుకోడానికే వచ్చేరా! అన్న అనుమానం కలిగింది. గోలడా పీర్‌సాహెబ్‌గారు కూడా ఈ వార్త తెలిసే నగరంలోకి వచ్చారా? అని, అతనికి అనిపించింది.

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం

## డి క్యూయర్‌కు నెహ్రూ అవార్డ్

అంతర్జాతీయ స్థాయిలో సుహృద్భావ అవగాహనను సాధించడానికి కృషి చేసే విశిష్ట వ్యక్తులకు భారత దేశం అందజేసే ప్రతిష్టాత్మక బహుమతి జవహర్‌లాల్ నెహ్రూ అవార్డ్‌ను 1987 సంవత్సరానికి గాను ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి జేవియర్ పెరెజ్ డి. క్యూయర్ పొందారు. ఇరాన్, ఇరాక్‌ల మధ్య శాంతి ఒప్పందం కుదర్చడంలో, ఆఫ్ఘనిస్తాన్ సమస్యపై జెనీవా



ఒడంబడికలు రూపొందడానికి చేసిన ప్రయత్నాలలో ఆయన కృషికి గుర్తింపుగా ఈ బహుమతి లభించింది. బహుమతి గురించి తెలుసుకున్న క్యూయర్ "ఇది అత్యున్నత గౌరవం" అని వ్యాఖ్యానించారు.

## దూరదర్శన్ సెన్సార్ చెల్లదు!

...గా అభిప్రాయం అడిగి, కొన్ని ...ల్ని కత్తిరించి ప్రసారం చేసే అధికారం ...దర్శన్‌కు ఉందా? అలా కత్తిరించడం వ్యక్తిగత భావ ప్రకటనా స్వేచ్ఛను ఉల్లంఘించడమే కాదా?" అని ప్రశ్నించి మహారాష్ట్ర హైకోర్టులో నెగ్గారు శ్రీమతి ఇందిరా జైసింగ్. ఆమె బొంబాయిలో న్యాయవాది. 1986 మార్చిలో బొంబాయి దూరదర్శన్ వారు ఆమెను ఇంటర్వ్యూ చేశారు. మహిళల గురించిన చట్టాల పట్ల ఆమె దృక్పథాన్ని 'సచ్‌కీ పర్‌చాయియాఁ' కార్యక్రమంలో ప్రసారం చేస్తామన్నారు. ఆరు నిమిషాల ఉపన్యాసంలో ఆమె అన్ని చట్టాల గురించి మాట్లాడుతూ, అప్పుడు పార్లమెంటు పరిశీలనలో ఉన్న ముస్లిం మహిళల బిల్లును తీవ్రంగా ఖండించారు. కాని కార్యక్రమ ప్రసారంలో ఈ ఖండన అభిప్రాయాలన్నీ కత్తిరింపుకు గురయ్యాయి. శ్రీమతి ఇందిరా జైసింగ్ దూరదర్శన్ వారు తన



అభిప్రాయాలను తొక్కి పెట్టడానికి ప్రయత్నించారని హైకోర్టులో ఫిర్యాదు చేయగా, హైకోర్టు దూరదర్శన్‌ను మందలించింది. శ్రీమతి ఇందిరా జైసింగ్ అభిప్రాయాలను తొలగించగూడని విధంగా తొలగించారని న్యాయమూర్తి ప్రకటించారు...

## వికలాంగుని సాహసం!

అద్భుత విజయాలు సాధించడానికి అంగ వైకల్యం అడ్డం వస్తుందా? రాదని నిరూపిస్తున్నాడు తారానాథ్ షెనాయ్. 28 సంవత్సరాల ఈ యువకుడు బధిరుడు, మూగవాడు, ఒక కన్ను పూర్తిగా గుడ్డి, మరో కంటికి 30 శాతం దృష్టి మాత్రమే ఆనుతుంది. ఐనా షెనాయ్ తన ఆకాంక్షల్ని వదులుకోలేదు. మహా సముద్రాలను లొంగదీసి అలల నురుగుల మీద ఎగసి పడుతూ తన కీర్తిపతాకాన్ని ఎగర వేయాలనుకున్నాడు. గతంలోనే ఇంగ్లీషు ఛానెల్‌ను ఈ చివరి నుంచి ఆ చివరికి ఈది చరిత్ర సృష్టించిన షెనాయ్ ఇప్పుడు ఐదు సముద్రాలను జయించడానికి పూనుకున్నాడు. జిబ్రాల్టర్ జలసంధి లోనూ, దార్దనెల్లెస్ జలసంధిలోనూ షార్కులు ఎక్కువగా ఉంటాయని, అక్కడ ఈదడం ప్రమాదకరమని టర్కీ ప్రభుత్వం షెనాయ్ రక్షణకు ఏర్పాట్లు చేయబోగా "నాకేమీ జరగదు, సముద్రం నా నేస్తం" అన్నాడు షెనాయ్...



## వివాదాస్పదంగా మారుతున్న మోడీ హత్య!

ప్రఖ్యాత బ్యాడ్మింటన్ క్రీడా కారుడు సయ్యద్ మోడీ హత్య రోజు రోజుకూ వివాదాస్పదంగా మారుతున్నది. ఈ హత్యను రాజకీయ ఆయుధంగా



వాడుకోవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని అటు కాంగ్రెస్ (ఐ), ఇటు జనమోర్చా పరస్పర ఆరోపణలు చేసుకుంటున్నాయి. స్థానిక పోలీసు విచారణ ముగియకుండానే కేసును కేంద్ర నేర పరిశోధక శాఖకు అప్పగించడం, కేంద్ర నేర పరిశోధక శాఖ అనుమానితుల జాబితాలోకి సయ్యద్ మోడీ భార్య అమితా మోడీని, మోడీ కుటుంబ మిత్రుడు, ఉత్తర ప్రదేశ్ జనమోర్చా నాయకుడు డాక్టర్ సంజయ్‌సింగ్‌ను చేర్చడం అనుమానాలకు తావిస్తున్నాయి. అమితకు, సంజయ్‌సింగ్‌కు సంబంధాలున్నాయని, అందుకే సింగ్ మోడీని హత్య చేయించాడని ఆరోపణలు వినిపిస్తున్నాయి

తమ కుటుంబమిత్రురాలి మీద, తన భర్త మీద ఇటువంటి దుర్మార్గమైన ఆరోపణలతో కాంగ్రెస్ (ఐ) రాజకీయ కక్ష తీర్చుకుంటున్నదని సంజయ్‌సింగ్ భార్య ప్రకటించింది. □

# 'అమ్మా!..నమ్మ

ముసునూరి



''ఒరే గోపాలం

ఆఁ వస్తున్నానమ్మా!"

వస్తున్నానంటాడే గానీ వచ్చి ఏడవడే వీడు చిన్నప్పటి నుండి ఒకటే తీరువా?"

ఆ వచ్చానుగదా! ఏమిటి?"

ఏమని చెప్పమంటావయ్యా! నీ కూతురు సుజాత పాంట్ వేసుకొని కాలేజీకి వెడుతుందట అసలేమైనా దానికి బుద్ధి ఉందంటావా?"

సుజాత వచ్చింది

వేసుకుంటే తప్పేముంది అందరూ వేసుకోవడం లేదా? అలాగే నేను ఫాంట్ వేసుకోవడం ఈ రోజుల్లో ఫాషన్ నాయనమ్మా!" అంది

"ఆఁ! మండిపోతున్నాయి వెధవ ఫేషన్లు.'

గోపాలం కలగచేసుకొంటూ, "చూడమ్మ సుజాతా నాయనమ్మ మాట విని చక్కగా పరికిణీ వోణి కట్టుకొని వెళ్ళు" అన్నాడు

సుజాత బుంగమూతి పెట్టింది వచ్చినప్పటి నుండి నాయనమ్మ పెడుతున్న ఆంక్షలు సుజాతకి సుతరామూ నచ్చుదం లేదు వీధిలో నిలబడితే తప్పు, గట్టిగా నవ్వితే తప్పు, గట్టిగా మాట్లాడితే తప్పు, క్లాస్‌మేట్ అయిన కుర్రాడు వచ్చి మాట్లాడితే ఆ రోజు ఇంట్లో పెద్ద గొడవే!

అందుకే ఆవిడ వస్తున్న రోజునే ఇంట్లో అందర్నీ పిలిచి, 'ముసలావిడ ఉండేది నెల రోజులు అన్నీ ఆవిడ యిష్ట ప్రకారమే కానివ్వండి. ఆవిణ్ణి నొప్పించి నన్ను బాధ పెట్టకండి" అని హెచ్చరించాడు

నువ్వు కూడా ఏమిటి నాన్నా?" అన్నాడు కొడుకు గోపి వాడు ఏడో తరగతి చదువుతున్నాడు

ప్రతి చిన్న విషయానికి నాయనమ్మతో పోట్లాడ కూడదు ఆమె పెద్దావిడ ఏదో చాధస్తం" నచ్చ చెప్పాడు పిల్లలకి

'ఏమిటి నాన్న చెప్పినట్టుగా వెళ్ళి కట్టుకో!" కసిరింది సుందరమ్మ

ఇష్టం లేకపోయినా సుజాత తండ్రి చెప్పినట్టే చేసింది

'ఏరా గోపాలం సంధ్య వార్చావా!" అడిగింది సుందరమ్మ

"ఇంకా లేదమ్మా!"

హు నువ్వు కూడా నాశనమై పోతున్నావ్ అయినా నిన్నని లాభమేమిటి? రోజులలా తగలబడ్డాయి త్వరగా వెళ్ళి స్నానం చేసిరా కోడలు పిల్లా! నా పూజకి అన్నీ సిద్ధం చేసి పెట్టు

గోపాలం స్నానానికి వెళ్ళాడు పద్మ అత్తగారు పూజా సామాగ్రి అందివ్వడంలో నిమగ్నమై ఉంది సుందరమ్మ కళ్ళు మూసి పూజా కార్యక్రమాలు మొదలు పెట్టింది ఆమె ముఖం సీరియస్‌గా ఉంది ఏకాగ్రత కుదరడం లేదు ఈ ఊరు వచ్చాకా ఇరుగు పొరుగు 'పిల్లల గోల, పెద్ద వాళ్ళ కబుర్లు, అరుపులు వాహనాల రొద చికాకుగా ఉంది పవిత్రత, ప్రశాంతత లోపించిన ఆ యింటి వాతావరణం ఆమెకు దైవసన్నిధి కూడా నిప్పుల కుంపటిలా ఉంటోంది

ఒరే వెధవా! ఆ రేడియో కాస్త తగ్గించు" మనవణ్ణి కసిరింది అప్పుడే స్నానం చేసి వచ్చిన గోపాలం పూర్తిగా రేడియో కట్టేశాడు వచ్చి తల్లి సరసన కూర్చున్నాడు సంధ్య వార్చాడు ఇంతలో తల్లి పూజ కూడా పూర్తయింది ఆమె కాళ్ళకు నమస్కరించాడు ఆమె యిచ్చిన తీర్థం లోపలికి గ్రహించాడు తనే దగ్గర ఉండి తల్లికి మడిగా భోజనం పెట్టించాడు'

గోపాలం రెండ్రోజుల్లో నన్ను మనూరికి పంపెయ్యరాదూ! అవతల కోతల సమయం ఆ రైతు ఏం చేస్తున్నాడో ఏమో? నా కొంపలో నాకు సుఖంగానీ.

వెడుదువుగానిలే! అన్నాడు గోపాలం

పిల్లలు హడావిడి చేస్తున్నారు

భర్తని ఆఫీసుకు . పిల్లల్ని స్కూలుకు పంపాలి అందరికీ అన్నీ అందిస్తూ క్షణం తీరికలేక అష్టావధానం చేస్తోంది పద్మ

"వెధవా... నన్ను ముట్టుకుంటావురా!" మనవడి మీద అరుస్తోంది సుందరమ్మ.

"అమ్మా! టైమవుతోంది అన్నం పెట్టవే!" సుజాత కంగారు పెడుతోంది

"పద్మా. ఆ కుంక టిఫిన్ బాక్స్ ఆ బల్ల మీద పెడతాడేమో చూడు" హడావిడి చేస్తోంది సుందరమ్మ

అందరికీ అన్నీ చేస్తోంది

పిల్లలు స్కూళ్ళకి వెళ్ళిపోయారు.

గోపాలం తల్లి దగ్గర సెలవు తీసుకొని ఆఫీసుకు వెళ్ళిపోయాడు. గోపాలాన్ని చూస్తే ఎంతో ముచ్చట వేస్తుందామెకు. ఒక్కగానొక్క కొడుకు అందులో





పెద్ద ఆఫీసరు భయము, భక్తీ, మడి అన్నీ పాటించే గోపాలం తన కొడుకని చెప్పుకోవ డానికి అమె ...ప్సు...ంది కొడుకు వెళ్ళిన వైపే చూస్తు కూర్చుందామె

ఇంట్లో హడావిడి తగ్గింది

★ ★ ★ ★ ★

సాయంత్రం అయిదు గంటలైంది

అందరూ ఇంటికి చేరారుగానీ కొడుకు ఇంటికి రానందుకు పద్మ కంగారు పడుతోంది ఇంతలో ఒక స్నేహితుణ్ని వెంటబెట్టుకొని వచ్చాడు గోపి

ఏరా యింత ఆలశ్యం? అడిగింది పద్మ

"ముందు వాడి చేతిలోని బాక్స్ తీసి లోపల పెట్టు లేకపోతే యిక్కడే నా నెత్తి మీద పెట్టగలడు" సుందరమ్మ కంగారు

పద్మ వెంటనే కొడుకు చేతిలోంచి బాక్స్ అందుకొని, "ఏరా బరువుగా ఉంది, ఈ రోజూ తినలేదా!" అని అడిగింది

'గోపి మిత్రుని వంక ఒకసారి చూసి, ఎందుకు తినలేదు మరచి పోయాను వీడు నా ఫ్రెండ్ శామ్యూల్ వీడు తెచ్చిన భోజనం తిన్నాను" అన్నాడు

ఆ మాటలకి అందరూ భయంగా సుందరమ్మ వైపు చూశారు ఆమె ముఖంలో రంగులు మారుతున్నాయి

'శామ్యూల్ '

ఏ జాతి పేరో ఏ మతం పేరో ఏ కులం పేరో ఆ మునలామె హృదయంలో నిర్ణయం జరుగుతోంది

...ా చెప్పుకు పోతున్నాడు

...స్కూల్లో గాంధీగారి పాఠం ...స్థాపించాలని గాంధీగారు ... మతాల తేడాలు ...మనం కూడదని పోరాడేరుట గదా? అందుకే తిన్నాను అందరూ నన్ను బాల గాంధీ అని పిలిచారు నాన్నా!"

నిర్ణయం జరిగి పోయింది రక్తం మరిగి పోతోంది పట్టని ఆవేశం ఆమెను ఆవహించింది తారాజువ్వలా లేచింది

"నోర్ముయ్యిరా వెధవా! ఎంత పని చేసావురా అప్రాచ్యుడా!" అంది

పద్మ లేచి కొడుకును ముట్టుకో బోయింది

'వాడిని ముట్టుకోకే ఒక బిందెడు నీళ్ళు తెచ్చి వాడి మీద పోసి లోపలికి తీసుకొని వెళ్ళు'

"ఏం ఎందుకు పోయాలి నేనేమి తప్పు పని చేయలేదు నేను లోపలికి యిలాగే వెడతాను పెంకిగా

'ఎలా వెడతావ్‌రా శుంఠ చేసిన వెధవపనికి ఏమిటే అలా బొమ్మలా నిలబడ్డావ్ వెళ్ళు వత్రా, లేకపోతే వంట గదిలోకి వెళ్ళిపోతాడు '

పరిస్థితి విషమిస్తోందని గ్రహించాడు గోపాలం నెమ్మదిగా లేచి నిలబడ్డాడు అక్కడే గోడకానుకొని నిలబడ్డ పద్మ విస్మయంగా చూస్తోంది గోపి నాయనమ్మ మీద పోట్లాడుతున్నాడు శామ్యూల్ అమాయకంగా చూస్తూ నిలబడ్డాడు అక్కడి పరిస్థితి అతనికి నెమ్మదిగా అర్ధమవుతోంది

ఎవరూ కదలడం లేదు అందరూ నిలబడే ఉన్నారు సుందరమ్మ తెమ్మని హెచ్చరిస్తోంది క్షణాలు గడుస్తున్నాయి భయంకర మైన నిశబ్దం తర్వాత గోపి లోపలికి వెళ్ళి పోతానంటు అడుగు ముందుకు వేశాడు అంత వరకూ ఓపిక పట్టిన సుందరమ్మ, 'సరే. మీరు ఎవ్వరూ చేయలేని పని నేనే చేస్తాను " అంది

'అమ్మా!' గోపాలం పిలిచాడు

ఆమె ఆగింది

"అంత కానిపని వాడు ఏం చేసాడని" శాంతంగానే అడిగాడు కొడుకు మాటలకి సుందరమ్మ ఆశ్చర్య పోయింది వింతగా చూడసాగింది నుదుట విభూధి రేఖలు – కుంకుమ బొట్టు– రెండు పూటలా సంధ్య వారుస్తూ – పవిత్రంగా నిష్ఠగా ఉండే తన కొడుకేనా అలా అన్నది అని ఆశ్చర్య పోతున్నది

అయినా వాడు నా కొడుకు ఇటువంటి వ్యవహారాల్లో కఠినంగా ఉండాలని వాడికి తెలియదు తెలుప వలసిన బాధ్యత తల్లిగా తనపై ఉంది అనుకొని, 'నువ్వుండ్రాబ్బాయ్ నీకు తెలియదు" అని గోపిని లాగింది గోపీ గింజుకొన్నాడు పట్టు వదల్లేదు సుందరమ్మ గోపాలం వద్దని వారిస్తున్నా వినిపించుకొనే స్థితిలో లేదు ఆమె శామ్యూల్ బిక్క ముఖం వేసుకొని నిలబడి ఉన్నాడు మనిషి నుండి మనిషిని వేరు చేసే సమాజాన్ని మొదటి సారిగా చూస్తున్న అతని కళ్ళల్లోంచి కన్నీటి బిందువులు రాలుతున్నాయి అతన్ని దగ్గరగా తీసుకొని ధైర్యం చెబుతోంది సుజాత

గోపీ గంజుకుంటూనే ఉన్నాడు ఏ ఉపద్రవం ముంచుకు వస్తుందో నని పద్మ భయపడుతోంది.



## మైధునం






గోపాలం తల్లి దగ్గరగా వెళ్ళి "అమ్మా! ఆవేశపడకు. ముందు నా మాట విను. నీ కొడుకుగా నీ కోరిక మేరకు, నీ కిష్టమైన విధంగా నన్ను మలచావ్ నీ అడుగు జాడల్లోనే నడుస్తున్నాను. అయితే, నాబిడ్డల్ని నా యిష్టం మేరకు నన్ను పెంచే అవకాశం నాకివ్వమని నిన్ను ప్రార్థిస్తున్నాను. సగం పైగా జీవితాన్ని గడిపేసిన మనం, మన ఆచారాల కోసం – మన ఇష్టాల కోసం – ఇప్పుడిప్పుడే సమతా భావం మొలకెత్తుతున్న వారి హృదయాలను గాయపరచ లేను వీడు చేసిన పనిని ఖండించ లేను గోపీని శుద్ధి చేసి – ఈ కుర్రాడి హృదయాన్ని ముక్కలు చెయ్యలేను " అన్నాడు.

సుందరమ్మ పట్టు సడలిపోయింది. గోపి

# అమ్మా నన్ను క్షమించు

సంతోషంగా ఎగిరి గంతేశాడు. సుందరమ్మ నిలబడిన చోటనే చతికిల బడిపోయింది. చిన్న బోయిన ముఖంతో కూర్చుంది కొన్ని నిముషాలు గడిచాయి గోపాలం పిల్లల్ని అడుకోమని చెప్పి పంపించేశాడు

గోపాలం! ఈ రోజే నేను మన ఊరు వెడతాను నా ప్రయాణానికి ఏర్పాటు చేయి నీకు కుదరదంటే చెప్పు నేనే వెళ్ళిపోతాను" అంది స్థిరంగా

'అమ్మా'! బాధగా పిలిచాడు.

"అవున్రా! నేను ఈ కొంపలో ఉండలేను నన్ను పంపే ప్రయత్నంలో ఉండు అని లోపలి వెళ్ళిపోయింది.

గోపాలం ఆలోచనలో పడ్డాడు మంచి చెడు గురించి చర్చించాడు. న్యాయాన్యాయాల గురించి విచారించాడు, తరాల అంతరాలు గమనించాడు బంధాల విలువల్ని పరిశీలించాడు చివరకు పిల్లల భవిష్యత్తే ముఖ్యమని నిర్ణయించాడు కర్తవ్యాన్ని గుర్తించాడు

అమ్మా! ఈ సంఘటన మూలంగా నువ్వు వెళ్ళిపోతాననడం నా దురదృష్టం నీ తరం వేరు నా తరం వేరు పిల్లల తరం వేరు నేను నీమాటకు విలువనిచ్చి మన ఆచారాల్నే కాపాడటానికి ప్రయత్నం చేశాను నాలా కాకుండా, నా పిల్లలు మరో ప్రపంచాన్ని చూడాలి దేశ సమైక్యతలో వీళ్ళు భాగస్వాములు కావాలి ఇదే తప్పయితే నన్ను క్షమించు, నా పిల్లల్ని క్షమించు అన్నాడు చేతులు జోడించి తర్వాత

సుందరమ్మలో కదలికలేదు ప్రయాణమైంది సాయంత్రం బండికో అందరూ దిగులు నిండిన గుండెలతో ఆమెకు గుమ్మంలో వీడ్కోలిచ్చారు స్టేషన్‌కి చేరుకొన్నారు గోపాలం దిగులుగా తిరుగుతున్నాడు కళ్ళనీళ్ళు పెట్టుకొంటున్నాడు పదేపదే తన ఆలోచనల్ని, భావాల్ని తల్లి యెదుట సమర్ధించుకొంటూ – ఆమె అంగీకరింప చేయాలని చేస్తున్నాడు

ఇంతలో రైలు వచ్చింది సుందరమ్మ వెళ్ళి తన సీటులో కూర్చుంది కిటికి దగ్గర నిలబడ్డాడు గోపాలం

గార్డు విజిల్ వేశాడు

గోపాలం కళ్ళు వర్షిస్తున్నాయి క్షమించమని ప్రాధేయపడుతున్నాడు ఆ మాతృహృదయం కరగింది కొడుకు చేయి అందుకుంది

గోపాలం. నా పరిధి నేను దాటి బయటకు రాలేను. నీ పరిధిదాటి నువ్వురాలేవు నువ్వు చేయలేని పనిని నీ పిల్లల ద్వారా
నీతపన అలాగే కానియ్యి ఇక
చూస్తూ కూర్చోలేను
పడటం నువ్వు
జాగ్రత్త.

రైలు కదిలింది.

గోపాలం చేయి గాలిలో ఊగుతోంది. తల్లి చివరగా పలికిన పలుకులు కొండంత బలాన్ని యివ్వగా ఉత్సాహంగా ముందుకు కదిలాడు గోపాలం. □

### అంకితం

మాటల్లో కాకుండా చేతల్లో ఉపకారం చేసే శ్రీ కిళాంబి రంగభాష్యం, శ్రీమతి లక్ష్మీ భాష్యం దంపతులకు అభిమానంతో ఈ కథా కుసుమం.

–రచయిత

# రాజకీయాలలోకి వస్తున్న క్రికెట్ తారలు!

"గ్లామరున్న వాడే రాజ్యమేలు" అన్నట్లు తయారయ్యాయి ఈ నాటి రాజకీయాలు...!

అమెరికా అధ్యక్ష పదవి నుంచి ఆంధ్ర ప్రదేశ్‌లోని గ్రామ సర్పంచ్ పదవి వరకు గ్లామర్ పెద్ద ప్రాముఖ్యం వహిస్తున్న విషయం అందరికీ తెలిసిందే!!

సహజంగా గ్లామర్ విషయంలో సినిమా స్టార్స్ నెం 1 లనే పేరు వుండేది.

అయితే?! ఇప్పుడు!



వెంగ్‌సర్కార్ (బొంబాయి)

గ్లామరున్న సినీస్టార్స్‌ని సైతం తమ వైపు తిప్పుకొన్న ఘనత "క్రికెట్ స్టార్స్"కే చెందింది.

భారత ఉపఖండంలో క్రికెట్ స్టార్స్‌కి వున్నంత గ్లామర్ మరెవ్వరికి లేదన్నది స్పష్టం. ఎంతో గ్లామర్ గల క్రికెట్ స్టార్స్ ఇటీవల రాజకీయ పార్టీలలో చేరటం, ఎన్నికలలో పోటీ చేస్తారనటంతో రాజకీయాలలో మరో నూతనదశ ఆరంభమైందని చెప్పవచ్చు.

క్రికెటర్ల రాజకీయ ప్రవేశం ముందుగా పాకిస్తాన్‌లో జరిగిందని చెప్పవచ్చు. కొంత కాలం క్రితం మీడియం ఫాస్ట్ బౌలర్‌గా వెలిగిన పాక్ క్రికెటర్ సర్‌ఫ్రాజ్‌నవాజ్ మొదట రాజకీయాల్లో ప్రవేశించి రాజకీయాల్లో క్రికెటర్ల ప్రవేశానికి నాంది పలికాడు. పంజాబ్ (పాకిస్థాన్) ప్రావెన్షియల్ అసెంబ్లీ మెంబర్‌గా సర్‌ఫ్రాజ్‌నవాజ్ ఎన్నిక కావటం జరిగింది.

ఇటీవల టెస్ట్ క్రికెట్ రంగానికి గుడ్‌బై చెప్పిన ప్రఖ్యాత ఆల్‌రౌండర్ ఇమ్రాన్ రాజకీయాల్లోకి వస్తున్నాడనే వార్తలు వెలువడ్డాయి. పాక్ రాజకీయాల్లో కీలక పాత్ర వహించ వలసిందిగా



శ్రీకాంత్ (తమిళనాడు)

ఇమ్రాన్‌ను అతని సన్నిహితులు కోరుతున్నారట.

ప్రముఖ టెస్ట్ క్రికెటర్ కపిల్‌దేవ్‌ని ఓ మ్యాచ్‌లో బాధ్యతా రహితంగా ఆడాడంటూ సస్పెండ్ చేయటం జరిగింది. అయితే వెంటనే కపిల్ కాంగ్రెస్ (ఐ) పార్టీలో చేరటం తిరిగి భారత జట్టులో స్థానం సంపాదించటం జరిగింది. "హర్యానా హరికేన్"గా

గవాస్కర్



కీర్తింపబడే కపిల్‌దేవ్‌ని ఎన్నికలలో పోటీ చేసి ప్రజలకు సేవ చేయవలసిందిగా ఓ రాజకీయ పార్టీ నాయకులు మంతనాలు జరుపుతున్నారట.

"సన్నీ" సునీల్ గవాస్కర్ ప్రపంచంలోనే అతి పెద్ద గ్లామరున్న క్రికెటర్. ఇటీవల రిటైర్ అయిన గవాస్కర్ హిందీ సూపర్‌స్టార్ నటుడు మాజీ పార్లమెంట్ సభ్యుడు అయిన అమితాబ్ బచన్‌కి సన్నిహిత మిత్రుడు అనే విషయం తెలిసిందే. ఎన్నికల గోదాలోకి గవాస్కర్ దిగితే బొంబాయి



కీర్తి అజాద్ (బీహార్)

అతని నియోజకవర్గమట.

"కంప్యూటర్ల" సూపర్‌స్టార్ క్రికెటర్‌గా ప్రఖ్యాతి గాంచిన దిలీప్ వెంగ్‌సర్కార్ ఇటీవల యువజన కాంగ్రెస్‌లో మెంబర్‌గా చేరటంతో సర్కార్ పార్టీ ఏదో తెలిసి పోయింది.

రానున్న తమిళనాడు ఎన్నికలలో డాషింగ్ బ్యాట్స్‌మన్‌గా పేరుబడ్డ కృష్ణమాచారి శ్రీకాంత్ ఓ రాజకీయ పార్టీ తరఫున ఎన్నికల ప్రచారానికి వస్తారనే వార్త తమిళనాడులో పెద్ద ఎత్తున దుమారం లేపింది.

మరో ప్రముఖ క్రికెటర్ "కీర్తి అజాద్" బీహార్ అసెంబ్లీ ఎన్నికలలో పోటీ చేస్తారనే వార్త ప్రచారంలో వుంది. కీర్తి అజాద్ బీహార్ ముఖ్యమంత్రి శ్రీ భగవత్ ఝా అజాద్ కుమారుడనే విషయం ఈ సందర్భంగా గమనించదగ్గ విషయం.

ఇప్పటివరకు రాజకీయ రంగంలో వినవస్తున్న ఈ క్రికెటర్లే కాక మరి కొంత మంది క్రికెటర్లు కూడా ప్రవేశిస్తున్నారని ఓ సంచలన వార్త. వారి పేర్ల కోసం మరికొంత కాలం వేచి చూడాల్సిందే!!

– నూతల పాటి

# చాళుక్యుల శిల్ప కళా ప్రాభవం వెల్లివిరిసే అలంపూర్

పావన భారత భూమి ప్రకృతి సంపదకు సాటిలేని భాండారమై, సగుణోపాసనకు, వివిధ కళలకు నిధియై, తద్వారా గుణాతీత నిర్గుణోపాసనకు దోహదకారియై తత్వరేఖల్ని విశ్వమంతా వెదజల్లుతుంది. ఉత్తర ఖండము ఎక్కువగా నదులకు, దక్షిణ భూభాగం నిధులకు నిలయమైతే మధ్యనున్న ఆంధ్రభూమి పై . రెండింటికి సమన్వయకారిగా నదులకు, నిధులకు కేంద్రమై వెలసింది. అందులో రాయలసీమ ప్రాంతాన్ని "ఆలయాల సీమ" అనవచ్చు. ఇందుకు ముఖ్యకారణం పుష్కర నదులయిన తుంగభద్ర, భీమ, కృష్ణలు ఈభాగంలో ఎక్కువగా ప్రవహిస్తున్నాయి." కనుకనే "గంగ" తర్వాత అంతటి ప్రాముఖ్యం కృష్ణానదికి కలిగింది.

కర్నూలు నగరానికి ఉత్తరంగా 34 కి. మీ దూరంలో తుంగభద్రకు ఆవలి ఒడ్డున (ప్రస్తుతా ఇది మహబూబ్ నగర్ జిల్లాలో ఉంది) వెలసిన అలంపూర్ తత్వోపాసనకు నిలయమై, నిత్యం దేశవిదేశాలనుండి ఎందరెందరనో యాత్రికులను ఆకర్షిస్తుంది. దీనిని పూర్వం హలంపురం, హమలపురం అనేవారు. ఇది యోగక్షేత్రమయిన శ్రీశైలానికి పశ్చిమ ద్వారంగాను, తుంగభద్రానది దక్షిణం నుండి ఉత్తర వాహిని అయినందున దక్షిణ కాశిగాను ఖ్యాతిచెందింది. ఇక్కడ బ్రహ్మ తపస్సు చేసినట్లుగా స్థానికులు నమ్ముతారు. కనుకనే ఇక్కడ నవబ్రహ్మలయాలు నిర్మించదలచి, బ్రహ్మకు సగుణోపాసనలేదు కనుక ఈశ్వరస్వరూపం జోడించి నవబ్రహ్మేశ్వరయాలు నిర్మించారు. ఈ క్షేత్రాన్ని కొందరు భాస్కరక్షేత్రంగా పరశురామ క్షేత్రంగా కూడ వ్యవహరిస్తారు.

## ఆలయాల నిర్మాణం

బాదామి చాళుక్య ప్రభువయిన రెండవపులకేసి 7వ



వృషభేశ్వర శిల్పం

శతాబ్దంలో నిర్మాణం చేపట్టాడని. తర్వాత వివిధ రాజవంశాలు 16వ శతాబ్దం వరకు నిర్మాణ, పునరుత్థాన కార్యక్రమాలు జరిపారని చెప్తారు. ఆలయాల నిర్మాణశైలి ద్రావిడ, నాగర సమన్వయమైన వేసర వాస్తుశైలిలో జరిగింది ప్రతి ఆలయానికి ద్వితల విమానం, అమలక శిఖర ఉన్నాయి దీనిని ప్రసిద్ధ విద్వాంసుడు ఫెర్గూసన్ "చాళుక్య శిల్ప శైలి"గా అభివర్ణించాడు.

బాల, గరుడ, స్వర్గ, పద్మ, తారక, అర్క, కుమార, వీరబ్రహ్మ, విశ్వబ్రహ్మ ఆలయాలు దాదాపు ఏకశైలిలోనే నిర్మించబడినాయి. అందులో బాల బ్రహ్మేశ్వరాలయం ప్రధానమైనది. దీనిని బ్రహ్మ ప్రతిష్ఠగా చెప్తారు ఈ ఆలయంలో మండపానికి ఒకమూలన అష్టా దశ శక్తులలోని జోగులాంబ అమ్మవారి ఆలయం వుంది. శ్రీ శంకరభగవత్పాదుల వారు ఇక్కడ అష్ట దిగ్బంధన చేశారు. సప్తమాతృక స్వరూపములయిన బ్రహ్మి, మాహేశ్వరీ, కామారీ, వైష్ణవీ, వారాహి, ఇంద్రాణీ, చాముండీల ప్రతిష్ఠలు జరిగాయి. గణపతి, సూర్యనారాయణ, కుమార స్వామి, కాలభై రవ, త్రిమూర్తులు, అర్ధనారీశ్వరుడు, బ్రహ్మ, ప్రదోషమూర్తి, ఇంద్రుడు, నవగ్రహములు, వీరభద్రుడు, దక్ష ప్రజాపతి, మహిషాసురమర్దిని, కన్యాకుమారి, తపస్విని, ఉమ, రససిద్ధులు, షోడశబాహు నారసింహ, హరిహర, సైకత గణపతి, చండీముండీ, ద్వారపాలకులతో సర్వదేవీదేవుల నిలయంగా మారింది ఈ ఆలయం. బాలబ్రహ్మేశ్వరునికి – అభిషేకమొనర్చిన గంగ లోనికి వెళుతుంది. ఒక్కచుక్క కూడా బయటకు రాదు ప్రక్కనే శ్రీ వేంకటేశ్వర, వీరాంజనేయ ఆలయాలు ఉన్నాయి.

స్వర్గ బ్రహ్మలయంలో లింగోద్భవ దృశ్య శిల్పం ఒక ప్రత్యేక ఆకర్షణ. ఈ ఆలయాన్ని బహ్మనీసుల్తాను వంశీయుడు 14 సంవత్సరాల వయస్సులో శాల



వీరబ్రహ్మ, విశ్వబ్రహ్మ ఆలయాలు



కాకతీయ ప్రభువయిన ప్రతాపరుద్రుని శాసనం

పైర్మాను ధ్వంసం చేస్తుండగా జరిగిన యుద్ధంలో అతని తల పడినచోట, ఆలయం ఆవరణలో అతని సమాధి వెలిసింది. ఆ దర్గాకు ప్రతి సంవత్సరం ఉరుసు జరుగుతుంది. ప్రస్తుతం అర్కబ్రహ్మాలయ శిఖరం పూర్తిగా కూలిపోయింది.



పాపనాశిలో వివిధ ఆలయాలు

## పురావస్తు ప్రదర్శనశాల

బాలబ్రహ్మేశ్వరాలయానికి ఉత్తరంగా అలంపూరులో వివిధ సమయాలలో బయల్పడిన అపురూపశిల్పాలను అమర్చిపెట్టారు. ప్రతి శిల్పానికి ఒక ప్రత్యేకత, ప్రతిపత్తి ఉన్నాయి. అందులో నందిపై ఆరూఢులయిన శివపార్వతుల "వృషభేశ్వర శిల్పం" మరెక్కడా లభ్యంకాదని చెప్తారు. నటరాజ, ఎర్రరాతిలో మల్చబడిన సూర్య విగ్రహాలు ప్యారిస్‌లో నిర్వహించబడిన అంతర్జాతీయ శిల్పకళా ప్రదర్శనకు వెళ్ళివచ్చాయి. తల లేని రేణుక విగ్రహంను వెన్న పెట్టి అర్చిస్తే సంతానం కలుగుతుందనే నమ్మకం అక్కడి ప్రజల్లో వుంది. సర్పరాజు, శాంతరూపిణి కాళిక, చిద్విలాస కోపోద్రిక్త అయిన మహిషాసుర మర్దిని మొదలయిన ముఖ్య శిల్పాలను దర్శించవచ్చు. 1221 నాటి ప్రతాపరుద్రుని శాసనం ప్రకారం ఆయన చాల భూమి దానం చేసినట్లు, ఆ దానాన్ని ఎవరయినా అక్రమంచేస్తే గో హత్య చేసినట్లు సూర్యచంద్రుల సాక్షిగా తెలుపబడివుంది.



ప్యారిస్‌లోని అంతర్జాతీయ శిల్పకళా ప్రదర్శనలో పాల్గొన్న నటరాజ శిల్పం

స్వర్గ బ్రహ్మాలయ కుడ్యంపై లింగోద్భవ దృశ్య శిల్పం

## నిత్యార్చనలు

అన్ని ఆలయాలలో ఉదయం అభిషేకం, సాయంకాలం దీపారాధన జరుగుతాయి. కాని బాలబ్రహ్మేశ్వరాలయంలో త్రికాల పూజ, మహానైవేద్యం వుంటాయి.

శ్రీశైల జలవిద్యుత్కేంద్ర నిర్మాణ ఫలితంగా ఈ ఆలయాల చుట్టూ తుంగభద్రా నది నీరు చేరసాగింది. ఆ నీటి తాకిడి కలుగకుండ నదీ తీరంలో పెద్దకోట గోడలాంటిది నిర్మించారు. అంతేకాకుండ నదీ పరిసరప్రాంతంలో నీట మునగనున్న 23 దేవాలయాలను ప్రభుత్వం ఒకేచోటకు చేర్చి ఆ యా కోవెలలను యథాతథంగా వుండేట్లు పునర్నిర్మించింది. దీనిని "పాపనాశి" అంటారు.

నవబ్రహ్మేశ్వరాలయాలు ప్రాంగణాన్ని గ్రామస్థులు కొందరు అశుచి కార్యక్రమాలకు ఉపయోగిస్తున్నారు. అక్కడ ఠానాలో ఉన్న పోలీసులు కొంత జోక్యం కలిగించుకొంటే కొంత మేలు కలుగుతుంది. గ్రామపెద్దలుకూడా ప్రజల్లో మార్పురావడానికి ప్రయత్నించాలి!

అలంపూర్ వెళ్ళటానికి కర్నూలునుండి ఉదయం గం. 5–30. మొదలు రాత్రి వరకు బస్సు నడుస్తూవుంటుంది. అన్ని దేవాలయాలు తిరిగి దర్శించటానికి ఒకపూట పడుతుంది.

వ్యాసం, ఫోటోలు
కెప్టెన్ షేక్ మౌలాలీ

అలంపూర్ వివిధ ఆలయాల దృశ్యం



సీరియల్

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## మోసం! మోసం! మోసం!

ఆ రోజున సావిత్రిని మోసంచేసి పాతికవేలూ తీసుకువెళ్ళిన ఆ త్యాగరాజు ఎవరో అబిలాష్‌కు అచూకీ దొరకలేదు తన జీవితానికి అదొక యిన్‌సల్ట్‌గా బావించాడు అతను తను చెయ్యవలసిన పన్లు చేసుకుపోతున్నా మనస్సులో ఆ కలక అతన్ని హెచ్చరించి కదిలిస్తూనే వున్నది సావిత్రి కూడా ఎక్కువగా పనిలేకపోవడంతో యివతలకు వచ్చి శాంతాదేవితో కబుర్లు చెవుతూ వుండేది ఈ పద్ధతి అభిలాష్‌కు నచ్చేది కాదు

ఉదయం తొమ్మిది గంటలయింది ఆఫీస్ రూంలో అతనికి కావల్సిన ఫైల్సు యిచ్చి శాంతాదేవి దగ్గరకు వెళ్ళటానికి కుర్చీలో నుంచి లేచింది సావిత్రి

ఎక్కడికి?" అన్నాడు

'మీ అమ్మగారి దగ్గరికి' క్లుప్తంగానే సమాధానం

ఈ ఆఫీసుకు మేనేజర్ని నేను, నాకు పి ఏ వి నువ్వు ఆఫీసు వదిలేసి మా అమ్మతో కబుర్లు చెప్తూ కూర్చోడానికి వీల్లేదు ఇంట్లోనే ఆఫీసు కావడంతో యు ఆర్ డూ యింగ్ మిస్చీఫ్' అన్నాడు కోపంగా

నిల్చున్నదల్లా కూర్చున్నది తల దించి కళ్ళు పైకెత్తి చూసింది అతను ఫైల్లో కాగితాలు సరిచేస్తూ కూర్చున్నాడు

"సార్!"

తలెత్తి చూశాడు

'నేను ఆఫీసుపని వదిలేసి మీ అమ్మగారితో కబుర్లు చెవుతున్నానన్నారు యువర్ రిమార్క్ ఈజ్ ఇర్రెలవెంట్, ఇంప్రాపర్, అబ్సర్డ్' అన్నది

ఫైలు మూసి సన్‌గాగుల్స్ తీసి తలెత్తి చూసేడు

'ఎస్ సర్, మీ అమ్మగారితో నేను మాట్లాడలేదు" అన్నది మళ్ళీ నెమ్మదిగా.

"నువ్వు రోజూ మాట్లాడుతున్నది మా అమ్మతో కాదా, ఎందుకు అబద్ధం' తనూ రెట్టించే అన్నాడు

నేను రోజూ మాట్లాడుతున్నది మీ అమ్మగారితో కానేకాదు మా సుపీరియర్ బాస్, మేనేజింగ్ డైరెక్టర్ శాంతాదేవీ కన్సల్టింగ్ కార్పొరేషన్‌వారితో" అన్నది

కాస్త ఆశ్చర్యపోయి చూసేడు అభిలాష్

"మాటలు బాగా నేర్చావే వెరీనైస్! ఒక నెల జీతం వంటబట్టినట్టుంది మా అమ్మకాదు మన మేనేజింగ్ డైరక్టర్ అంటావ్ నేను మా అమ్మ అనే అనుకొంటున్నాను సుమా! నువ్వు నన్ను కరెక్ట్ చేశావు థాంక్స్" అన్నాడు వచ్చే నవ్వుని ఆపుకుని.

"ఇంట్లోనే ఆఫీసు కావడంతో నేను మిస్చీఫ్ చేస్తున్నానన్నారు. నేను చేసిన మిస్చీఫ్ ఏమిటో ?" ప్రశ్నార్ధకంగా చూసింది

"పాతికవేలూ ఒక ఛీట్‌కుయిచ్చి ఆ దొంగని పట్టుకోకుండా స్టయిలిష్‌గా ఆఫీసుకు వచ్చిపోతూ వుండడం మిస్చీఫ్‌కాదా? ఇక మాటలు అనవసరం, మనిద్దరం అఫీషియల్‌గానే మాట్లాడుకుందాం, ఇటీజ్‌ఏ క్వశ్చన్ ఆఫ్ ప్రెస్టేజ్, ఆ దొంగ అచూకీ తియ్యాలి కమాన్ ఫాలో మీ యాజ్‌మై పి ఏ "

గాగుల్స్ పెట్టుకుని రివాల్వింగ్ చైర్‌లో నుంచి లేచి వరండాలోకి వచ్చి పోర్టికోలో వున్న కార్లో కూర్చున్నాడు తనూ బ్రీఫ్‌కేస్ తీసుకుని కార్లో కూర్చున్నది.

కారు డ్రైవ్‌చేస్తున్నాడు అభిలాష్. మాట్లాడకుండా యిటు చివరగా కూర్చున్నది సావిత్రి.

"మాట్లాడకుండా కూర్చున్నావేం" అన్నాడు.

"ఆఫీసు విషయాలు మీరు మాట్లాడాలి" ఇటు చూడకుండానే సమాధానం

**జరిగిన కథ- 22:** సత్యభామ పెళ్ళికి సుముఖంగా లేకపోవడం మానసిక లోపమేమో అని గోపాలరావు గారు సైకియాట్రిస్టు దగ్గరికి తీసుకువెళతారు సైకియాట్రిస్టు సత్యభామను అభినందిస్తుంది. శ్రీవిద్య తన సమస్యను అదిత్యకు వివరిస్తుంది. అదిత్య అమెను ముద్దులు పెట్టుకుని చెంప దెబ్బతింటాడు విమల తన మానసిక, శారీరక, అరోగ్యం కోసం అపరిచితుడితో సంబంధం పెట్టుకున్నానని శ్రీవిద్యకు చెవుతుంది. జగదీష్ అధ్వర్యంతో సామూహిక వివాహాలు జరుగుతాయి. తన ఉపన్యాసంలో జగదీష్ సత్యభామను పొగుడుతాడు.

చెప్పింది

'పక్కన కార్లో కూర్చుంది ఏదో లగేజ్ తీసుకుపోతున్నట్టు వున్నది గాని, ఒక స్నేహితురాల్ని తీసుకుపోతున్నట్టు లేదు' అన్నాడు ఇటు చూసింది సావిత్రి

"నేను మీ కార్లో వస్తున్నది మీకు పి ఏ హోదాలో నేగాని స్నేహితురాలుగా కాదు మీకు నామీద మరో రకమైన అభిప్రాయం వుంటే కారు ఆపండి, నేను వెళ్ళిపోతాను "

'బాగా ఆలోచించే ఆ మాట అంటున్నావా?"

"అవును మీ ఉద్దేశాన్ని బట్టి నేను ఆలోచించే అంటున్నాను "

ఒక సైడ్‌లో కారాపి, డోర్ తీసుకొని తను కిందికి దిగి, అటుతిరిగొచ్చి ఆ డోర్ తీసి "దిగండి" అన్నాడు కార్లో నుంచి దిగి నిల్చున్నది అతను డోర్‌వేసి అటువచ్చి కార్లో ఎక్కి మాట్లాడకుండా వెళ్ళిపోయాడు ఈ పరిస్థితి ఎవరన్నా చూశారేమోననే ఆలోచన, అభిమానం అప్పటికి కలిగాయి పరిసరాల్ని చూసింది పెద్ద పోస్టాఫీసు, చాలామంది వున్నారు చాలా మంది చూసే వుంటారనుకున్నది పని వున్నట్టుగా పోస్టాఫీస్‌కు వెళ్ళింది నాలుగు కవర్లు తీసుకున్నది రిజిస్ట్రేషన్ కౌటరు మనియార్డర్ల కౌటర్ అట్లా చూస్తూ వస్తున్నది మనియార్డర్స్ కౌంటర్ దగ్గర నల్లటి ఫ్యాంటు, తెల్లని షర్టు, ఫారెన్ గాగుల్స్, త్రిబుల్‌ఫైవ్



## ఆడపిల్లలు – అనుభవాలు



సిగిరెట్‌పెట్టి పరకాయించి చూసింది అవును అతనే సందేహం లేదు చీట్, రోగ్, వదలకూడదనుకొన్నది

అతను మనియార్డరు రసీదు తీసుకుని స్టైలిష్‌గా నడుస్తూ, స్మోక్ చేస్తూ ఇవతలకు వచ్చి వరండాలోకి వచ్చాడు. వెనకగా వచ్చింది

"హల్లో సార్ త్యాగరాజుగారూ" వినపడేటట్లుగా అన్నది వెనక్కి తిరిగి చూసేడు తెలీనట్లు ముఖకవళికలు

"గుడ్‌మార్నింగ్ సర్" అన్నది నవ్వుముఖంతో

"సారీ మేడమ్ నా పేరు త్యాగరాజు కాదు పంకజ్ మల్లిక్" అని వెనక్కి తిరిగాడు. అయిదారుగురు చూస్తున్నారు ఏం చెయ్యాలో తోచలేదు అతను నడిచి వెళ్తున్నాడు తనూ ఫాలో అయింది

"పంకజ్‌మల్లిక్‌గారూ" పిల్చింది ఆగాడు. నడి రోడ్డు పది గజాల దూరంలో బస్‌స్టాఫ్ పాతిక ముప్పైమంది ఈ ఇద్దర్నీ చూస్తూనే ఉన్నారు.

"చూడమ్మా, నన్నెందుకు ఫాలో అవుతున్నావో నాకు అర్థం కావడంలేదు నిన్ను మోసం చేసిన వ్యక్తి నా మాదిరే ఉన్నాడేమో కాని నేను కాదు నా పేరు పంకజ్‌మల్లిక్. అతని పేరు?"

"త్యాగరాజు, పంకజ్‌మల్లిక్, కారు తెల్లగా ఉన్నది మీరు ఆ రోజున మా ఆఫీసుకు వచ్చి మీరే త్యాగరాజు అని చెప్పి నన్ను ఛీట్ చేసి, పాతికవేలూ తీసుకు వెళ్ళారు యు ఆర్ నాట్ ది కరెక్ట్ పర్సన్ టు హాం మై ఆఫీస్ మేనేజర్ హ్యాజ్ టు పే ట్వెంటీ ఫైవ్ థవుజండ్ రుపీస్ మారు పేర్లు పెట్టుకుని, తప్పుడు నంబర్ ప్లేట్స్ పెట్టి కార్లలో తిరిగే యు ఆర్ ఛీటింగ్ పీపుల్" అంత గట్టిగా స్వచ్ఛంగా ఎట్లా అన్నదో తనకే తెలీదు అందరూ చుట్టూ మూగేరు అతనూ మాట్లాడలేక-పోయాడు

ఇదంతా గొడవగా ఉంది పోలీస్ రిపోర్ట్ ఇవ్వండి" అన్నారు అయిదారుగురు అతను ఆలోచించాడు

"ప్లీజ్ హియర్ మీ, ఈ అమ్మాయి ఎవరో నాకు తెలీదు పదిమంది మగవాళ్ళ ఎదుట ఒక ఆడపిల్ల అవుట్‌రైట్‌గా, డేర్ డెవిల్‌గా అబద్ధం చెప్పినా, అది అందమయిన నిజంగానే కనిపిస్తుంది అదే సమయంలో మగవాడు చెప్పే నిజానికి విలువ ఉండదు సరే, మా ఇద్దర్నీ ఎవరయినా ఆటోలో పోలీస్‌స్టేషన్‌కు చేర్చండి ఇద్దరి పరువూ వాళ్ళే తేలుస్తారు ఐయామ్ రెడీ" అన్నాడు

సావిత్రి ఆలోచించింది తను వయస్సులో ఉన్న ఆడపిల్ల అతను మోసం చేసి పాతిక వేలూ పట్టుకుపోయిన వ్యక్తి వెళ్ళవలసింది పోలీస్ స్టేషన్‌కు, ఆడపిల్ల వెళ్ళితే? అందరి వైపూ చూసి అన్నది

"ప్లీజ్ ఒక్క సహాయం చెయ్యండి మా మేనేజర్‌కు ఫోన్ చేసి వస్తాను. ఐదు నిమిషాలు అంతవరకూ ఈ పంకజమల్లిక్ పారిపోకుండా చూడండి మమ్మల్ని మోసం చేసింది ఇతనే ఇపుడే వచ్చేస్తాను" అని గబగబ నడిచి వెళ్ళింది ఎదురుగా ఉన్న ఫోటో స్టూడియోలోకి వెళ్ళి అభిలాష్‌కు రింగ్ చేసింది శాంతాదేవి మాట్లాడింది అభిలాష్ లేడు ఫోటో స్టుడియో అతన్ని హ్యాండ్ కెమెరా తీసుకురమ్మన్నది అతను వచ్చాడు అతన్ని ఫోటో తియ్యమని చెప్పింది ఫ్లాష్ లాగాడు అతను వెళ్ళిపోయాడు పంకజ్‌మల్లిక్ నవ్వుతూ నిల్చున్నాడు

'చూడండి' ఒక ఆడపిల్ల ఎన్నో అబద్ధాలు ఆడి నా ఫోటో కోసం ఇంత సస్పెన్స్ క్రియేట్ చేసింది మిస్, మీ పేరు నాకు తెలీదు నా ఫోటో కావాలని చెపితే చాలా సంతోషంగా ఇచ్చేవాడిని ఇంత దొంకతిరుగుడుగా కథ అల్లటం బావుండలేదు దట్సాల్ రైట్, ఇక పోలీస్ స్టేషన్‌కు పదండి" అన్నాడు

'నో నాట్ నెసెసరీ అన్నది సావిత్రి

అందరూ విస్తుపోయారు పిచ్చిదా, మోసగత్తె, ఎవరయినా అతి తెలివిగల అందమైన ప్రాస్టిట్యూటా, ఎవరికి తోచినట్లు వాళ్ళు మాట్లాడి వెళ్ళిపోయారు అతను నవ్వుతూ నడిచి వెళుతున్నాడు అతను చూడకుండా మళ్ళీ పోస్టాఫీస్‌కు వెళ్ళింది సావిత్రి పాతిక గజాల దూరంలో చాలా సేపట్నుంచీ ఒక ఫియట్ కారు బ్లూ రంగుది ఉన్నది సావిత్రి అనుమానపడ్డది నంబర్ నోట్ చేసుకున్నది మరో పది నిమిషాల్లో అతను వచ్చి కారు తలుపు తాళం తీసి, కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయాడు సావిత్రి ఫోటో స్టూడియోకు వెళ్ళి ఫోటో కాపీ ఎప్పుడిస్తారని అడిగింది సాయంత్రం అయిదు గంటలకు అని చెప్పాడు ఫోటోగ్రాఫర్ ఆటోలో మళ్ళీ అభిలాష్ ఇంటికే వెళ్ళింది ఇందాకటి నుంచీ తనున్న వాతావరణం వేరు ఆ టెన్షన్ వేరు ఇప్పుడు మళ్ళీ ఈ వాతావరణం పన్నెండున్నర దాటింది ఇంటికి భోజనానికి వెళ్ళలేదు ఆకలేస్తున్నది కాని ఈ విషయాలన్నీ అభిలాష్‌కు చెప్పాలి ఆ మోసం చేసిన వ్యక్తిని పట్టుకునే బాధ్యత తనదన్నాడు ఇదీ ఆ కర్తవ్య నిర్వహణలో ఒక భాగం దశరథరామయ్య, అభిలాష్ ఇద్దరూ ఇంట్లో లేరు అన్ని విషయాలూ శాంతాదేవికి చెప్పింది సావిత్రి మరో అరగంటలో తండ్రీ కొడుకు వచ్చారు వాళ్ళకూ చెప్పి భోజనానికి వెళతానన్నది

"దొంగని వదిలేసి, అతని ఫోటోని చూపించబోతున్నందుకు మన పి. ఏ గారికి థ్యాంక్స్ చెప్పటం మన బాధ్యత పి ఏ గారూ చాలా థ్యాంక్స్ తమరు ఇక్కడే భోజనం చేస్తే మేం చాలా సంతోషిస్తాం ఆ తరవాత మిమ్మల్ని మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను ఈ రోజు పూర్తి విశ్రాంతి తీసుకోండి' అన్నాడు అభిలాష్ అయిష్టపడుతూనే సరే అన్నది

భోజనాలయాక కార్లో సావిత్రి ఇంటికి తీసుకు వెళ్ళాడు అభిలాష్ సావిత్రి తల్లీ, తండ్రీ, చెల్లెలు అసిరమ్మ సావిత్రి ఇంకారాలేదని ఎదురు చూస్తూ కూర్చున్నారు కారు దిగే ముందు సావిత్రి అన్నది

"ప్లీజ్, ఈ జరుగుతున్న ఆఫీసు విషయాలు ఎవ్వరికీ అదే మావాళ్ళకు చెప్పకండి ఆ పాతికవేల సంగతి నేనూ మా వాళ్ళకు చెప్పలేదు"

చిరునవ్వుతో చూస్తూ అన్నాడు" ఇచ్చట సమయానుకూలంగా అబద్ధములు ఆడబడును" ఆఫీసులో పని వత్తిడి వలన ఉండిపోయిందనీ, భోజనం అక్కడే చేసిందనీ చెప్పాడు అభిలాష్ కారు నంబరూ, ఫోటో స్టూడియో ఆఫీసూ ఇచ్చింది సావిత్రి అతను వెళ్ళిపోయాడు

ఆ సాయంత్రం అయిదున్నరకు ఫోటో స్టూడియోకు వెళ్ళాడు అభిలాష్ పొద్దున వివరాలు చెప్పి ఫోటో ఇవ్వమన్నాడు అభిలాష్ పది రూపాయలు ఇచ్చాడు అతను ఫోటోను కవర్లో పెట్టి ఇచ్చాడు. కవర్లో ఫోటోను తీసి చూసేడు అభిలాష్. ఆశ్చర్యపోయాడు ఆ ఫోటోలో తనూ, సావిత్రీ ఉన్నారు మాట్లాడకుండా కార్లో పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి జరిగిం అంతా చెప్పి రిపోర్ట్ రాసిచ్చాడు అభిలాష్. రేపే యాక్షన్ తీసుకుంటానన్నాడు సబిన్‌స్పెక్టర్.

ఆ మర్నాడు ఎనిమిదిన్నరకు వచ్చింది సావిత్రి

"గుడ్‌మార్నింగ్ సర్. ఫోటో తెచ్చారా" అన్నది.

"ఎవరిది" అన్నాడు ముక్తసరిగా.

"ఆ ఛీట్. ఆ రోగ్, ఆ పంకజమల్లిక్ ఫోటో" కోపంతో అతన్ని మనసులో





# రచయిత జవాబులు

## ఉత్తమప్రశ్న

విరజశ్రీ, అయిజ

ప్రః 1) నేటి నవలా సాహిత్యము'ఆడపిల్లలు' చదివి పాడయితే మీ రచయితలు ఎంతవరకూ బాధ్యులు?

2) స్త్రీకి స్త్రీ విరోధి అన్నారు- ఎందుచేత?

3) పెళ్ళీడు దాటినపెళ్ళి కాబోయే 'ఆడబడుచు'ల గతి అధోగతేనా?

జః 1) సినిమా ప్రపంచం ఎంతవరకూ బాధ్యత వహిస్తున్నదో ముందు చెప్పండి. సాహిత్యం చదివినా చదవకపోయినా చెడిపోవటం అనేది మనస్తత్వం మీద ఆధారపడి ఉంటుంది.

2) దానికి కారణమూ స్త్రీ+స్త్రీలోని మనస్తత్వమే.

3) ఇరవై రెండేళ్ళ లోపల వచ్చిన సంబంధాలు నచ్చక కలల కోరికల ప్రభావంతో తోసివేస్తే, అతరువాత ముఖవర్చస్సులో మార్పులు వచ్చి వృద్ధ కన్యలుగా పేరు తెచ్చుకోటానికి కారణం కొంతవరకూ స్వయంకృత అపరాధమే-

---

కుమారి ఎస్ పాదుక్, గాజుల రామవరం, హైదరాబాద్

ప్ర నేటి మహిళలపై ఇంటా బయటా జరుగుతున్న అత్యాచారాలనూ, దౌర్జన్యాలనూ ఎదుర్కోవాలంటే స్త్రీలు ఏ రకంగా రూపొందాలి. వారికి మీరిచ్చే సలహా ఏమిటి?

జ పురుష అహంకారం, పురుష ఆధిక్యత స్త్రీశక్తి మీద ఎందరో మహిళలు ఎన్నో వ్యాసాలు పత్రికల్లో ఎంతో కాలం నుంచీ రాస్తున్నారు కాలానుగుణ్యంగా చాలా మార్పులూ వచ్చాయి ఓటు హక్కుతో ప్రభుత్వాన్ని మార్చగల సమర్థులు, పార్లమెంట్‌లో, అసెంబ్లీ స్థానాలలో మహిళల పరంగా సంపాదించిన ఓట్ల నిష్పత్తిలో మంత్రి పదవులు ఇస్తే, ఈ సమస్యలకు కొంతవరకూ పరిష్కారం లభిస్తుందేమో!

సమాన హక్కులు ఎప్పుడూ సమాన అధికారాలు ఉన్నప్పుడే, కొంతవరకయినా పరిష్కరించటానికి, సావకాశం ఉన్నది-

ఎమ్ డి సర్వార్ పాషా, పుల్లూరు (ఖమ్మం)

ప్ర నైతిక విలువలు పూర్తిగా కొరవడి స్వార్థంతో మానవతను మరచిన నేటి ఆధునిక మానవునికి, మలిన మస్తిష్కాన్ని నేటి రచయిత తనను తానే కాక పాఠకులను కూడా వంచిస్తున్నాడు. వివరణ కోరుతూ-

జ ఇదంతా సామాజిక రుగ్మత కారణం బ్రతుకు మనుగడ కోసం, సత్వ రజస్తమోగుణాల్లో ఈ నాడు 70 శాతం రజోగుణం కలవారే ఎవరికి ఎదురుదెబ్బ తగిలితే వారికే ఆ నొప్పి తెలుస్తుంది ఇకసాహిత్యం అంటారా వచ్చిన ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు చదవండి

మేడిచర్ల సూర్యప్రకాశరావు, రామరాజులంక

ప్ర (1) భార్యాభర్తల బంధం గట్టిపడాలంటే?

(2) బాధ్యతా రహిత సమాజం గొప్పదా బాధ్యతాయుత వ్యక్తులు గొప్పవారా?

(3)ఇన్‌స్పిరేషన్ లేకుండా రచనలు చేయగలరంటారా?

(4) దేవుడు మనస్సుల్లో ఉన్నాడా, మనుష్యుల్లో ఉన్నాడా?

జ.(1)మాటపట్టింపులు పల్చబడాలి

(2) వ్యక్తులు బాధ్యతగా ప్రవర్తిస్తే సమాజం కూడా బాధ్యతగానే తన విధి నిర్వహిస్తుంది

(3) ఇన్స్పిరేషన్ ఉండటం వల్ల మంచి రచనలు చేయటానికి సావకాశం ఉన్నది

(4) మనిషిలో దేవుడున్నాడు, చర్మ చక్షువులకు కనిపించడు, జ్ఞానచక్షువులకు కనిపించుతాడు

ఉజ్వల ప్రసాద్, రామవరం (ఖమ్మం)

ప్ర ఆకర్షణీయ ప్రకటనలు, అతివల అంగాంగ చిత్రాలు, నినాదాల జోరు, వివాదాల హోరు ఇవన్నీ లేకుండా నేడు ఓ నవలయినా విజయవంతం కాదంటారా?

జ బుక్‌స్టాల్ అడ్రసు ఇచ్చిన మీరూ ఈ ప్రశ్న వేస్తే!

---

ఈ వారం ఉత్తమ ప్రశ్నని పంపిన 'విరజశ్రీ' అయిజ (మహబూబ్‌నగర్) గారికి రచయిత నవల "ప్రేమ కాటేసింది"- బహుమతిగా పంపబడింది

---

తలుచుకున్నది

"నా మీద మీకు ఇంత అభిమానం ఉన్నదా? సారీ పి ఏ గారూ"

అర్థంకాక చూసింది

"కొంచెం రూల్సు రిలాక్స్ చేస్తారా" అన్నాడు మళ్ళీ అంతవరకూ నిల్చునే మాట్లాడే సావిత్రి తన సీట్లో కూర్చున్నది

"నా మీద మీకున్న గౌరవానికి కృతజ్ఞుడిని. కాస్త ప్రైవేట్ భాషలో మాట్లాడుతున్నాను ప్రేమ గుడ్డిదీ, కుంటిదీ, మూగదీ, చెవిటిదీ కావచ్చు కాని ఫోటోగ్రాఫర్ మాత్రం మనిషిలో ఉన్న భావాల ప్రకారం ఫోటో తీస్తాడు" అని టేబుల్ సొరుగు లాగి ఫోటో తీసి ఇచ్చాడు

ఫోటో చూసింది మనస్సులో చీకట్లు నోట మాట రాలేదు రెండు నిమిషాలు నిశ్శబ్దం

"మీరు వెళ్ళింది ఆ ఫోటో స్టూడియోకేనా? మనల్ని ఎవరు ఫోటో తియ్యనే లేదే ఈ ఫోటో ఎట్లా తీశారు అసలు ఆ దుర్మార్గుడి ఫోటో ఇవ్వనేలేదా"

"ఆ ఫోటోగ్రాఫర్ దృష్టిలో ఆ దుర్మార్గులం మనిద్దరం మన దృష్టిలో వాళ్ళిద్దరూ సరే అదుతా నేనూ పోలీసులూ చూస్తాంగాని, ఈ ఫోటో మీకు కావాలా నన్నే తీసుకోమంటావా"

కాస్త సంభాళించుకున్నది

"ఈ ఫోటో ఎవరికీ అక్కర్లేదు ఆ దొంగలముఠా ఆచూకీ తియ్యటానికి ఉపయోగించండి కాని నన్ను కించపర్చటానికి కాదు" అన్నది మనస్సులో ఏదో ఆందోళన ఫోటోని ఇచ్చేసింది మళ్ళీ టేబుల్ సొరుగులో పడేశాడు ఫోటోని

"సావిత్రిగారూ, మనస్సుని ఆకట్టుకునే సజీవమైన వస్తువులు ఎన్నో ఉంటయ్యి చూసి ఆనందించటం, మానవ లక్షణం, దూరాని ఉండి చూసేవి కొన్ని అయితే, దగ్గరనుంచీ చూసేవి కొన్ని ఏ వస్తువూ తన స్వంతం కానప్పుడు మనస్సుతో తాకవచ్చునే గాని, చేత్తో కాదు ఆ నియమాన్ని పాటిస్తే ఆప్యాయత ఇంకా ఎక్కువవుతుంది" అన్నాడు

సిగరెట్టు వెలిగించబోయి, తీసి టేబుల్ మీద పక్కన ఉంచాడు

"సజీవమైన వస్తువులంటే" అన్నది.

"టిక్కు టిక్కుమనే గడియారం, కీ ఇస్తే ఆడే రకాల బొమ్మలు, మరమనిషి, నడిచే ఆడబొమ్మ" అన్నాడు

"ఇంకా చెప్పండి, అవేవీ సజీవమైనవి కావనే నా అభిప్రాయం ఏదో చెప్పదల్చుకుని ఏదో అనేస్తున్నారు ఆ సజీవమైన వస్తువుని మీ మనస్సులోనే దాచుకోండి ఒక చిన్న కోరిక" అన్నది

## డాక్టర్ సలహాలు

డా. కె. వెంకటేశ్వరరావు



ఎ. బి. ఎ. ఎ. – విజయనగరం

మా మొదటి సంతానం బాబుకి 2 సంవత్సరములు చిన్నప్పటి నుండి జ్వరంవచ్చినప్పుడు కొంచము సేపట్లో జ్వరం ఎక్కువయి ఫిట్సు వస్తున్నాయి క్రితం నెలలో పాప పుట్టినది ఈ పాపకి గూడా ఫిట్సు ఆరంభమయినాయి

రెండవ సంతానమునకు గూడా ఫిట్సు వస్తుంటే ఏదో కారణం కోసం ఆలోచించాల్సి వస్తుంది. మామూలుగా జ్వరం ఎక్కువయి చిన్న పిల్లలకు ఫిట్సు రావటాన్ని 'ఫిబ్రైల్ ఫిట్స్' అంటారు.

ఇలా కానప్పుడు తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు శిశువు మెదడులో ఏర్పడగల కొన్ని మార్పుల వల్ల ఇలా రావచ్చును అయితే అటువంటి వారికి సాధారణంగా బుద్ధిమాంద్యము మొదలగునవి ఉంటాయి మీ పిల్లలను 'న్యూరోఫిజీషియన్' కు చూపించండి.

కె. ఆర్. – గుడివాడ

'కాంటాక్టు లెన్సు' గురించి తెలుపగోరుతున్నాను

దృష్టి లోపం వున్నవారికి కళ్ళజోడు వాడటానికి బదులుగా ఈ కాంటాక్టు లెన్సులు కంటిగుడ్డు ముందు భాగంలో అమరుస్తారు.

కొన్ని రోజులు అలవాటుపడ్డ తర్వాత తమంతట తామే వీటిని అమర్చుకోగలుగుతారు. ఇది ద్రవరూపంలో వుంటుంది. కాటుక పెట్టుకున్నట్లుగా పెట్టుకోవాలి.

ఇది వాడటం వల్ల కొందరికి కళ్ళమంటలు, నీళ్ళు కారటం జరుగుతుంది. అయినా దృష్టి లోపం వున్నవారు కళ్ళజోడు ముఖానికి తగినట్లుగా అమర్చుకుంటే సిగ్గు పడాల్సిన అవసరం ఏమున్నది?

కె. ఎస్. పి. – దేవరకొండ

2సం ల క్రితం బాబుపుట్టి బలహీనంగా వుండి తల నిలవక, చేతులు, కాళ్ళు కదల్చక 1 1/2 సం లు బ్రతికి చనిపోయాడు ఆ బాబుని కడుపుతో వుండేటప్పుడు నాకు బి. పి. వుందని చెప్పారు మరల ఇంకొక బాబు పుట్టేడు బాబు వయస్సు 2 నెలలు ఈ బాబు లావుగానే వున్నాడు మెడలు నిలవటం లేదు మాకు భయముగా వున్నది

రెండవ నెలలోనే మెడలు నిలపటం లేదనేది మీ భయాన్ని సూచిస్తోంది. మెడలు నిలవటం దాదాపు 4వ నెల చివర వరకూ జరుగవచ్చును. ఇంతకు ముందు కాన్పులో పిల్లవాడికి 'సెరిబ్రల్ ఫాల్సీ' వచ్చి వుంటుంది. అందు వలన అలా అయింది. ఈ బాబు చేతులు, కాళ్ళు కదల్చగలుగుతున్నాడు కాబట్టి ఏం ప్రమాదం లేదు □

## ఆడపిల్లలు – అనుభవాలు

"చెప్పండి"

"నేను ఇక్కడికి ఉద్యోగం కోసం వచ్చానని అందరికీ తెలుసు. జీతం తీసుకుంటున్నాను గనుక ఉద్యోగరీత్యా ఉద్యోగానికి సంబంధించినంత వరకూ మీరు ఏం చెప్పినా చేస్తాను. నన్ను 'మీరు' అంటూ చేసే నన్ను గౌరవంగా పిలుస్తారనే సంతృప్తితో నా డ్యూటీ నేను భయభక్తులతో శ్రద్ధగా చేసాను. సావిత్రీ అని పిలిస్తే నా మనస్సు మీద మరేదో భావంతో కొట్టినట్టు బాధపడతాను ఉద్యోగరీత్యా నన్ను మీరు శాసించండి. మరోలామాత్రం కాదు" అన్నది

అప్రయత్నంగా కళ్ళల్లో కాస్త కంట తడి

"ఆ ఫోటోగ్రాఫరూ, మనల్ని మోసం చేసిన వ్యక్తి అదొక పెద్ద ముఠా కావచ్చు ఎంతో నేర్పుగా మనిద్దరి ఫోటోల్నీ జతచేసి మరో ఫోటో తీశారు కాని ఫోటోలో ఉన్న ఆత్మీయత నా మనస్సులో లేదు నేను ఆర్థికంగా వెనకబడి ఉండటం చేతనే ఉద్యోగం చేస్తున్నాను గాని, మానసికంగా మీకు చేరువ అవటానికి ఉద్యోగం చెయ్యటంలేదు. ఆ ఫోటోని ఆధారం చేసుకొని ఆ దొంగల ఆరా తియ్యండి కాని, నన్ను కించపర్చటానికి ఉపయోగించకండి ప్లీజ్" అన్నది.

"చూడండి నాకు డబ్బు, ఆస్తి ఉన్నది కనక కాస్త అహంకారం, అనుభవించాలనే కోరికా ఉండటం సహజం. కాని నేను మీరు భయపడుతున్నంత దుర్మార్గుడిని కానేకాదు. మిమ్మల్ని మీ ఇష్టం లేకుండా ఏదో చెయ్యాలనే కోరిక లేనేలేదు ఆడపిల్లను మానభంగం చెయ్యటం, పరాయి స్త్రీని అనుభవించటం కొన్ని నిమిషాల్లో జరిగిపోయే తాత్కాలిక అనుభవం. నాక్కావాల్సింది శాశ్వత అనుబంధం గాని తాత్కాలిక ఉపశమనం కాదు. నాకు మా అమ్మ అంటే గౌరవం, మా నాన్నగారంటే అమితమైన చనువు, సత్యభామ అంటే అమితమైన ఇష్టత. మా చెల్లెలు అనుపమ అంటే ప్రాణం. కాని అది ఎక్కువగా ఎవ్వరితోనూ మాట్లాడదు మిమ్మల్ని చాలా గౌరవప్రదంగా చూసుకుంటాను ఏమాత్రం కించపర్చను సరేనా" అన్నాడు

సంతృప్తిపడ్డట్టుగా చూసింది సావిత్రి మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వెళ్ళింది. ఇంటి దగ్గర వాతావరణం సావిత్రికి అర్థంకాలేదు తల్లీ, తండ్రీ ఇద్దరూ రౌద్రమూర్తులై చూస్తూ నిల్చున్నారు చుట్ట కాలుస్తున్నాడు తండ్రి చుట్ట, వెనక్కు తిప్పి నోట్లో పెట్టుకొని కోపంతో అస్పష్టంగా మాట్లాడుతున్నది తల్లి చేతిలో కవరు పెట్టుకుని మాట్లాడకుండా తల వంచుకొని కూర్చొంది అసిరమ్మ. సావిత్రిని చూడగానే "ఆగక్కడ" అరిచాడు తండ్రి. ఆగింది సావిత్రి

"నువ్వు ఆడి ఆఫీసులో గుమాస్తావా ఆడి ఉంపుడుగత్తెవా నీ సిగ్గోసిరి, సిగ్గుమాలిందానా, నేను పాలమ్ముకు బతుకుతున్నా గాని కూతుర్నమ్ముకు బతుకుతున్నానని నాకు తెల్దే, నంజికోనా, ఆడపిల్ల పెల్లయాక కాపరం సెయ్యాలిగాని ఎబ్బిచారం కాదే. చెప్పు. అబద్ధం సెప్పావో నీ శరమం నొలిసేత్తాను"

"నోర్ముయ్యేయ్, ఊ ఈ రంగం ఆడి. కావు కేకలేత్తే నీ కూతురు పరువు నువ్వే తీసేత్తున్నావురా మగడా దాన్ని అన్నం దిన్నీ. ఆకలయి వొచ్చిందానికి, అన్నం ఎట్టి, ఆ తరవాతనే దాని యాసాలు ఇనేది నువ్వు ముందు అన్నం ముంద కూకో, అన్నం మీద పెమానకం సేసి సెపుదువుగాని పద" అన్నది తల్లి సావిత్రికి అసిరమ్మ ఓ కవరిచ్చింది కవర్లో కాగితం చూసింది సావిత్రి దాంతో పాటే ఒక ఫోటో ఆ ఫోటోలో అభిలాష్ వొళ్ళో సావిత్రి. సినిమా హీరోయిన్‌లా పడుకున్నది ఉత్తరం చదువుకున్నది

నరసయ్యా,

నీ కూతురు భాగోతం చూడు. సావిత్రి చేసేది ఉద్యోగం కాదు చిన్న ఉంపుడుకత్తె హోదాని అనుభవిస్తున్నది

నీ స్నేహితుడు,

భూదేవి సోమన్న

సావిత్రి ఆకలి మాడిపోయింది ఆ రోజున బోజనం చెయ్యలేదు

(ఇంకా ఉంది)

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నుంచి




4 మాసాలు నుంచి




6 మాసాలు నుంచి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ ఢిల్లీ 110008



Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# ఆశయం

ఆ వీధిలో ఆకాశాన్ని చుంబిస్తున్నట్లుగా వున్నాయి ఎన్నో మేడలు ప్రతి భవంతి అత్యంత ఆకర్షణీయంగా, ఎంతో అధునాతనంగా వుంది ప్రతి బిల్డింగ్ కాంపౌండులో కారో జీపో ఏదో ఒక వెహికల్ పార్కు చేయబడి దాని అందాన్ని, హో దాని యినుమడింపజేస్తున్నాది పెద్దపెద్ద డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు నివసించే ఆ లొకాలిటీలో ప్రఖ్యాత నవలా రచయిత్రి వసుంధరాదేవి కూడా ఓ చిన్న పెంకుటింట్లో వుంటోంది.

ఆ స్ట్రీట్‌లోని బిల్డింగులన్నీ దాటుకుని వసుంధరాదేవి ఇంటి ముందు ఆగిందో ఇంపాలా కారు మల్లెపువ్వులాంటి తెల్లని డ్రెస్సు, కళ్ళకు గాగుల్సు ధరించిన ఆరడుగుల వ్యక్తి కారు దిగి చేతి కర్రను వూపుకుంటూ గేటుతీసుకుని లోపల కెళ్ళాడు

ఖరీదైన ఆ వ్యక్తిని సాదరంగా లోపలకు ఆహ్వానించింది వసుందరాదేవి

'నేను నవశక్తి మూవీస్ నిర్మాతని నా పేరు వజ్రాలరావు' తనని తాను పరిచయం చేసుకుని కుర్చీలో కూర్చున్నాడు వజ్రాలరావు

అతడి రాకకు కారణం తెలిసిపోయింది వసుంధరాదేవికి అప్పటికే ఆమె వ్రాసిన రెండు నవలలు సినిమాలుగా తియ్యబడ్డాయి ఈయన కూడ అదే పనిమీద వచ్చివుంటాడనుకుంది

నే నిక్కడికి ఎందుకు వచ్చానో మీ రీ పాటికి వూహించేవుంటారు అయినా నా నోటితో నేను చెప్పాలికదా' పాఠక ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన మీ సీరియల్ నవల 'సమాధి' చిత్రీకరించి తెర కెక్కించాలని నిర్ణయించుకున్నాం అందువల్ల మీరు కదకు సంబందించిన హక్కులు

మా వారిని అడిగి తరువాత చెబుతాను అన్నది వసుంధరాదేవి అతడి మాట పూర్తికాకుండానే

తొందరేమీలేదు సంక్రాంతి వెళ్ళాకనే షూటింగు ప్రారంభించాలనుకుంటున్నాం ఈలోగా మీ అభిప్రాయం ."

తప్పకుండా తెలియజేస్తాను '

సంతోషం మరి నేను వస్తాను కుర్చీలోంచి లేచాడు వజ్రాలరావు

అతడిలా బయటకు వెళ్ళాడో లేదో మరో వ్యక్తి లోనికి ప్రవేశించాడు

చేతులు జోడించి ఖాళీగావున్న కుర్చీని చూపించింది వసుంధరాదేవి

నమస్కారం చేసి కూర్చున్నాడా వ్యక్తి

అత డెవరో, ఎందుకు వచ్చాడో అర్ధంగాక అయోమయంగా చూసిందామె

"నన్ను మీ రెరుగరుకదా?"

లేదన్నట్టు తల వూపుతూ ఔనన్నది వసుంధరాదేవి

'మా పత్రికలో పాఠకుల ప్రశ్నలు జవాబులిమ్మనమని 'అడిగేందుకు మీ' దగ్గర కొచ్చాను. మీరు సరే నంటే ఈ వారం నుండి పాఠకుల ప్రశ్నల్ని , "

"మావారిని అడిగి తరువాత చెబుతాను " అన్నది వసుంధరాదేవి తడీమని.

చాలా సంతోషం తప్పక మా అభ్యర్ధనని అంగీకరిస్తారని ఆశిస్తున్నాను మరి మాకు శలవిస్తే . " చేతులు జోడిస్తూ లేచా డా వ్యక్తి

అంతలోనే తెల్లని గ్లాస్కోపంచె, పాలిస్టరు కల్లీలాల్చీ, కళ్ళకు దళసరి అద్దాలు ధరించిన మరో వ్యక్తి లోపలకొచ్చాడు బట్టతల దబ్బపండులాంటి పచ్చని శరీర ఛాయ, పెద్దపెద్ద కళ్ళు, చూడటంతో నే గౌరవభావం కలిగే వదనం .

నమస్కారం" రెండు చేతులూ జోడించింది వసుంధరాదేవి.

ప్రతినమస్కారం చేస్తూ కుర్చీలో కూలబడ్డాడా వ్యక్తి అతడి రాకకు కారణం వూహిస్తూ అక్కడే నిలబడి దిక్కులు చూడసాగింది వసుంధర

నేను 'రధం కదిలింది' దినపత్రిక విలేఖర్ని మా పత్రిక జన్మదిన సంచికలో ప్రఖ్యాత నవలా రచయిత్రి వసుంధరాదేవిగారితో యింటర్వ్యూ అనే శీర్షిక వుంటుందని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం అందుచేత మీరు శ్రమ అనుకోకుండా నే నడిగే కొద్ది ప్రశ్నలకి.

"అడగండి" అన్న దామె నవ్వుతూ

థాంక్స్ '

ఒకమారు గొంతుక సవరించుకుంటూ 'మీ రెక్కువగా ఎవర్ని ప్రేమిస్తారు?' అడిగాడు విలేఖరి

ముందు నా భర్తని తర్వాత దేవుణ్ణి '

మీరీ స్థితికి ఎదగడానికి ప్రేరణ కలిగించిన వారెవరో తెలియజేస్తారా?"

మావారు '

"భార్యా భర్తల మధ్య ముఖ్యంగా వుండవలసింది

ఒకరిపై మరొకరికి నమ్మకం."

అందరూ ప్రేమ అని అంటారుకదా మరి మీరు వారితో ఏకీభవించరా?

'ఒకరిపై వొకరికి నమ్మకముంటేనే ప్రేమ జనిస్తుంది "

'చాలా సంతోషం మరొక్క ప్రశ్న '

అడగండి

"మీరు రచనలు చేసి ఎంత సంపాదించినా, ఎంత వున్నతస్థాయి కెదిగినా చాలా సింపిల్‌గా వుంటారు అందుకు కారణం '

ఈమారు అతడి ప్రశ్నకు ఆమె మోములో రంగులు మారాయి కాస్త చిరాగ్గా నొసలు చిట్లిస్తూ "నేను ఆశయం కోసం జీవిస్తున్నాను ఆ ఆశయం నెరవేరాలంటే నేను సంపాదించే ప్రతి పైసా దానికెంతో అవసరం" అంది వసుంధరాదేవి

" ఆ ఆశయ మేమిటో ?"

'మీ రడగకూడదు నేను చెప్పకూడదు."

సరే మీ యిష్టం చాలా థాంక్సండి మీ కెంతో శ్రమయిచ్చాను "

"ఫరవాలేదు "

అతడు వెళ్ళిపోవడంతో నే అందరూ కూడబలుక్కుని వచ్చినట్లుగా మరొకతను లోపలకొచ్చాడు

నమస్కారం చేసి కూర్చోమన్నది వసుంధరాదేవి అప్పటికే ఎంతో సేపు నిలబడివుండటంవల్ల కాళ్ళు పీకడంతో తనూ మరో కుర్చీలో కూలబడింది

"నన్ను లక్ష్మీపతి అంటారు ఈ ఊర్లో వున్న సాహితీ సాంస్కృతిక సమితి ఉపాధ్యక్షుణ్ణి

మా వార్షికోత్సవం సందర్భంగా మిమ్మల్ని ఘనంగా సన్మానించాలని సంకల్పించాం మీరు కాదనరనే వుద్దేశంతో . వచ్చిన పని వివరించాడు లక్ష్మీపతి

"మావారిని అడిగి తరువాత చెబుతాను" అంది వసుంధరాదేవి

మంచిది మరి నే వెళ్ళొస్తాను" లేచాడు లక్ష్మీపతి

ఇంటికి వచ్చిన పెద్దమనుషులందరికీ సమాధానాలు చెప్పి అలసిపోయిన వసుంధరాదేవి బరువుగా వూపిరి పీల్చుకుంది

'బేష్ మీ పతిభక్తికి మా జోహార్లు చప్పట్లు చరచి వెటకార మాడుతున్నట్లుగా అంటూ లోపలకొచ్చింది ప్రమీల

ప్రమీల వసుంధరాదేవి ప్రాణస్నేహితులు ఆమె వసుంధరాదేవి పొరుగునే వుండటంవల్ల తనకు ఉబుసుపోనప్పుడల్లా వచ్చి రచయిత్రిగారికి సుత్తేయడం ఆమెకు అలవాటు

'నువ్వెప్పుడొచ్చావే రా కూర్చో ఈమధ్య మరీ నల్లపూసైపోయావు" నిష్ఠూరంగా పలికింది వసుంధరాదేవి

'నే నొచ్చి చాలా సేపయింది నువ్వు వచ్చిన పెద్దమనుషులతో ఏం మాట్లాడుతున్నావో అంతా

చాటుగా విన్నాను నాకు తెలియకడుగుతాను నీ కంటూ ఒక వ్యక్తిత్వం లేదా?" అడిగింది ప్రమీల బల్లమీద వున్న వారపత్రిక తీసి పేజీలు త్రిప్పుతూ

ఎందుకుండదు? నేను మనిషిని కాదా? ఎదురు ప్రశ్న వేసింది వసుంధర

"ఉంటే వాళ్ళతో అలాగేనా మాట్లాడేది? వాళ్ళు ఏమడిగినా మా ఆయన్ను అడిగిచెబుతాను, మావారిని అడిగిచెబుతాను ఛ ఆడవాళ్ళ పరువు తీసేస్తున్నావు' అంది ప్రమీల చీవాట్లు పెడుతున్నట్లుగా

ఆమె మాటలకు జవాబివ్వలేదు వసుంధరాదేవి ఆమె మౌనం ప్రమీలను మరింతగా బాధించింది

'చదువు సంధ్యాలేని కేవలం భర్త దయా దాక్షిణ్యాలమీదే ఆదారపడిన వనిత సహితం వ్యక్తిత్వాన్ని చంపుకోలేదు అలాంటిది నీ కంటూ సంపాదన, పేరు ప్రతిష్ఠలు వున్న నువ్వు కూడా'

ఈమారు ప్రమీలవైపు తీక్షణంగా చూస్తూ నా వ్యక్తిత్వంకోసం మరొకరి వ్యక్తిత్వాన్ని! దెబ్బతీయలేను" అన్నది వసుంధర

మాటల గారడీచేసి నీ వాదనను నెగ్గించుకునేందుకు ప్రయత్నించకు నేను అడిగిందానికి సూటిగా సమాధానం చెప్పు మీ వారిని సంప్రదించకుండా నీకు నీవుగా ఏ నిర్ణయం తీసుకోకూడదా' ఏకార్యక్రమానికి హాజరుకాకూడదా? లేక ఆయనే నీకు ఋటువంటి ఆంక్షలు విధించారా?

ఆమె ధోరణికి కాస్త కలవరపడింది వసుందరా దేవి మనసు ఒక్కక్షణం ఆగి, నువ్వు చాల పొరబడుతున్నావు నువ్వెంత స్నేహితురాలివైనా నా గురించి సంపూర్తిగా తెలియదు ఈనాడు నాకు లభిస్తున్న ప్రశంశల్ని అందుకోవలసిన వ్యక్తి వేరే వున్నారు అంది వసుందర నిట్టూరుస్తూ

ఆశ్చర్యంగా ఆమెవంకచూసింది ప్రమీల

చెబుతా విను' వసుందరాదేవి చెప్పే మాటల్ని అతిశ్రద్ధగా'వినసాగింది ప్రమిల

నేను ఇంటర్ పాసవగానే, అక్కడితో చదువు మానిపించేసి పెళ్ళిచేయాలనుకున్నారు మావాళ్ళు కాకతాళీయంగా విశాఖపట్నం సంబందం తారసపడింది పెళ్ళికొడుకు బారత ట్యుటోరియల్ కాలేజీలో పనిచేస్తున్నాడు జీతం కేవలం నాలుగు వందలు మావాళ్ళకా సంబందం నచ్చలేదు ఐతే మా ఆర్థికపరిస్థితుల దృష్ట్యా నే నతనినే చేసుకుంటాననడంతో మా పెళ్ళికి మరే సమస్యా ఎదురవలేదు

అతను చేసే ఉద్యోగం చిన్నదో పెద్దదో నన్ను





# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

రాజస్థాన్ హైకోర్టు డివిజన్ బెంచి 1985 సంవత్సరం డిసెంబర్ నెల 11వ తేదీన ఒక విచిత్రమైన తీర్పు ఇచ్చారు జైపూర్‌లోని స్టేడియం మైదానంలో గాని లేదా రామలీలా మైదానంలో గాని విస్తారంగా ప్రచారం ఇచ్చి నిందితులను నిర్ణయించిన తేదీన బహిరంగంగా ఉరితియ్యవలసిందని ఆదేశిస్తూ రాజస్థాను హైకోర్టు ఈ తీర్పు ఇచ్చారు తీర్పు నకలు సుప్రీం కోర్టుకు పంపించారు హైకోర్టు తీర్పులో ఉరిశిక్ష జైలు

## బహిరంగంగా ఉరి తియ్యడం అమానుషం

మాన్యుయల్‌లోని నిబందనల ప్రకారం అమలు జరపాలని ఆదేశించారు అయితే ప్రభుత్వం వారు నిబంధనలకు సవరణ చేసినప్పుడు మాత్రమే బహిరంగంగా ఉరి తియ్యాలని తీర్పు ఇచ్చారు జైలు మాన్యుయల్ లోని నిబంధనలలో బహిరంగంగా ఉరి తియ్యడానికి ఏర్పాటు లేదు గనుక ఈ విధంగా ముందు ఇచ్చిన తీర్పును హైకోర్టు మార్పు చేశారు, అని సుప్రీంకోర్టు వారు తమ తీర్పులో పేర్కొన్నారు మొదటి తీర్పులో రాజస్థాన్ హైకోర్టు నిందితులను బహిరంగంగా ఉరి తియ్యవలెనని ఆదేశాలు జారీ చేశారు కాని రాజస్థాన్ ప్రభుత్వం వారి జైలు నిబంధనలలో బహిరంగంగా ఉరితియ్యడానికి ఏర్పాటు లేదు అందుచేతనే రాజస్థాన్ హైకోర్టు వారు తమ మొదటి తీర్పును మార్పు చేస్తూ బహిరంగంగా ఉరి తియ్యడానికి నిబంధనలకు ప్రభుత్వం సవరణలు చేసిన తర్వాతనే, తమ తీర్పును అమలు చెయ్యాలని 1985 డిసెంబర్ 11వ తేదీన ఆదేశాలు జారీ చేశారు కాని బహిరంగంగా ఉరి తియ్యడం అమానుషం అని, అది రాజ్యాంగంలోని 21వ ఆర్టికల్‌కు విరుద్ధం అని సుప్రీం కోర్టు తీర్పు చెప్పారు భారత దేశంలోని ఏ రాష్ట్రము జైలు మాన్యుయల్‌లో ఈ విధంగా బహిరంగంగా ఉరితియ్యడానికి ఏర్పాటు చెయ్యనందుకు సంతోషంగా ఉంది రాజస్థాన్ హైకోర్టు డివిజన్ బెంచి ఇచ్చిన తీర్పు ప్రకారం సవరణ చెయ్యరని మాకు నమ్మకం వుంది జైలు మాన్యుయల్‌లో బహిరంగంగా ఉరితియ్యడానికి ఏర్పాటు చేసినట్టయితే అది భారత రాజ్యాంగంలోని 21వ అధికరణకు విరుద్ధమని సుప్రీం కోర్టు 1985లో తీర్పు చెప్పారు నిందితులు చేసిన నేరం అమానుషం అన్నది నిజం మాకు అప్పీలు చేసుకున్నపుడు ఆ విషయం విచారిస్తాము కాని అమానుషంగా నేరం చేసిన దానికి బహిరంగంగా ఉరితియ్యడం కూడా అమానుషం కనుక రాజస్థాన్ హైకోర్టు ఇచ్చిన ఈ ఆదేశాన్ని పూర్తిగా తొలగిస్తున్నాము– అని ముగ్గురు జడ్జీలు గల సుప్రీమ్ కోర్టు ధర్మాసనం తీర్పు చెప్పారు □

## ఆశయం

మాత్రం ప్రాణప్రదంగా చూసుకుంటారు అతనికి చిన్నప్పటినుండి కథలు వ్రాయిడం హాబీ ఎన్నో కదలు, నవలలు వ్రాసి పత్రికలకు పంపేవారు ఐతే అతడి దురదృష్టమేమిటో మరి పంపిన ప్రతి రచనా క్షేమంగా తిరిగొచ్చేది

అనవసరంగా పత్రికలకు కదలు పంపుతూ పోస్టల్ చార్జీల నిమిత్తం ప్రతి నెలా యాభై రూపాయలవరకు వెచ్చిస్తున్నారు మన లోటు బడ్జెట్టుకు మరింత టెక్సేమో ఆలోచించండి" అన్నానోమారు వుండబట్టలేక దానికి వారేమన్నారో తెలుసా" నాకు చిన్నప్పటినుండి కదలు వ్రాయడమంటే ఎంతో సరదా కనీసం ఒక్క కథైనా పత్రికలో అచ్చయితే చూసి మురిసిపోవాలనుకుంటున్నాను ఎంత శ్రమపడుతున్నా నా ఆశ నెరవేరడంలేదు నేను మణులు మాణిక్యాలు కోరలేదు పదవులు, అధికారాలు ఏనాడూ వాంచించలేదు నాది అతి స్వల్పమైన కోరిక అది నెరవేరాలని అహర్నిశలూ కృషిసలుపుతున్నాను ఇది నీ దృష్టిలో దుబారా అనుకుంటే తప్పక మానేస్తాను

"అప్రయత్నంగా అతని కంటి నుండి నీటి బొట్లు రాలాయి నా కన్నుడు అతడిపై జాలివేసింది నేనే సంపాదకురాలనైతే అతడి రచనల్ని పుంఖాలు పుంఖాలుగా అచ్చువేసేయాలన్నంత కోరిక కలిగింది అందుకే అతని ప్రయత్నాన్ని ప్రతిఘటించలేదు పైగా అతనికి కాస్త సహకరించాలనుకుని అతని రచనలను పెయిర్‌చేయడం మొదలుపెట్టాను."

మా దాంపత్య జీవితంలో మరో రెండు సంవత్సరాలు కాలగర్భంలో కలిసిపోయాయి

పదిగంటలకు భోంచేసి శ్రీవారు స్కూలుకు వెళ్ళగానే చేసేందుకు మరో పనేమీలేకపోవడంతో ఉబుసుపోక ప్రక్కింటివారిని పత్రి కోమారు ఇమ్మని అడిగి పేజీలు త్రిప్పసాగాను అంతలో పోస్టుమాను నా చేతికి కవరేదో అందించి వెళ్ళిపోయాడు

అలవాటు ప్రకారం అతని తిరిగొచ్చిన కద అయివుంటుందనుకుని కవరు చించాను ఆశ్చర్యం నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను నేను వ్రాసిన కద 'అనురాగంలో అపశృతి' దిపావళి కదల పోటీలో రెండువేల రూపాయల ప్రదమ బహుమతి పొందింది నా కద ఏమిటి? బహుమతి పొందడమేమిటి" పొరపాటున పోస్టుమాను ఒకరి ఉత్తరం మరొకరికి యివ్వలేదుకదా" కవరు మిద చిరునామా చూసాను సరిగ్గానే వుంది

ఆ రచన నాదికాదు మహాప్రభో నని అన్నా మావారు వినిపించుకోలేదు పైపెచ్చు ఊరంతా చాటింపువేసారు నన్ను అభినందించడానికి మిరంతా గుంపులు గుంపులుగా వచ్చేసారు నాకు మతిపోయింది ఆ తర్వాత తెలిసింది ఆయన తను వ్రాసిన కదని నా పేరున పత్రికకు పంపారని

నా అదృష్టం మిద నమ్మకమేర్పడిన మావారు వరుసగా కదలు, నవలలు వ్రాసి నా పేరున పంపసాగారు దాంతో నేనో పెద్ద రచయిత్రినైపోయాను అభిమానుల కూడా ఎక్కువైపోయారు వాళ్ళు వ్రాసిన ఉత్తరాలకు కూడా ఆయనే సమాదానాలు వ్రాసిపంపుతారు ఐతే అతనిపేరుమీద అతను వ్రాసిన ఏ చిన్న కదా ప్రచురణకాకపోవడం నా కెంతో మనస్థాపాన్ని కలిగిస్తోందంటే నమ్ము

ఆమె చరిత్రను చెవులు రిక్కించి వింటున్న ప్రమీల ఆమెవంక సానుభూతిగా చూస్తూ అన్నట్లు నువ్వొక ఆశయం కోసం జీవిస్తున్నావ్ ఆ ఆశయం ఏమిటో చెప్పావుకాదు అన్నది

తప్పకుండా చెబుతాను నీకంటె నాకు అప్తులెవరున్నారు రచయితగా ఆయన నెంత కృషి చేస్తున్నా, గుర్తింపంతా నాకే లభిస్తోంది అందుకే 'రవి వెలుగు' అనే వారపత్రిక స్థాపించి ఆయనను సంపాదకునిగా నియమించాలని ప్రతీవారం పత్రిక మొదటి పేజీలో అతని రచన వుండాలని నా అభిలాష పత్రికా స్థాపన సామాన్యమైన విషయంకాదు కనీసం రెండు లక్షల రూపాయలైనా వుండాలి. అందుకే ఈ తాపత్రయమంతా నేను సంపాదించే ప్రతి పైసా నా ఆశయ సిద్ధికోసమే త్వరలోనే మా పత్రిక ప్రారంభింపబడుతుందని నీకు ముందుగా, తెలియజేయడానికి నే నెంతో ఆనందిస్తున్నాను" అన్నది వసుంధరాదేవి చెక్కిళ్ళపై జారిన కన్నీటి చారలను పైట చెంగుతో తుడుచుకుంటూ □



# కళ్ళకు సూటియైనది, చల్లదనమైనది, ఇంపైనది.

## ఐటెక్స్
### కాజల్ సుప్రీమ్

శాస్త్రీయ విధానములో తయారు చేయబడి, ఐటెక్స్ కాటుక కళ్ళను చల్లపరచి కాపాడు చున్నది. ఎటువంటి హానియు కలుగచేయదు. పసిపిల్లల కళ్ళనుకూడ కాపాడుతుంది.




**ఐటెక్స్**
**48** సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబరేటరీస్ మద్రాసు-600 033

చైత్ర పూర్ణిమ వచ్చెను కుమారస్వామి ఆనాడు ధర్మారావును చూచుటకు పోయెను

ధర్మారావు - ఏమోయి కుమారస్వామి! నేను నీకు తీవ్రవాదము నేర్పలేదు. కొన్ని సిద్ధాంతములు మాత్రమే చెప్పితిని నీవా సిద్ధాంతములు చెప్పుటలో నగ్నిహోత్రము కూడా జోడించుచుంటివట? లోకము యాథార్థ్యమునైనను దీక్షణముగా చెప్పిన అంగీకరించదు సుమా! అందుకనియే రాజువలె శాసించు వేదము కన్న భార్యవలె మెత్తగా చెప్పు కావ్యములను సాహిత్యవేత్తలు నిర్ణయించిరి విషయములన్ను మెత్తగా బోధించవలెను. నీవు ఉద్యోగము చేసి బ్రతుకవలసినవాడవు దీనివలన లాభములేదు ఈట్సను దొరను తిట్టితివటేమిటి? కాలేజిలో కొంత ఉపాధ్యాయులను కొట్ట

## (గత సంచిక తరువాయి)

యెవరును గ్రహించరు నీవు దుర్మార్గుడవని చెప్పుకొందురు. లోకములో బ్రదుకవలయునన్నచో నీ ఉద్వేగము నీ మనస్సు, నీ అంతరాత్మ - అది ఒక సంస్థ; నీ యుద్యోగము, అందరితో నీవు మెలగురీతి, ఎట్టివారితో నైనను నవ్వుచు మాట్లాడుట - ఇది ఒక సంస్థ ఈ రెండు రెండుగా బ్రతుకవలయును రెండును గలసియున్న వారి జీవితము సుఖమే నిష్కలుషాంతరాత్మయు, స్వతంత్ర జీవనము గలవారు యోగులు, వారికీ కష్టము లేదు ఈ లోక మార్గములే పరమోత్తమముగా నున్నవనుకొనువారికి లోకయాత్ర చేయుటలో కష్టములేదు మధ్యే మార్గముననున్న నీకిబ్బంది

# నిత్య నూతన సీరియల్

### కవిసమ్రాట్

## విశ్వనాథ సత్యనారాయణ

# వేయిపడగలు

జరిగిన కథ– 58 : రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు దేవదాసి పతిరోజా స్వామిని సేవిస్తూ ఉంటుంది అరుందతి ఆరోగ్యం చెడిపోతుంది రంగారావు బియాట్రిస్ అనే ఒక ఫ్రెంచి వనితకు తీసుకు వస్తాడు హరప్ప నాయడు కోటకు అధికారి అవుతాడు కుమారస్వామి అప్పుడప్పుడు మంగమ్మ ఇంటికి పోతూ ఉంటాడు కుమారస్వామికి ఉద్యోగం పోతుంది ఈట్సన్ కుమారస్వామితో చాలామర్యాదగా మాట్లాడతాడు

బోయినావట!

కుమార - (పండ్లు పటపట గొఱికి) ఎవడా చెప్పినది? ఈట్సను వద్దకు పోదము రండు! ఆ మాటలు నిజమైనచో నేను గోపాలస్వామి గాలి గోపుర మెక్కి అట నుండి క్రిందబడి చచ్చెదను. అబద్ధమైనచో నా చెప్పిన వానిని జెప్పు పుచ్చుకొని దవడ వెంట కొట్టెదను

ధర్మా - బాబూ? అంత గాఢ శీలత్వము పనికిరాదు అబద్ధములు, దౌర్మార్గ్యమును కొంత యోర్చుకొనుట నేర్చుకొనవలయును? లోకమదియే చిలువలకు పలవలు పుట్టించును ఏమి చేయుదుము? నీ విట్లావేశము ప్రకటించెదవేని నిన్ను చివరకు పిచ్చివాడందురు పరమార్థమైన విషయము నీలో ఎక్కువ భాసించుచున్నదని

కుమార మీరు చెప్పినది నిజమే వ్యర్థముగా ఉద్రేకమును ప్రకటించుటవలన లాభము లేదు ఇంక మరల నెచ్చటనైన ఉద్యోగము దొరికినచో అట్లే ఉందును

ధర్మా "ఇంక దొరకదు" వారందరు ఒక సమాజము. నీవింకొకచోట నెచ్చట మరల ప్రయత్నము చేసినను వీరి ప్రశంసా పత్రము తోకవలె వెంటనే వచ్చును ఈ కఠిన న్యాయ పద్ధతియే మూర్తీభవించిన "జీన్వాల్జీను", మహాత్ముడైన "యూగో" మనోంబుజము దీనివలన నెంత బాధ పడినదో! భూతదయ, భూతదయ యందురు దుష్ట సూత్రము లవలంబించి జనుల జీవనాధారములు పాడు చేయుటలో భూతదయ యేమైనదో!

కుమార : ఈ దిక్కుమాలిన గోల కేమి గానీ, స్వామి కల్యాణ మెప్పుడు?

ధర్మా సరిగా నొక్క నెలయున్నది

కుమా అప్పుడు మిషనరీలు విగ్రహారాదన కూడదని యుపన్యాసము లిత్తురట కేషబ్జీ మతానుయాయులు కూడ వారిలో గలిసెదరట

ధర్మా రెండును జరుగవచ్చును కల్యాణములు దేవుని గుడిలో జరుగును ఉపన్యాసములు కాలేజి హాలులో జరుగును కాబోలు!

కుమార ఆ యుపన్యాసములవలన మన మతమునకు నష్టముకాదా?

దర్మా నీ మతమునకా? నా మతమునకా?

కుమార మన మతముల కేమి నష్టము? అజ్ఞానులయిన వారి మతములట

దర్మా వారి మతముల కెప్పుడును నష్టమే హిందువులైనను సరే, మహమ్మదీయులైనను సరే క్రైస్తవులైనను సరే లోకములో దౌష్ట్య మాచరించుచు దేవుడు దేవుడని దొంగ వేషములు వేయువాని కెప్పుడును నాత్మచ్యుతి యున్నది వాని మతము వానికి దుర్వ్యవసాయము లెక్కువ చేయుటకు పనికివచ్చును కాని, వాని యాధ్యాత్మిక ప్రవృత్తి వృద్ధి నొందించుటకు పనికిరాదు సద్విషయమని తనకు తెలిసిన్న దాని నెవ డాదరించడో వాడు పాము వంటివాడు పామునకు రెండు నాలుకలు, వీనికి రెండు పద్ధతులు

కుమార నాగేశ్వరరావుగారు విగ్రహారాదనను తిరస్కరించుచు ఒక గ్రంథము వ్రాసెనట! అది పదివేల ప్రతు లచ్చు వేయించి కళ్యాణములలో పంచి పెట్టుదురట!

దర్మా నీ కా విషయమునందు లగ్నమైనదేమి మనస్సు? తర్క మెరుగనివారికి విగ్రహారాధన మంచిదికాదు పోనిమ్ము

కుమారస్వామి యింటికి పోయెను

శ్యామల మంగమ్మగారు మీ కొరకు వచ్చినది

కుమార ఈమె మూలముగానే ఉద్యోగము పోయినది

శ్యామల మన నోటి మూలముగా

కుమార నీవు కూడ మాష్టరుగారి భార్య వలె తయారగుము

శ్యామల మంగమ్మగారి యింటికి వెళ్ళి రండు!

కుమార నా కాకలి యగుచున్నది

శ్యామల వంట కాలేదు

కుమార ఇప్పుడు పదునొకండు గంట లైనది

శ్యామల వైదికులు పన్నెండైనగాని భోజనము చేయరు

కుమార వైదికు లెవరు?

శ్యామల మీరు కారా?

కుమార ఎవరు చెప్పిరి?

శ్యామల మంగమ్మగారు

కుమారస్వామి మంగమ్మ యింటికి పోయెను

మంగమ్మ ఇంక కళ్యాణ మిరువది రోజు లున్నది

కుమార కాదు, నెలనాళ్ళున్నది

మంగ ఆ పది రోజులు కళ్యాణములు

కుమార . వాలి యేమనుచున్నాడు?

మంగమ్మ పంగనామములు పెట్టినాడు

కుమార ఎవరికి?

మంగ తనకే పెట్టుకున్నాడు చెంగల్రావు వాలిని తెచ్చెను వాలి మొగమున పంగనామము లున్నవి

కుమార వీనికి గూడ మత మిప్పించినారా ఏమి?

మంగ : నియోగులు వైష్ణవులు కావచ్చును

కుమా మీ పని చాల తిక్కగా నున్నది నేను నియోగిని. నేను కోతినా?

మంగ . ధర్మారావుగారి శిష్యత్వ మంగీకరించక ముందే నీ నియోగిత్వము ఇప్పుడు ,వైదికుడవే. లేకపోయిన మనస్సులో నున్నది ప్రతిదియు ఇంత బయటికి చెప్పుదువా?

కుమా : నిజమే నాకు ధర్మారావు గాలి కొట్టినది

మంగ ధర్మారావుగారు నీయంత వైదికుడు కాడు

కుమార నిజమె నా కీ సంగతి నాల్గయిదు నెలలనుండి తెలిసినది ఇదివరకే తెలియవలసినది శివరావుగారి వ్యవహారములో నాయన యెంత లౌక్యము పోయినాడు?

మంగ · అదేమిటి?

కుమార . ఆయన మీకు సమకాలికుడే!

మంగ అదా! అప్పుడు చూచాయగా విన్నాను

కుమార శివరావుగారికి జీవితారంభముననే దైవభక్తి, భక్తి కాదు ఆయనయే శ్రీకృష్ణులైనారు

మంగమ్మ నాకు తోడు దైవభక్తి కూడను!

కుమా కల్యాణములలో విగ్రహారాధన చేయని వారెవరు? జాతితో చేసిననే విగ్రహమా? విగ్రహ మనగా చిహ్నము! సిలువ చిహ్నము కాదా? ఫొటోగ్రాఫులు, చిత్రములు విగ్రహములు కావా? చిత్రములు విగ్రహములు కావా? ప్రతిమలు (స్టాట్యూస్) విగ్రహములు కావా? విగ్రహములను దాటి జ్ఞానము పోనివారు విగ్రహములను తిరస్కరింతురు హిందువులు విగ్రహారాధకులు కారు విగ్రహారాధకులు క్రైస్తవులు, కేషబ్ మతానుయాయులు, బ్రహ్మ సమాజ మతస్థులు! మనమారాధించునది విగ్రహములనుగాదు. దేవాలయములో నున్న దేవునికి మనము ప్రాణ ప్రతిష్ఠ చేసెదము విగ్రహముక్రింద బీజాక్షర సంపుటి యున్నది శబ్ద ప్రపంచమున, నాకృతి ప్రపంచమున, గుణ ప్రపంచమున సమానమైన శక్తులు తీసి యా గుణమునకే బీజము, ఆ బీజమున కాయాకారముగా నిర్ణయించి, నిర్గుణమైన పరబ్రహ్మమును సగుణముచేసి, సగుణమనుట తోడనే యొక శక్తి యొక యాకృతియు నుండును గనుక - దానిని మనము నిర్ణయించి తద్భావము నారాధించు చున్నాము మన మారాధించుచున్నది



విగ్రహమునుకాదు. వట్టి ద్రవ్యము నెవ డారాధించుచున్నాడో వాడు విగ్రహారాధకుడు. ప్రాణ రహితమైన శక్తి రహితమైన చిహ్నమును ధరించువాడు విగ్రహారాధకుడు. సృష్టి ప్రకారము తెలియవలదా విగ్రహ మేదియగునో యేది కాదో తెలియుటట! వెండితో సిలువ చేసినచో వెండి పృథివి ఈ భూతము లన్నింటికి పృథివి రసము నేనువనిషత్తు నోట ననరాదు ఇతర మతముల జ్ఞానమంతవఱకే పోయినది. లేకపోయిన వట్టి సిలువ నేల ధరించును? సిలువ యొక్క భావమునకు చిహ్నమగును ఆ భావమున కా చిహ్నమునకు సంబంధములేదు క్రీస్తును జంపిన సిలువ క్రీస్తునకు చిహ్న మెట్లగును? ఒక భావమునకు చిహ్నము శబ్దము ఆ శబ్దముయొక్క సారము బీజాక్షరము తదక్షరానుగుణమైన ఆకృతి వేరుగా నుండును అది రూపకల్పన సిలువ రూపకల్పన కాదు క్రీస్తు సర్వ మానవాహభదాతయేని అత డభయముద్ర ధరించవలయును తదనుగుణమైన రూపకల్పన యుండవలయును. పంచభూతములు కాని దానినుండి పంచ భూతము లెట్లుత్పన్నము లగునో, ఈ పంచ భూతములు నొకదానిలో నొకటి భావముచేత నెట్లిమిడియున్నవో తెలిసి కొనినగాని ఈ తత్త్వము తెలియదు

కుమారస్వామి నోరు తెఱచుకొని దిగ్భ్రాంతుడై చూచుచుండెను

మంగమ్మ: "యేమట్లు చూచెద?" వనెను.

కుమార ఈ చదువంతయు మీ రెప్పుడు చదివితిరి?

మంగ: అది రహస్యము, నీతో చెప్పద నెవరితో ను జెప్పకుమీ! చెప్పినమాత్రమేమి? ఒక నెల నాళ్ళలో వచ్చు నష్టములేదు.

కుమార చెప్పుడు తెలిసికొందును

మంగ: ప్రతి దిన మర్ధరాత్రమున నేను ధర్మారావుగారి శిష్యురాలను. మూడవ కంటికి తెలియదు.

కుమార: వాలి చూచితిరా! యర్ధ నిమీలితాక్షుడై మీ మాటలు శ్రద్ధగా వినుచున్నాడు. మొత్తానికి కోతిని బాగుచేసితిరి.

గాలిలో పాంచజన్యము సన్నముగా ఊదినట్లు సన్నని ధ్వని కలిగెను గాలి చూరు పాసములయం దూదుచ పోయెను, వాలి దాని ననుసరించును సన్నగా కూసెను మంగమ్మ కోతిని దగ్గఱకు లాగుకొనెను కుమారస్వామి భాష్పాకులిత నేత్రుడయ్యెను

# ఇరువది యైదవ అధ్యాయము

గార్డినరన్న మిషనరీ దొర పులి లేడికై పిల్లి యెలుకకై, బల్లి పురుగుకై, తొండ చీమకై పొంచి యున్నట్లు పసిరికకై చాలసారులు పొంచి యుండెను ఎంత పొంచినను లేడి చెంగున దూకి తన జాతిలో దూరునట్లు, ఎలుక తప్పించు కొన్నట్లు, పురు వెగిరిపోయినట్లు తప్పించు కొనుచునే ఉండెను చీమవలె నిశ్చితముగా తొండ నోటిలో దూఱలేదు. ఒకప్పుడు దొర పసిరికను చేలలో బట్టుకొనవలయునని ప్రయత్నించెను. అతనిని పది యడుగులలో కలిసికొనెను ఒక మహా సర్ప మత్యముగా వచ్చి గార్డినరు దొరను కఱవబోయెను అతడు తుపాకీ తేలేదు తగిలినను దగులకున్నను బ్రేల్చెడివాడే అందుచే నా గండము పసిరికకు తప్పెను. పసిరికకు తనకై అతడు పొంచెనని తెలియదు. పసిరిక యీల వేసెను పాము పరుగెత్తి పసిరిక యొద్దకు పోయెను మనిసిని కరువవచ్చునా అన్నట్లు పాము పడగపై కొట్టి పసిరిక దండించెను. పాము పసిరిక చేతిలో నుండి దొర వైపునకు దూకబోయెను. నోరులేని యా జంతువంతకన్న ఇంకొకరీతి చెప్పలేకపోయెను. పసిరికయు త్రాచు నన్యోన్య పరిష్వక్తులైనంత దొర విభ్రాంతుడై వెడలిపోయెను అప్పటినుండియు అతనికి పసిరికమీదనున్న వాంఛ వృద్ధి పొందెను.

మఱియొకప్పుడు ఫ్రాన్సు దేశము నుండి ఒక దొర వచ్చి ఘంటసాలలోనున్న బౌద్ధ స్తూపములు త్రవ్వగా వెలువడిన పురావాగరకతా చిహ్నిత శిలాఫలకములు మొదలైన వస్తువులు స్థలముకల వారికి, నేబదులు, వందలిచ్చి త్రవ్వుకొని పోవుచుండెను అక్కడా వస్తువులు ఫ్రాన్సులో నీ పురాతన వస్తు ప్రదర్శనవారి కమ్మి, వంద యిచ్చినచోట పదివేలుగా సంపాదించును అతడు ఘంటసాలా ప్రాంతమునకు మూడు నాలుగు సారులు వచ్చెను. ఒకసారి యా ఫ్రాన్సు దేశస్థుడు వాళ్ళన్నియు బంగీలు కట్టి తీసికొని పోవుచుండగా నల్లమందు వర్తకము దొంగతనముగా చేయుచున్నాడనుకొని తెనాలిలో పోలీసువారు పట్టుకొని చివరకు పెట్టెలు పగులగొట్టగా రాళ్ళు బయలు దేరినవి ఆ రాళ్ళు కూడ, ధనమని క్షుద్రోద్యోగులకు తెలియక వదలి పెట్టిరి. ఆ ఫ్రెంచివాడు దేశమంతయు యథేచ్ఛముగా తిరిగెను త్రవ్వినచోట్ల నెల్ల త్రవ్వెను వలదన్న రాజు కన్పించలేదు అమరావతినుండి; నాగార్జున కొండ నుండి బౌద్ధ స్తూపాలు పెల్లగించుకొని లండను వస్తు ప్రదర్శనశాలలో నుంచిరి. దేశీయులు "లవి మదరాసు మ్యూజియంలో నుంచరాదా? ఈ రీతిగా మా దేశమునకు నష్టము జరుగుచున్న"దని గోల పెట్టిరి పత్రికలలో కూడ వ్రాసిరి - సమాధానము చెప్పకపోవుట. చెప్పిన సమాధానము లందికయు పొందికయు లేకయుండుట అంధకార లక్షణము - అదియే ప్రకటింపబడెను ఇంత దేశములోని బౌద్ధ చిహ్నములను తీసికొనిపోవు చుండగా వలదనగలవాడు వలదనడు యథేచ్ఛముగా నవి తిక్కలు కట్టుకొని యెగిరి పోయెను గార్డినరీ దొరను సుబ్బన్నపేట తీసికొనిపోయి పసిరికను జూపించెను. ఫ్రెంచివానికి పసిరికమీద మనసు పోలేదు. పురాతన వస్తు ప్రదర్శనశాల కితడు తగడు. కాంగో ప్రాంతపు టడవులలో నుండి, దక్షిణపు టమెరికా యడవులలో నుండి తెచ్చిన యొక వింత జంతువువలె ప్రదర్శింప వలయునేకాని చరిత్రాత్మకమైన ప్రాముఖ్య మతని కుండదని ఫ్రెంచివాడు చెప్పెను ఆఫ్రికా అడవులలో నుండి ఒక వికృతమైన శాఖా మృగమునో, యొక క్రూర సర్పమునో తెచ్చినందువలన ఎక్కువ లాభముండదు కొంత లాభము లేకపోలేదు. తన పని అది కాదని ఫ్రెంచి దేశస్థుడు వెడలిపోయెను గార్డినరు తనమీద లేకుండపోవు ననుకున్న యీ వ్యవహారము మరల తనమీదనే పడి మనసునకు వేదన కలిగించెను.

ఒకసారి పసిరిక మెట్ట చేలలో నుండి కొళాయి

## ప్రక్షాళనం

శోభలుడిగిన జగతి
క్షోభతో కుళ్ళింది!
శివుడి మూడవ కన్ను
శీఘ్రమిక తెరిపించి
ప్రళయాగ్ని రగిలించి
ప్లోషించి తీరాలి!
దుర్బలుల ప్రాణాలు
దుర్భరం చేస్తున్న
దుష్ట శక్తులనణచి
దురిత దమనం చేసి
పుడమికి పునర్జన్మ
పురడించి తీరాలి!
క్షీరోదకాలతో
క్షితి శుద్ధి చేయించి
ప్రేమ విత్తులు జల్లి
భూమి గర్భందున్ని!
పృథ్వి కడుపున పూలు
పూయించి తీరాలి!
వాత్సల్య వాసంతి
వరదానమిచ్చిన
పుణ్య భూషితమైన
పుష్పాడిని – పుత్తడిని
వెయ్ వేల వాటికల
వెదజల్లి తీరాలి!

–ఏల్చూరి విజయరాఘవరావు

చెరువుల దగ్గఱకుపోయి యా చెరువు కట్టపై కూర్చుండెను. ఇచట నింజనులవద్ద పని చేయుచున్నవారు పసిరికను బెదరించిరి. అతడు, వనమంతయు నరుకబడి, చిన్న తరునికుంజమున దాగుకొని స్వేచ్ఛా విహారము కుదించబడిన సింహము దుఃఖించినట్లు, మిగిలిన నాల్గు మెట్ట చేలకై షరువెత్తి అవి తన సంచారమునకు చాలక, తాను దాగుకొనుటకు నాశ్రయ మీయక, తాను గ్రీడించుటకు ప్రేమ ప్రకటించక తమకు పసిరికకు సంబంధమైపోయినట్లు పలుచబడెను. పసిరిక ఆ బెదిరిపోవుట గార్డినరు చూచెను. పూర్వము సర్పము పసిరికయు చెలిమి కాంద్రగుట భయ హేతువయ్యెను. నేడు పసిరిక బెదరిపోవుట భయ నివారక మయ్యెను. పాము విషము కలదిగదా యని పాములను చంపగల జంతువు లన్నియు విషము కలవి కావు. గృధ్రములు, వాయసములు కుపితములై పాము పోవునపుడు పడగలమీద ముక్కులతో పొడుచును. లేళ్ళు పాములను తిని రోమంథము చేయును. ముంగిసలు సర్పములను విదిలించి చంపును. పాములకు భయపడినట్లు గృధ్రవాయస సర్పములకు భయపడక్కరలేదు. అట్లే పసిరికను మఱల బసిరిక కొఱకు గార్డినరు ప్రయత్నము లారంభించెను. ప్రయత్నములు మునుపటికన్న చురుకుగా నుండెను.

పదిమంది గూడెములోని క్రైస్తవ బాలురతో పసిరికను పట్టుకొన్నచో వంద రూపాయ లిత్తునని గార్డినరు చెప్పెను. వారు "మేము పసిరికను పట్టుకొనము" అనిరి. గార్డినరు "మీకు పసిరికతో నేమి పని? నేను మీకు బోర్డింగు స్కూళ్ళలో ఉద్యోగము నిప్పించెద"నని చెప్పెను వా రుద్యోగము లన్నంతనే యాశపడి "సరే పసిరికను పట్టుకొందు"మని చెప్పిరి. పసిరిక పోవు త్రోవలో రెండు చెట్ల కొక త్రాడు బిగించి కట్టి ఉంచిరి. పసిరిక ఆ త్రాడునకు తగిలి పడపోయినచో అపుడు పోయి మీద పడవచ్చునని, గార్డినరు "త్రాడెందుకు? నల్గురును పోయి పట్టుకొనరాదా?" అనెను వారు సమాధానము చెప్పిరి. "అబ్బో! పసిరిక లేడివలె పరుగెత్తును. చిరుతపులివలె దూకును. పామువలె ప్రాకిపోవును. అతనిని బట్టుకొనరా"దని చెప్పిరి. పసిరిక పోవుచు నా త్రాడునకు తగుల్కొనెను. పసిరిక పడలేదు. చెంగున దూకి దాటిపోయెను. అతడు పోయిన తరువాత వారు, వచ్చి చూచిరి. పొలము ఎలుకలు పసిరిక తాకినచోట నతడు రాకముందే త్రాటిని కొరికి వేసెను. ఉపాయము చెడిపోయినదని వారు నలువురును విచారపడిరి.

గార్డినరు పసిరిక తల్లిదండ్రు లెవరో కనుగొని వారి వద్ద నుండి పసిరికను కొనవలయునని ఊహించెను. అది ప్రయత్న వైఫల్యమునకు హేతువగునేమో అని విచారించెను. రంగమ్మ కుమారుడు చంద్రయ్య నొకసారి పిలిచి గార్డిన రడిగెను. "పసిరికకు దల్లిదండ్రులున్నారా" యని. చంద్రయ్య "తండ్రి లేడు. తల్లి ఉన్నది ధర్మారావుగారికి పసిరికకునేదో చుట్టరికమున్న"దని చెప్పెను. "ధర్మారావు బ్రాహ్మణుడు, పసిరిక శూద్రుల పిల్లవాడు. సంబంధ మెట్లుండు?"నని దొర పరిహసించెను. కాని ధర్మారావు మాట వచ్చినంతనే కొంత అలజడి పడెను.

చంద్రయ్య మరునాడు మధ్యాహ్నము మేనత్తకు భోజనము తీసికొనిపోవుటకై ధర్మారావు గృహమునకు పోయెను. అపుడు ధర్మారావుతో గార్డినరు తన్నడిగిన సంగతి చెప్పెను. ధర్మారావు భ్రూయుగము మధ్య దృష్టి నుంచి విచారించెను. సంగతి యేమో తెలిసికొనవలయునని దూర దూరముగా నాల్గయిదు దినములు పసిరిక ననుసరించెను ఎచట చూచినను పసిరి వంక నొక వాంఛా పూరితమైన దృష్టి ప్రసరించునట్లు కనిపించు




చుండెను. ధర్మారావు చంద్రయ్య ద్వారా కబురంపించెను. "పసిరిక నా తమ్ముడు అతడు మా కాయువుపట్టు. అతని జోలికి మీరు పోయినచో బాగుగా నుండ"దని ఈ కబురు గార్డినరులోని పాలకజాతి భావమును గదల్చెను. దొర పసిరిక నీసారి తప్పక పట్టుకొననే వలయునని నిశ్చయించెను. ఆనాడు తుపాకి చేత బూని నలుగురు మాల పిల్లలను వెంట దీసికొని పసిరిక కోసమని పోయెను. పసిరిక ఒక చేను గట్టుమీద రెండు వైపులా రెండు పాములును, దలమీద, బుజములమీద కూర్చున్న నాల్గు పక్షులుగా కనిపించెను. పిల్లవాండ్రు బెదరిపోయిరి. పక్షులును, పాములును బెదరిపోయెను దొరయు పసిరికయు మిగిలిరి. పసిరిక లేచి పారిపో ప్రయత్నించెను. దొర తుపాకి చూపించెను పసిరిక తుపాకి నెరుగును. అతడచటనే నిస్తబ్ధుడై నిలుచుండెను. అప్పటికి పొద్దుక్రుంక వచ్చినది. ఆ ప్రాంతములలో మనిసి అలికిడిలేదు. ఇంజనులవద్ద పని చేయువారికిని వీరికిని మధ్య చెరువుగట్లున్నవి. ఈ సంగతి ఎవరికి గనిపించలేదు. మసకమసకైన సంజలో పసిరిక గార్డినరు గృహమునకు చేరెను అచట ఒక గదిలో జాగ్రత్త చేయబడెను. ఈ సంగతి గార్డినరు బట్లరునకు కూడ తెలియదు. అతడు బట్లరును గూడ నమ్మడు. సితాసిత వర్ణముల కంతభేదము మరునాడు ధర్మారావు పసిరిక కోసము వెదకెను. అతడు కనిపించలేదు. పొలాలన్నియు వెధకెను పాములన్నియు ధర్మారావును చూచి, హరిపొక దూరమునుండి జాలికనులతో చూచెను. పక్షులు ధర్మారావునకు చేయి యందు అంతదూరములో నిలుచుండి కూయసాగెను. అతడు మంగ యింటికి పోయి పసిరికను గూర్చి అడిగెను! ఆమె భయము ప్రకటించు నేత్రములతో "నాయనా! రెన్నాళ్ళయినది పసిరిక యింటికివచ్చి. మాగాని బలిసిన తరువాత పసిరిక యింటికి రాని రోజు లేదు. నేను వాడు వచ్చునులే అని ఊరకుంటిని. నీవు పోయి వెదకి తెచ్చి పెట్టవలయు ననెను. ధర్మారావు విచారించెను. గార్డినరు పసిరికను దొంగిలించిన మాట నిజమే! వాని యింటికి పోవుటయెట్లు? పసిరికను తెచ్చుటయెట్లు?

ఆనాడు రాత్రి పదిగంటలకు హరప్పనాయడు గార్డినరు వద్దకు పోయెను అతనితో కొంత సేపు మాట్లాడి గార్డినరు కొన్ని పుస్తకములు కావలయుననగా నాయడు గుఱ్ఱపు బండి మీద గార్డినరును కోటకు తెచ్చెను. నాయడు దాం వెంట చూచుచుండెను. ధర్మారావు త్రోవ పరిశీలించు చుండెను. రాత్రి పదునొకండు గంటలయ్యెను. గ్రామమంతయు నిశ్శబ్ద మయ్యెను. ఊరిలోని విద్యుద్దీపములు వెలుగుచుండగా చంద్రయ్య, ఒక స్తంభమునుబట్టి కదలించెను. ఆ వరుసదీపము లన్నియు ఆరిపోయెను. ఈ పని సుబ్బన్న పేటలో

# వేయిపడగలు

పిల్లలందరును చేయుచుందురు, దారిలో ఎవరును చూడలేదు. మఖాల వట్టి గుఱ్ఱపుబండి గార్డినరింటి దాక పోయి తిరిగివచ్చెను. కాసావాడు బట్లరును బిలిచి దొరగారు వచ్చిరని చెప్పెను. బట్లరు "దొరపోయి పండుకొనునులే" అని తాను నిదుర పోయెను.

ధర్మారావు గార్డినరున కెదురుగా వచ్చి "అయ్యా! పసిరిక వింత జంతువుకాదు అతడు మా పైరుపచ్చ. మీరు మా పంచముల నందరును మీ మతములో కలుపుకొనవచ్చును. మా మతము చెడినను మాకు తిండి చెడరాదుకదా! మేము బ్రదుకనైన వలయుగదా! పసిరికను వదలిపెట్టు" మనెను. గార్డినరు తెలియనివానివలె నటించి "పసిరికను నేనే మెరుగుదును!" ననెను.

ధర్మారావు "నేను మీమీద కేసుపెట్టవలసి వచ్చును!

అన్యాయముగా మనిషి నెత్తుకొనిపోయినట్లుగా, మీమీద ఋజావు చేసెదను. మీరు తెల్లవారు వరకు నిచటనే ఉండెదరు. మిమ్ము కోటలో బిగించి యుంచెదను. ఫిరంగులు వచ్చి కోటకోట పెల్లగించుకొనిపోయినను సరే పసిరిక మాయధీనము కాకముందు మీరిటనుండి పోలేరు" అనెను. గార్డినరు విచ్చల విడిగా ధర్మారావును తిట్టెను. ధర్మారావు "మీరు తిట్టవచ్చును. నేను మఱల ఏమియు అనను. కాని, పసిరికను మాత్రము తమ రప్పగించక తప్పదు" అనెను. తెల్లవార వచ్చెను. గార్డినరు పోవలయునని చేసిన ప్రయత్నములు నాల్గయిదు విఫలమయ్యెను. గార్డినరు యోచించెను. "న్యాయము ధర్మారావు దెసనే ఉన్నది. న్యాయస్థానమునకు పోయినను తాను గెలుచునది లేదు". ధర్మారావుతో ఇట్లు చెప్పెను. "పసిరికను రేపు ప్రొద్దున్న వదలి పెట్టెదను. మీరు నన్ను వదలి పెట్టుడు.

ధర్మారావు . మీరును రేపు ప్రొద్దుననే వదలి పెట్టబడెదరు.

గార్డినరు : నేను పసిరికను వదలను

ధర్మా : మేము మిమ్ము వదలము.

గార్డినరు : నేను పసిరికను బట్టుకొన్నట్టు, ఋజావులేదు.

ధర్మా : మేమును మిమ్ము పట్టుకొన్నట్లు ఋజావులేదు. మీ రిచ్చటికి వచ్చుచుండగా ఎవరును చూడలేదు. మివమ్మను దింపినట్లు వట్టి బండియు ఇంటికి పోయివచ్చెను. మీ బట్లరుతో మీరు దిగినట్లు కూడ, చెప్పివచ్చితిమి – గార్డినరు విచారించెను– "మీరు నన్ను ఖైదు చేయుటకు మీకు హక్కులేదు. పైని ప్రభుత్వమున్నది.

ధర్మా : మేము రాజద్రోహులము కాము. నేను సహాయనిరాకరణ వాదిని గూడకాను. నాకు జాతి ద్వేషము కూడ లేదు. పసిరికను వదలిపెట్టించుడు. మీ యందు కూడ నాకు ద్వేషములేదు. మిమ్ములను వస్తుప్రదర్శనశాలయన్న వ్యామోహము పీడించు చున్నది. మీరు దయదలచ వలయును. పసిరిక వలన మీకేమి ప్రయోజనము? అతడొక పేదరాలి కొడుకు. ఒక్క కాగితము వ్రాసియిండు. బట్లరునకు చూపించి మా పిల్లవానిని మేము తెచ్చుకొందుము– "సూర్యోదయ మయ్యెను. గార్డినరు "నిజమే, ఈ వస్తు ప్రదర్శన శాలా వ్యామోహము నన్నెందుకు పట్టుకొన్నది? వారంత వినయముగా బ్రసంగించుచుండిరి. నేనేల పసిరికను వదలరా" దని ఊహించి కాగితము వ్రాసియిచ్చెను. అది బట్లరునకు చూపించి పసిరికను తెచ్చుకొనిరి. పసిరికయు చంద్రయ్యయు కోటలోనికి వచ్చిరి. చంద్రయ్య దొరకు సలాము చేసెను. పసిరిక పామువలె గుడుసులు వడెను. గార్డినరు పోవుటకు ప్రయత్నించెను. మరల కాసావాండ్రడ్డగించిరి. దొర "ద్రోహమా" అనెను

ధర్మారావు "ద్రోహమే! మీరు చేసిన పనికి మిమ్ము చూడు డేమిచేసెదమో" అని బెదరించెను. దొరకు కోపము తాడి ప్రమాణమున వచ్చెను. ఇంతలో గంధము, తాంబూలము, క్రొత్త బట్టలు తెచ్చి హరప్ప గార్డినరుకు కట్టబెట్టెను. ధర్మారావు నవ్వెను, గార్డినరు దిగ్భ్రాంతుడై పోయెను

ధర్మారావు "మీరు మా పైరుపచ్చల నేల ఎత్తుకొని పోవలయును? మీరు కూడ ఇచటనే ఉండి మా కాపులతోడి పాటు కాపులై పోవలయును. మీరాలాగును, టోపియు తీసివైచి మాధోవతియు, ఉత్తరీయమును ధరించుడు" అనెను. గార్డినరు ధరించెను. అందరును గలసి గార్డినరింటికి ప్రయాణమైరి. హరప్పనాయడు గార్డినరుకు నాలుగు వేల రూపాయలొసగెను, గార్డినరు "ఇది దేని" కనెను. "పసరిక నమ్మినచో మీకింతకన్న ఎక్కువ వచ్చునా? వచ్చినను దయచేసి దీనిని మాత్రమే యంగీకరించుడు" అని, హరప్పనాయడనెను. గార్డినరు ధనము వద్దనెను ధర్మారావు బలవంతముగా ధనమతని జేబులో నుంచెను. దొర పసిరికకు షేక్‌హాండు ఈయబోయెను. పసిరిక పసిరికపామువలె వెనుకకు పోయి మల్లె పొదలో దూరెను. అందరును నవ్విరి. దొరను సాగనంపిరి. ధర్మారా వందఱకన్న వెనుకనుండెను. పసిరికవచ్చి అతనిని పట్టుకొని వ్రేలాడెను. ధర్మారావు దొరతో "మాతప్పులు క్షమింప వలయును. పసిరిక మాకంత ప్రాణము" అనెను. పసిరిక ధర్మారావును కౌగలించుకొనెను. గార్డినరు "మీ దేమియు తప్పులేదు. నాదే తప్పు. మీరే నన్ను క్షమించవలయు" ననెను ఒకరి వద్ద నొకరు సెలవు తీసికొనిరి. గార్డినరు మహానందనిమగ్నుడై "యింకను వీరిజాతిలోని శక్తి చావలే" దని సంతోషించెను.

–(ఇంకా ఉంది)

# ఫాలాక్షుని డైరీ

## హత్యకు దారి తీసిన తగాదా!

గుంటూరు అశోక్‌నగర్‌లో కట్టా వెంకటకృష్ణారావు, అత్తలూరి అమరేశ్వర్రావు, ఎల్లంకి శ్రీను అనే ముగ్గురు విద్యార్థులూ ఒకే గదిలో వుండి చదువుకుంటున్నారట. ఏదో విషయంలో వచ్చిన తగాదాతో కృష్ణారావుకి కోపం వచ్చి ఆ రాత్రి వరకూ వేచి, నిద్ర పోతూన్న అమరేశ్వర్రావును కత్తితో తొమ్మిది సార్లు పొడిచి, అడ్డొచ్చిన శ్రీనును కూడా తీవ్రంగా గాయపరిచాడట. అమరేశ్వర్రావు ఆసుపత్రిలో చనిపోయాడట.

## తెల్లటోపి, నల్ల కళ్లజోడుపై ఎం.జి.ఆర్. అభిమానులకు మక్కువ!

యం. జి. ఆర్. అభిమానులు ఆయన తెల్లటి టోపిని, నల్ల కళ్లజోడును మరింత అభిమానించే వారట. తన అభిమానులు అభిమానించే ఆ రెండు వస్తువులనూ ఆయన మరింత అభిమానించే వారట. ఎవరికి, ఎటయిములో, ఎక్కడ దర్శన మిచ్చినా ఆయన వాటితో నే దర్శనమిచ్చేవారట. అవి లేకుండా ఆయన చాలా తక్కువసార్లున్నారట. ఆ కారణంగా ఆ వస్తువులను ఆయన మృతదేహాని కలానే వుంచి, వాటితోనే ఆయన అంతిమయాత్ర ముగిసిందట.

## ఎం. జి. ఆర్. అభిమానుల కోరిక!

యం. జి. ఆర్ మృతదేహాన్ని లెనిన్ మృతదేహంలా రసాయన ద్రవంలో వుంచి, ఆయన అభిమానులు తరతరాలూ ఆయన శరీరాన్ని చూసేట్టు చేయాలని ఆయన రసికులు పట్టు పట్టారట. దాంతో రష్యా శాస్త్రవేత్తలనీ విషయంలో సలహా తీసుకునే చర్యలలో అసలు వ్యక్తి చనిపోవడానికి ముందే కొన్ని చర్యలు అవసరమనీ, ఆయన చనిపోయి చాలా సేపయిన తర్వాత యీ రకంగా చేయడం కుదరదనీ, శరీరం నిలవదనీ విజ్ఞాన శాస్త్రం చెప్ప దంతో అభిమానులు ఆ పట్టువదిలేశారట.

## గ్యాసు లీకయి తల్లి, కొడుకుల దుర్మరణం!

తిరుచ్చి భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్‌లో పనిచేస్తున్న వో ఇంజనీరు గారి యింట్లో వంటగ్యాసు లీకయి, అది తెలీక తమ గదిలో లైటువేసిన ఆయన భార్య 30 ఏళ్ళ లక్ష్మి, 6 ఏళ్ళ గోకుల్ మంటలు పెనవేసుకుపోయి చనిపోయారట!

## కదిలే దీవి!

ప్రపంచంలో అంటార్కికాలోని పోపడా అనే దీవి కదులుతూ వుంటుందట! సముద్రంలో వున్న ఈ దీవి గత పదిహేను సంవత్సరాలలో 24 కిలో మీటర్ల దూరం జరిగిందట! మరి యే యితర దీవీ ఈ మాదిరిగా జరిగినట్టు చరిత్ర లేదట!

## జపాను స్త్రీల అలవాటు!

జపాను స్త్రీలు తాము లోపలధరించే బట్టలు; బాడీలు, లోపల పరికిణీల వంటివి పదిమంది తిరిగేచోట, చూసేచోటా ఆరెయ్యరట. అవి రాత్రుళ్ళు వుతికి కరెంటు డ్రయ్యర్లతో ఆరేలా చేసుకుంటారట!

## ప్రియునితో జైలుపాలు!!

విరుధునగర్ రైల్వే ఇనస్పెక్టరు 40 ఏళ్ళ నాగన్ భార్య పార్వతి అదేవూరుకు చెందిన రామస్వామి అనే అతనితో రహస్యప్రేమాయణం పెట్టుకుందట. ఈ




విషయం తెలిసిన నాగన్ భార్యను మందలించేసరికి ఆమెకు కోపం వచ్చి తన ప్రియునికి చెప్పిందట. కోపం వచ్చిన ప్రియుడు నాగన్ పీకపిసికి చంపి, రైలుపట్టాలమీద పారేశాడట. అంతా ఆయన ఆత్మహత్య చేసుకున్నాడనుకున్నారట. పోస్ట్ మార్టమ్‌లో ఆయన పీక నులమడంవల్ల చనిపోయినట్టు తేలి విచారణలో అసలుకథ బయటపడి పార్వతి, ఆమె ప్రియుడు రామస్వామి జైలుపాలయ్యారట!

## చీకూ చింతాలేని 101 ఏళ్ళ జీవితం!

స్కాట్లండ్‌కు చెందిన బామెరినోలో నివసించిన కేథరిన్ నీల్ అనే ఆమె 101 ఏళ్ళ 7 నెలలు బ్రతికిందట! 1792 – 1894 మధ్యకాలంలో బ్రతికిన ఈమె ఎన్నడూ జ్వరంన చీదనైనా చీదలేదట – హబ్బ ఏ గొడవా, బాధా, రోగం, రొచ్చు లేకండా అన్నాళ్ళు బ్రతకడం బోరుకాదా!

## పోలీసు సోదాలో పట్టుబడ్డ మత్తుపదార్థం!

అనంత్‌నాగ్ నుంచి పాథాన్‌కోట్‌కు వెళ్తున్న వో లారీని ఆపి సోదాచేస్తే 53 కిలోల ఛరస్ (మత్తుపదార్థం) దొరికిందట. దీని కిమ్మత్తు 25 లక్షల రూపాయలట. పోలీసుల కా లారీ విషయం ఎవరో శ్రేయోభిలాషులు ఫోనుచేసి చెప్పారట.

## పిడుగుపడి స్త్రీ దుర్మణం!

తంజావూరు వలంపూరులో 58 ఏళ్ళ ధనభాగ్యమ్ అనే ఆవిడ పక్కింటి 30 ఏళ్ళ పళనియమ్మాళ్‌తో మాట్లాడుతూండగా వురుములూ మెరులూ వచ్చాయట. దాంతో వో పిడుగుపడి ధనభాగ్యమ్ అక్కడికక్కడే (మార్చి 19) చనిపోయిందట!

## అల్లుడి ఆవేశానికి తల్లి కూతురు బలి!

పుదూరుపట్టి పంచాయతి ప్రెసిడెంటు మారియప్ప గవుండరుకు తన భార్య చిన్నమ్మ మీద కోపంవచ్చి, కొడవలి తీసుకుని ఆమెను నరకబోయే సరికి ఆమె తల్లి తంగమ్మ అడ్డం వచ్చిందట. అతని ఆవేశానికి ఆ యిద్దరూ బలయిపోవడమేగాక, అతని కూతురుకు కూడా తీవ్రంగా గాయాలయ్యాయట. దిండిగల్లు సెషన్సుజడ్జి ఈ మారియప్పకు మరణశిక్ష విధించాడట!

## హైకోర్టు జడ్జి ఆత్మహత్య!

టోక్యో హైకోర్టుజడ్జి అకీరా తకయామాకు యిటీవల మనస్థిమితం తప్పి, ఆసుపత్రిలో చికిత్సపొంది యిటీవలే మళ్ళీ కోర్టుకు హాజరయ్యారట. మొన్న ఫిబ్రవరి 24వ తేదీన వున్నట్టుండి కోర్టు, 16వ అంతస్థునుంచి దూకి, ఆత్మహత్య చేసుకున్నారట. గత పదేళ్ళలో ఆత్మహత్య చేసుకున్న జడ్జీలు ఈయనతో కలిపి నలుగురట – ఎందుకు చెప్మా!

## జయలలిత చెపుతున్న రహస్యాలు!

మధురలో వో మీటింగులో పట్టీకున నటి జయలలిత మాట్లాడుతూ ఎం. జి. ఆర్. పోయాక తానూ ఆత్మాహుతి చేసుకోవాలనుకున్నట్టు, కానీ ఎం. జి. ఆర్ ఆశయసాధనకై తా నాపని విరమించుకున్నట్టు ప్రకటించి, ఎం. జి. ఆర్. భార్య జానకి ఫార్టీవారు ఎం. జి. ఆర్. చనిపోయాక ఆయన వేలిముద్రలు కొన్ని ముఖ్యమైన పత్రాలమీద నొక్కుకున్నారని నొక్కివక్కాణించారట

# అమ్మమనసు!

## శారదా అశోకవర్ధన్

"శరత్!... శరత్!" పరుగెత్తుకుంటూ వొచ్చి పిలిచింది, రోడ్డు దాకా వొచ్చి జగదాంబ సూటుకేసు చేతిలో పట్టుకుని, పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ, వెనక్కి తిరిగి చూడకుండా, తనని కాదన్నట్టు నడుస్తూ పోతున్నాడు శరత్!

"శరత్! శరత్!" ఇంచుమించు పరుగెట్టినట్టుగా నడుస్తోంది జగదాంబ.

శరత్ పక్కనున్న ఆటో ఎక్కి 'పోనీ' అన్నాడు.

"శరత్!" అని పెద్దగా అరుస్తూ పిలిచింది జగదాంబ అది రోడ్డు అన్న సంగతి కూడా మర్చిపోయి. ఆటో ఆమె గుండెల మీదుగా పోతూన్నట్టుగా అనిపించింది. గుండె ముక్కలైనట్టనిపించింది కళ్లు తిరిగి కనుగుడ్లు రోడ్డు మీద పడిపోయినట్టుగా అనిపించి, చీకటికి రోడ్డు మీద ఏమీ కనిపించక ధభాలున అక్కడే పడిపోయింది జగదాంబ

"ఎవరో పాపం! ఉన్నట్టుండి పడిపోయింది "

ఎవరో పిలుస్తూ పిలుస్తూ పరుగెత్తింది ఆ అమ్మాయి వినిపించుకోకుండా ఆటోలో వెళ్లిపోయాడు అంతే! ఈమె పడిపోయింది "

"వెంట ఎవ్వరూ వున్నట్టు లేదు ఇప్పుడేం చేద్దాం ఆసుపత్రికి తీసికెళ్లి చేర్పిద్దామా?" మరో కంఠం

"అఁ. మనకెందుకు? ఋట్టుకుంటే ముప్పులొస్తాయ్ మరో గొంతు

"అయ్యో! నన్ను ఆసుపత్రికి తీసికెళ్లకండి ఇంట్లో పడెయ్యండి" అని చెప్పాలనుకుంది నోట మాట రావడం లేదు కళ్లు తెరిచి వారికేసి చూడడానికి ప్రయత్నం చేసింది చుట్టూ జనం మసక మసకగా కనిపిస్తున్నారు పెదవి విడడం లేదు మాట్లాడడానికి!

పాపం! ఆడకూతురు! ఆసుపత్రిలో చేర్పించేసి పోదాం దిక్కులేని దానిలా వుంది" అంటూ కొందరు ఒక ఆటో ఆపి ఆమెని మోసుకుని ఆటోలో పడుకోబెట్టారు మెల్లగా!

ఆసుపత్రిని తలుచుకుంటే ఆమె గుండె మరీ వేగంగా కొట్టుకోవడం మొదలెట్టింది. అనుకోని ఈ సంఘటనకి ఒళ్లు జలదరించి పోతూంటే, శరత్ జ్ఞాపకం వొచ్చి కళ్లు వర్షించాయి

ఆటోలో నుంచి ఒకతను దిగి ఆసుపత్రి అవుట్‌పేషంటు డాక్టరుకి చెప్పి స్ట్రెచ్చరు తెప్పించి ఆమెని దింపి లోపలికి పంపించి, వెళ్ళిపోయారు. నర్సులు ఆమెని లోపల పడుకోబెట్టారు. ఆసుపత్రి వాతావరణం చూడగానే, నిజంగానే సొమ్మసిల్లి పోయింది ఆమె. "నీ పేరు...".. తట్టి తట్టి కొట్టి అడుగుతూన్న నర్సుతో మెల్లగా చెప్పింది... జ..గ..దాం..బ.." అని.

బి. పి. బాగా ఎక్కువగా వుందని అడ్మిట్ చేసుకున్నారు ఆసుపత్రిలో. కళ్లు తెరిచి చూసిన జగదాంబ వార్డులో మంచం మీద పడుకునుంది. పక్క మంచం పేషంటు దగ్గరున్నావిడ, జగదాంబను చూసి, "హమ్మయ్య! ఇక ఫరవా లేదు. మూడు రోజుల తరవాత ఇప్పుడు కళ్లు తెరిచి చూశారు అంది. నర్సు గబగబా వొచ్చి నాడి చూసి నవ్వుతూ, "ఓ.కే! ఫరవాలేదు!" అంది

జగదాంబ కూడా సమాధానంగా చిరునవ్వు నవ్వింది

"మీదే వూరు?" అడిగింది నర్సు.

"మీ ఇల్లెక్కడ?"

"హిమాయత్‌నగర్!"

"మీరు రోడ్డుమీద పడిపోతే ఎవరో పట్టుకొచ్చి యిక్కడ చేర్పించారు. మీ వాళ్ళెవరూ రాలేదు బహుశ చేర్పించినవాళ్ళకి మీ యిల్లు తెలీదు. మీ వాళ్ళకి మీ రిక్కడున్నట్టు తెలీదు మీ వాళ్ళకి చెప్పమంటారా?"

"ఒద్దు! నేనే వెళ్ళిపోతాను" కంగారుగా అంది జగదాంబ!

"మీరు వెళ్ళేస్థితిలో లేరు. కనీసం రెండుమూడు రోజులైనా వుండాలి. పేపర్లో ప్రకటించినట్టున్నారు మీగురించి."

జగదాంబ కంగారుపడుతూ "ఏమని?" అడిగింది.

"ఫలానా పేరుగల వ్యక్తి, ఫలానాచోట పడిపోతే ఆసుపత్రిలో చేర్పించారు. బంధువులూ, కుటుంబ సభ్యులూ ఫలానా ఆసుపత్రికొచ్చి ఆమెని చూసుకునివెళ్ళొచ్చు" అని.

జగదాంబ కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. ఏదో అవమానంగా ఫీలయింది. సిగ్గుతో బిక్కచచ్చి నట్టనిపించింది. కానీ వెంటనే ఏదో స్ఫురించినట్టయి, కళ్ళు కాంతివంతమయ్యాయి "సిస్టర్!" అని పిలిచింది.

"ఏమిటి?" సిస్టర్ నవ్వుతూ దగ్గరికొచ్చింది.

"నాకోసం ఎవరైనా వొచ్చారా?" అడిగింది ఆత్రంగా.

"లేదు" అంది సిస్టర్.

"మీ ఫొటో, మీ పేరూ రెండూ పేపర్లోకూడా వేయించాం. పోలీసురిపోర్టు రాగానే!"

"అవునా?" కంగారుగా లేచి కూర్చోబోయింది జగదాంబ.

ఒళ్ళు తూలినట్టయి లేవలేకపోయింది.

"లేవకండి. పడుకోండి. ఏం కావాలి మీకు?" అడిగింది మెల్లగా వెల్లకిలా పడుకోబెడుతూ నర్సు.

"ఏం వొద్దమ్మా! నాకోసం ఎవరూ రాలేదా?" దుఃఖాన్ని దిగమింగుకుంటూ జాలిగా నర్సు కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

ఆమె మాటల్లో, ఆమె చూపుల్లో. ఆమె ఎవరికోసమో ఎదురుచూస్తూ తపించిపోతోందని అనుకుంది సిస్టర్.

"ఎవరూ రాలేదండీ! మీరు ఎవరికోసం ఎదురు చూస్తున్నారు?" సందేహంగా అడిగింది.

జగదాంబ మొహంలో బొట్టూ, కాటుకా ఏమీ లేకపోవడమూ, మట్టెలూ, మంగళసూత్రాలూ ఏమీ లేకపోడంవల్ల ఆమె విధవరాలో అవివాహితో అర్థంకాక అలా అడిగింది.

జగదాంబ సిస్టరడిగిన ఏ ప్రశ్నకీ సమాధానం చెప్పలేదు. గట్టిగా కళ్ళుమూసుకుని ఆలోచనల్లో పడిపోయింది అదిచూసి సిస్టర్ ఆమెని యింకే ప్రశ్నా అడగకుండా వెళ్ళిపోయింది.

రోజులు గడుస్తున్నాయి. జగదాంబ బి. పి. తగ్గడంలేదు. ఆసుపత్రివారిచ్చే భోజనం ముట్టడంలేదు. ఎవ్వరితోటీ మాట్లాడడంలేదు. ఎప్పుడూ శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలోచిస్తూ పడుకునుంటోంది. డాక్టర్లూ, నర్సులూ, ఇరుగుపొరుగు పేషంట్లు తాలూకువాళ్ళు ఎవ్వరితోటీ మాట్లాడదామె. ఆమె మనస్తత్వం ఎవ్వరికీ అర్థంకావడంలేదు. 'సైక్రియాటిస్ట్' వొచ్చి చూసివెళ్ళాడు ఆమెనిండా గుబులునిండివుందనీ, ఎవరికోసమో ఆమె తీవ్రంగా ఎదురుచూస్తోందనీ, ఆ నిరాశవల్లే ఆమె మాట్లాడలేకపోతోందనీ, ఆమె ఎదురుచూసేవ్యక్తి కనిపిస్తే తప్ప ఆమె పరిస్థితి మారడం కష్టమనీ చెప్పివెళ్ళాడు.

మామూలుగా అయితే ఈ ధర్మాసుపత్రిలో కానీ ఖర్చు చెయ్యని యిటువంటివారిగురించి ఎవరూ పట్టించుకునుండేవారుకారు. కానీ సిస్టర్ లూసీకి ఎందుకనో జగదాంబపైన ఒకరకమైన జాలి ఏర్పడి ఆమె డాక్టర్లందరికీ, జకదాంబ తనకి దూరపు బంధువనీ, చాలాకాలం తరవాత కలుసుకోవడం వల్ల మొదలు గుర్తుపట్టలేదనీ ఏవో కథలుచెప్పి, పెద్ద డాక్టర్లందరిచేత పరీక్షచేయిస్తోంది.

దాదాపు పది రోజులు గడిచిపోయాయి. ఈ




పదిరోజుల్లోనూ ఆమె ఒక్కమాట కూడా ఎవ్వరితో మాట్లాడలేదు. మతిస్థిమితం పోయిందేమో, మెదడువ్యాధుల ఆసుపత్రికి పంపించాలని కొందరు డాక్టర్లు అభిప్రాయపడ్డారు.

సిస్టర్ లూసీ పేషంట్లందరికీ టెంపరేచరు చూసి, మందు లివ్వవలసిన వాళ్ళందరికీ మందులిచ్చేసి, తన డ్యూటీ అయిపోవడంతో, జగదాంబ మంచం దగ్గరకొచ్చి "వెళ్ళొస్తాను. నా డ్యూటీ అయిపోయింది" అని చెప్పింది. జగదాంబ మామూలుగా అయితే ఉలుకూ పలుకూలేకుండా వూరుకునేదే. కానీ అలాకాక సిస్టర్ చెయ్యిపట్టుకుని "నాకోసం ఎవరూ రాలేదా?" అని అడిగింది.

"లేదు" అని సిస్టర్ లూసీ తలూపి, "మీ అడ్రస్ చెప్పండి. మీవాళ్ళని నేను పిల్చుకొస్తాను" అంది. జగదాంబ సమాధానం చెప్పలేదు.

సైగచేసి చూపించింది, కాగితమూ, పెన్సిలూ తెమ్మని. లూసీ గబగబా వెళ్ళి డాక్టరు రూముతో నుంచి కాగితమూ పెన్సిలూ తెచ్చియిచ్చింది.

"బాబూ శరత్! అమ్మ మనసు నీ కర్థంకాలేదురా! పెళ్ళినాటినుంచీ నువ్వు భూమిమీద పడేవరకూ కష్టం ఎక్కువ తీసుకురాలేదని, నన్ను రాసి రంపాన పెట్టారు అత్తమామలు. ఏందు చూడాలిననికూడా దయా దాక్షిణ్యాలు లేకుండా గొడ్డులా చాకిరీ చేయించుకుని పట్టెడన్నం పెట్టకుండా మలమల మాడ్చి చంపినా నీమీద ప్రేమతో ఆత్మహత్య చేసుకోకుండా బతికాను. కానీ ఆ వినాశులో పరాశులో నువ్వు పుట్టినా, ను వ్వేడుస్తూవుంటే ఎత్తుకుని లాలించక నీమీద విసుక్కున్నానని కోపగించావా బాబూ ఈ అమ్మపైన!

వొంటిమీది నగలన్నీ మీ నాన్న తాగుడుకి నిలువుదోపిడి యిచ్చి, నువ్వు గోలీకాయలు కొనుక్కుంటానన్నా, పతంగులు కొనుక్కుంటా నన్నా డబ్బులు లేవన్నానని అలిగావాబాబూ అమ్మపైన!

తాగిన మైకంలో మీ నాన్న నన్ను కుక్కను బాదినట్టు బాదితే, ఆ బాధ భరించలేక తిరిగి ఏమీచెయ్యలేక ఆ కోపం నీమీద చూపించాను నువ్వేదో కావాలని గొడవచేస్తూవుంటే, ఛెళ్ళున చెంపమీదకొట్టి. అసహ్యించుకున్నావాబాబూ అమ్మంటే!

ఎన్నిరోజులు పస్తున్నా, ఎన్ని దెబ్బలుతిన్నా, ఎన్ని వేదింపులు భరించినా, అన్నీ నీకోసమే ఓర్చుకుని బతికున్నానని నీ చిన్ని మనసుకేం తెలుసు?

అత్తమామలు యింట్లోంచి తన్ని తగిలేసినా, మీ నాన్న మరొక మనిషిని చేసుకుని నన్నొదిలేసినా, నే నింకా బతికేవున్నానంటే అది నీకోసమేనని నీ

## ధర్మపథం

# విద్యాదుల ప్రయోజనం

ప్రతి దానికి ఏదో ఒక ప్రయోజనం ఉంటుంది. ఒక్కటేకాదు. చాలా ప్రయోజనాలుండ వచ్చును. అయినా వాటిలో ముఖ్య మైనది ఒక్కటే! అధిపత్యం, తపస్సు, విద్య, ధనం అనే నాల్గిటి ముఖ్య ప్రయోజనాలను గురించి ప్రాచీనులూ ఇలా చెప్పారు- వాటిలో ప్రభుత్వం, తపస్సు, విద్య, ధనం అనే నాలిగింటిని గురించి ఒక చక్కని శ్లోకం ఇలా చెప్పబడింది

'అజ్ఞామాత్ర ఫలం రాజ్యం
బ్రహ్మచర్య ఫలం తపః,
పరిజ్ఞాన ఫలం విద్యా
వత్తభుక్త ఫలం ధనమ్"

రాజ్య పదం ప్రభుత్వ పరమైనది ప్రభుత్వముకున్నందుకి ఆజ్ఞయే ప్రధాన




ఫలమనీ, తపస్సునకు బ్రహ్మచర్యమే ఫలమనీ, విద్యకు జ్ఞానమే ముఖ్యమనీ, ధనానికి త్యాగానుభవాలు ముఖ్యమనీ దీని అభిప్రాయం

ప్రభుత్వ సంబంధమైన అధికారానికి పలుకుబడి, దాని మూలంగా ధన సంపాదన మున్నగు ప్రయోజనాలు ఉండవచ్చును, అయినా ఆజ్ఞా పాలన ముఖ్యమైన ప్రయోజనం తన ఆజ్ఞకు చెల్లుబడి లేకపోతే, తన అధికారం నిష్ప్రయోజన మవుతుంది. గౌరవం ఉండదు. అధికార స్థానం నుంచి దిగిపోవలసి ఉంటుంది

తపస్సు చెయ్యడానికి అనేక ప్రయోజనాలుండవచ్చు. తన కోరిక నెరవేరడం, పగను సాధించడం, అద్భుత శక్తి సంపాదించడం మొదలైనవి తపః ప్రయోజనాలై ఉండవచ్చు కాని బ్రహ్మచర్యమే దాని ముఖ్య ప్రయోజనం యోగులు సంసారానికి దూరంగా ఉండాలి అట్టివారికే ఎక్కువ గౌరవం వ్యాస మహర్షికంటె కూడా ఆయన కుమారుడు శుకమహర్షి - శాశ్వత బ్రహ్మచర్య మవలంబించుట వల్ల అత్యుత్తముడనే కీర్తి సంపాదించాడు.

విద్యకు ధనసంపాదన, కీర్తి మొదలైన ఇతర ప్రయోజనాలు చాలా ఉండవచ్చును కాని వాటికంటె ముఖ్యమైనది జ్ఞాన సంపాదన. సరియైన విద్యార్థులు ఇంకా జ్ఞానాన్ని సంపాదించాలనే ఆసక్తితో ఉంటారు జ్ఞానం నిరవధికమైనదని వారి అభిప్రాయం.

ధనం వున్నందుకు దానిని బద్రంగా దాచి పెట్టినందువల్ల ప్రయోజనం లేదు దాచిన ధనం, ఉన్నా లేనట్లే లెక్క ఉపయోగంలో ఉన్నప్పుడే దానికి విలువ. దనం ఉన్నందుకు ఇతరులకు ఇవ్వాలి, తాను అనుభవించాలి. ఈ రెండింటికీ ఉపయోగించని ధనం వల్ల ప్రయోజనం ఉండదు

—బులుసు వేంకట రమణయ్య

## అమ్మ[illegible]నస్తే!

పసిమనసుకేం తెలుసు[illegible]

నాకు కూడు లేకపో[illegible] [illegible]గోడు చూడలేక ఊడిగంచేసి, వొళ్ళమ్ము[illegible] [illegible] ప్రాణాలతో మిగిలేనని నీ కెలా చెప్పనుబాబూ!

నువ్వెక్కడున్నా క్షేమంగా వుండాలి! ఎప్పటికైనా అమ్మ గుర్తుకొస్తే నా గాధ నిన్ను కదిలిస్తే నే చెప్పింది నిజమనితోస్తే రెండు కన్నీటిబొట్లు కార్చు! నాపరితప్తహృదయానికవి వుపశమనం కలిగిస్తాయి!

బాబూ ఒక్కమాట! నువ్వు పెరిగి పెద్దవాడివ వయ్యాక ఏ అడపిల్ల మనసునీ కష్టపెట్టకుబాబూ! ముఖ్యంగా కట్టుకున్నదాన్ని కన్నీరుపెట్టకుండా చూడుబాబు! ఇదే నేను నిన్నడిగేవరం! నువ్వు నా కిచ్చే ప్రతిఫలం! అంతకన్నా యింకేదీ కోరనుబాబూ! నిన్ను చూడాలనే కోరికతో యిన్నాళ్ళూ వొళ్ళంతా కళ్ళుచేసుకుని బతికున్నాను బాబూ! ఇంక నావల్ల కాదు వెళ్ళిపోతున్నాను మళ్ళీ జన్మంటూ వుంటే నువ్వే నాకు బిడ్డగా పుట్టాలనీ నా వొళ్ళోంచి నిన్ను దింపకుండా ముద్దులుకురిపిస్తూ పెంచాలనీ ఆశిస్తూ కళ్ళు మూసుకుంటున్నాను క్షమించు బాబూ! ఈ జన్మకి యింకేమి చెయ్యలేను

ప్రేమతో,
మీ అమ్మ
జగదాంబ

ఉత్తరాన్ని మడిచి నర్సుచేతికిచ్చింది దీన్ని అచ్చువేయించమ్మా పేపర్లో అంది మెల్లగా! అంతే! ఆమె తల పక్కకి వాలిపోయింది నర్సు హడావుడిగా పల్సుచూసింది కంగారుగా డాక్టర్ని పిలిచింది డాక్టరు పెదవివిరిచాడు

ఏనాటిబంధమో! చుట్టమని చెప్పినందుకు ఆమె బాధ్యత నర్సులూసీ మీదపడింది టాక్సీని పిలిపించి నలుగురు మనుష్యులకి డబ్బిచ్చి శవాన్ని తీయించి దహనసంస్కారాలు చేయించింది ఆమె రాసిన ఉత్తరాన్ని ఆమె కోరికప్రకారం అన్ని పేపర్లలోనూ వేయించింది ఎవరైనా ఒస్తారేమోనని ఎదురు చూసింది కానీ ఎవ్వరూ రాలేదు ఎక్కడున్నాడో? పాపం! అనుకుంటూ ఆసుపత్రికి వొచ్చిన నర్సుకి లూసీ! ఎవరో శరత్ అనే అబ్బాయొచ్చి వెళ్ళిపోయాడు ఆ జగదాంబగారికోసం అని చెప్పింది సిస్టర్ జానకి!

ఎక్కడి కెళ్ళాడు? ఏం చెప్పాడు? ప్రశ్నించింది లూసీ

"ఏమీ చెప్పలేదు. ఆమె చనిపోయింది అని చెప్పగానే వెళ్ళిపోయాడు కళ్ళనీళ్ళుపెట్టుకుంటూ అంది

అంతే! అప్పటినుంచి యిప్పటివరకూ సిస్టర్ లూసీ శరత్ కోసం ఎదురుచూస్తూనేవుంది .! □

# * సినిమాలు - జీవితం *



ఇంచక్కా ఓ డ్యూయెట్ పాడుకుందామా లతా?
చాల్లే ఊరుకో! ఇదేం సినిమా కాదు.... ఎవరన్నా చూస్తే మెంటలేమో అనుకుంటారు!
PARK




రోడ్డు మీద నలుగురు వెధవలు ఒకమ్మాయిని ఏడిపిస్తుంటే వాళ్ళని వారించబోయా! ప్చ్... సినిమాకీ జీవితానికీ చాలా తేడా వుంది తులసీ!




నిన్ను గాఢంగా కౌగిలించుకుని ఆశీర్వదిస్తాను రా చెల్లాయ్!
పిచ్చి అన్నయ్య! ఇది సినిమా అనుకుంటున్నాడు!




నేను రిక్షా తొక్కి లక్షలు సంపాదించి మీ బాకీ తీర్చేస్తానంటుంటే నమ్మరే?
ఇది సినిమా కాదురా పిచ్చి ముండా! జీవితం




ఎందుకమ్మా ఇన్ని మైళ్ళు దూరం నడిచొచ్చావు? ఏం? ఆ బావ ఈ ఇంటి దగ్గరే దించాడుగా... ఇదేమన్నా సినిమానా?




మొన్న ఆ ముద్దుస్వప్నం చూసిన సినిమాలో హీరో రాళ్ళు కొట్టి కోట్లు సంపాదించాడని తనూ మొదలెట్టాడిదిగో! ఇప్పుడు చేతులు బొబ్బలెక్కి అఘోరిస్తున్నారు!



# ఈ కాలం పిల్లలు....

## కె. నాగేశ్వరి

"ఆ పిల్ల దుక్కలా ఉంది ఆ పిల్లాడు గుండులా ఉన్నాడు" అని కాస్త కండపుష్టి గల పిల్లలను కొందరంటారు. కొంచెం సభ్యత తెలిసిన వారైతే "పిల్ల మిసమిసలాడుతోంది పిల్లాడు దబ్బపండులా ఉన్నాడు" అని ముచ్చటపడతారు ప్రపంచంలోని సంపదలలోకెల్లా గొప్పది పుష్టికరమయిన శరీరంతో ఆరోగ్యంగా ఉండటమంటే అందులో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు

యవ్వనం అంకురించే వయసులో ఆడపిల్ల నిండుగా పొందికైన అవయవాలతో ఎదగడమే ఒక అదృష్టం. అలాగే మగపిల్లవాడు కూడా బలిష్టమయిన భుజాలతో నిండైన చెంపలతో నున్నటి దేహచ్ఛాయతో ఏపైన గున్నమావి వృక్షంలా ఎదగటం కూడా అపురూపమైన వరమే!

గడ్డ పెరుగు, చిక్కని తాజా పళ్ళు, ఆకు కూరలు ఇవన్నీ సినిమాల్లోలా టి. వీ. ల్లోలా పేర్చుకుని తిని వీరిలా ఎదగరు. పుట్టుకతో వచ్చిన కండబలం, దానికి తోడు ఆకలేసినపుడు తినడం, వేళకి నిద్రపోవడం, తమకి తోచనపుడు వ్యాపకం, కల్మషం లేకుండా మసలగలగడం ఇవి చక్కని ఆరోగ్యాన్ని వారికి ప్రసాదించి ఉండొచ్చు.

అటువంటి అమ్మాయిని చూసి "ఏషియాటోయే అలా దర్జాగా నడుస్తావు. కొంచెం వంగు. ఏమిటి రోజు రోజుకీ ద్వారాలు పట్టకుండా తయారవుతున్నావు. ఏం తింటావు" అని వెటకారానికి ఉపోద్ఘాతం పాడుతుందో స్నేహితురాలు.

తన కూతురు పద్ధెనిమిది నిండినా షష్ఠ్యబ్దపూర్తి చేసుకున్నా ఒకానొక స్త్రీమూర్తికి ఈ పిల్ల కంటకింపుగా కనబడుతుంది.

"ఏంటి పిల్లా! ఇంకా ఓణీలు వేస్తావు చీరలు కట్టు" అంటే పదిహేనేళ్ళకే ఆ పిల్ల శరీరం ఆమెకి బరువుగా తోచదా? ఏడుస్తూ నాల్రోజులు సరిగా తిండి తినదు. డైటింగ్ కోసం సలహాలు అడుగుతుంది. ఏదో నేరం చేసి యవ్వనంలో అడుగు పెట్టానని క్రమేణా ఆ అమ్మాయి అపోహకు లోనవుతుంది అందులో ఈ కాలం వారికి సినీతారలు, డాక్టరు సలహాలు, సౌందర్య పోషణ కోసం సలహాలు మొదలైనవెన్నో ఉన్నాయి. నిజానికి ఈ పిల్లని కనుక ఆ సమాధానాలిచ్చే వారు చూస్తే "పాపా! నువ్వు లావుగా లేవు. ఆ వయసుకు తగినట్టున్నావు. హాయిగా నీకు కావలిసింది తిను. శుభ్రంగా చదువుకో! మంచి నడవడి అలవాటు

### ఆరోగ్యం ఒక వరం

చేసుకో. ప్రస్తుతం ఆ ఆలోచననే మానేయి, అంటారు.

అలాగే పిల్లాడు కూడా సన్నబడడానికి చిట్కాలు వెదుకుతాడు. "అమ్మా ఎందుకలా నెయ్యి ధారలా పోస్తావు. నీ మూలంగానే నేనిలా వస్తాదులా తయారయాను. కొంచెం కూరల్లో నూనె తగ్గించు ఆ పచ్చళ్ళు అలా ఎర్రగా నూనె తేలుతూ పెట్టావెందుకు?" అని కసురుకుంటాడు.

మంచి వయసులో ఉన్నంతలో శుభ్రమైన తిండి, కష్టించగల ఓపిక ఉండడం మగవారికి తప్పనిసరి అని మగవాడుగా మారబోయే ఈ పిల్లలకి తెలియదు. ముందు ముందు జీవితంలో మోయాల్సిన బరువు బాధ్యతలకూ, కష్టనష్టాలను ఎదుర్కొనడానికీ తగిన మనోనిబ్బరం కావాలంటే, ఒకరన్నారని తిండి దగ్గర్నుంచీ మానే బలహీనత అలవాటు చేసుకోకూడదని తెలుసుకోవాలి

ఆడపిల్లకైనా మగపిల్లాడికైనా శరీరం పదమూడు పద్దెనిమిది వరకూ ఒక వరుసక్రమంలో చక్కగా ఎదుగుతుంది. పదిమందిని ఆకట్టుకో గల శరీర సౌష్ఠవం ఉన్నప్పుడు దానిని కాపాడుకోవాలి గానీ ఎవరో అన్నారని తిండి మానేయకూడదు. ముప్ఫయి దాటాక క్రొవ్వు శాతం ఎక్కువయితే అప్పుడు డైటింగ్‌లు. వైవాహిక జీవితంలో అడుగుపెట్టి కాన్పుల వల్ల ఆడవాళ్ళు, అలవాట్ల వల్ల మగవారూ శరీరం అడ్డదిడ్డంగా పెరిగితే అప్పుడు తిండి తగ్గించడం, ఆసనాలు వేయటం స్విమ్మింగ్ సెంటర్స్‌కు వెళ్ళటం మొదలైన హంగామాలు చేయాలి ఎందుకంటే జీవితకాలంలో మూడు పదుల వయసు కూడా తక్కువే! అప్పటి నుంచి శరీరాకృతి క్రమం కోల్పోతే ఈ విధంగా సన్నబడటం తప్పనిసరి మన శరీరం పనికి వంగక అనారోగ్యంగా తయారవడం దురదృష్టమని అప్పుడనుకున్నా తప్పులేదు వారిలో కొందరైనా యవ్వనంలో ఇలా తెలిసీ తెలియక పేగు మాడ్చుకుని మంచి ఉద్యోగం, తోడు దొరకగానే నిర్లక్ష్యంగా తినేసి కదలకుండా తయారవవచ్చు.

అంతేకాదు. ఇలా వయసులో తిండి మానడం వల్ల ఆడపిల్లలకు కాన్పు సమయంలో ఎన్నో వ్యాధులు రాగల అవకాశం వుంది. మగపిల్లలకీ ఆడపిల్లలకీ కూడా దృష్టి లోపం రావచ్చు. నరాల బలహీనత రావచ్చు. అజీర్ణ రోగాలు రావచ్చు. నీరసం వల్ల కోపం పెరగవచ్చు. ఇంక పిల్లలకు ముఖ్యంగా తలనొప్పి వస్తుంది పనియందు ఆసక్తి ఉన్నా ఓపికుండదు చికాకు పెరుగుతుంది తన చాతకాని తనం తనకే విసుగు పుట్టిస్తుంది ఇలా ఆడవారికీ మగవారికీ ఎన్నో వ్యాధులీ, మానసిక ఆందోళననీ కలుగచేస్తుంది

వయసులో అడుగు పెట్టే పిల్లలు ఒకటి గుర్తుంచుకోవాలి పద్ధెనిమిదేళ్ళ వయస్సులో అతి నాజూగ్గా ఉన్న అమ్మాయి సంవత్సరం కాపురం చెయ్యగానే దూది బస్తాలా తయారవుతే బాగుంటుందా? సన్నగా రివటలాంటి కుర్రాడు కొద్ది సంవత్సరాలకే లోతు కళ్ళు పెద్ద పొట్ట, పుల్లలాటి చేతులతో వికారంగా ఉంటే ఒకనాటి అందం అతనిలో ఏ అణువులోనైనా ఉందా అని వెదకరూ?

పదిహేనేళ్ళ నుండి నలభై, నలభై అయిదు వరకూ క్రమక్రమంగా కొద్ది కొద్దిగా పెరిగి నిండుగా హుందాగా స్టాండర్డ్ పర్సనాలిటీ మెయిన్‌టెయిన్ చెయ్యాలి. అది కావాలంటే ఎవరో కంటగింపుగా చూశారని తిండి తగ్గించుకోకండి ఇంకొకటి ఇష్టంలేని పదార్థాలు మాత్రం తినొద్దు. నిజానికి కొందరికి తోటకూర పప్పే యిష్టం అనుకోండి అది కడుపుకి పట్టినంత మంచి ఆకలి వేళ తింటే పంచభక్షపరమాన్నాలు ఇవ్వని సంతృప్తి, బలం అందివ్వగలదు. అలాగని ఎదుటివారు తింటూంటే చులకన చెయ్యకూడదు మన పరిస్థితులకూ, ఆర్థిక స్తోమతుకూ అనువైన ఆహారం తీసుకోవాలి అప్పుడప్పుడు బరువనిపిస్తే కాస్త తగ్గించుకోవాలి అలాగే మంచి స్వీట్సు, పాయసం మొదలైనవి తినాలంటే తగు మోతాదులో తిని జిహ్వ చాపల్యం తీర్చుకోవచ్చు. ఒళ్ళు ఉండడం నేరం కాదు. □



# వారఫలం



**30-9-1988 శుక్రవారం నుండి 6-10-1988 గురువారం వరకు**

★ **మేషం :** ముద్రణా యంత్రాంగాన పనిపాటలు చేసే వారికి, రాజకీయ వేత్తలకు, పత్రికాధిపతులకు, కళారంగాన శ్రమించే వారికి అనుకూలం. విద్యార్థినా పరులకు లాభదాయకం. పత్రికా గౌరవం, ధనలబ్ధి. స్త్రీలకు : ఆనందదాయకవారం.

★ **వృషభం :** దూరప్రాంతాల నుండి బంధు మిత్రులు రానున్నారు. వారి కోర్కెలు తీర్చుటకై శ్రమించ వలసిన అగత్యమున్నది. అధిక వ్యయం కూడా జరుగవచ్చు, గ్రహించాలి. స్త్రీలకు · సభా గౌరవం కొందరకు, పత్రికా గౌరవం కొందరకు ఏర్పడుట నిశ్చయం. గ్రహించండి

★ **మిధునం :** బలవంతంగా మిత్రుల వలన ఒకానొక వ్యవహార రంగాన దిగుతారు, కొంత నలకట పడుతారు. సభాగౌరవ మున్నది. మీ మాటకు చెప్పలేని విలువ ఏర్పడుతుంది. నూతన వ్యక్తుల సహాయం లాభదాయకం స్త్రీలకు : వృత్తి ఉద్యోగాలందు లాభదాయక సమయం.

★ **కర్కాటకం :** ధన సంబంధంగా ఏమాత్రం యిబ్బందిరాదు. వృత్తియందు పెంపు చెప్పదగిన సమయం. కొందరు ఆస్తి వ్యవహార విజయసాధన యందు నిమగ్నులవుతారు. ఇది శుభ సమయం. వివాహయత్నాలుంటే సాగించవచ్చు. స్త్రీలకు : రాజకీయంగా మేలు, వృత్తి వికాసం.

★ **సింహం :** రాజకీయ మిత్రుల సహాయ సంపత్తులుంటాయనుకోవటమే గాని, ఏమాత్రం లాభం చేకూరదు. దూరభార్యాలకు ప్రయాణించా-లనుకొన్నారా? అది మేలే. స్త్రీలకు : వ్యవహారాలు ఏవైనా ఉంటే సానుకూలమే.

★ **కన్య :** సాధారణ విషయంలో కూడా ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. సుప్రసిద్ధుల సహాయ సంపత్తులుంటాయి. అలా చేయండి. అధికంగా తిరగటం వలన కొంత యిబ్బంది ఏర్పడుతుంది. స్త్రీలకు : ఆరోగ్య మందు వృద్ధి, సభా గౌరవం, పత్రికాముూలకంగా ఆనందం.

★ **తుల :** ముందు వెనుకలాలోచించి కార్య క్రమానికి ఉపక్రమించాలి. వ్యయం కూడా ఏవిషయానికి ముందో దేనికి కాదో విచారించాలి. శుభ సమయం. వివాహ కార్యాలోచన లుండవచ్చు స్త్రీలకు : అధికాదరణ మున్నది. ఇది శుభసమయమే.

★ **వృశ్చికం :** మీరు గావించే ప్రతియత్నమూ అభినందనీయం. సభా మర్యాదకు ఆస్కారం. పాత్రికేయులకు అనుకూల వారం పంపిణీదారులకు మేలే. వస్తు విక్రేతలకు వ్యాపారమందు అనుకూలం. స్త్రీలకు : పెద్ద ఉద్యోగాలందున్న వారికి అధిక అనుకూలవారం. ధనానికి లోటులేదు.

★ **ధనుస్సు :** అన్నమాటను నిలుపుకొను ప్రకృతి మీది. అకారణంగా ఒకా నొక వ్యవహారాన మీకు ప్రసిద్ధి ఏర్పడుతుంది. రాజకీయవ్యవహారా లందు మీకు అనుకూలత యున్నది. స్త్రీలకు : దూర ప్రాంతాల నుండి బంధువులుగాని, మిత్రులుగాని యిల్లు చేరనున్నారు.

★ **మకరం :** పదిమంది మెచ్చుకొను పని సాగిస్తారు. ఒక విధంగా మీకు శని అనుకూలుడే. విద్యావిషయంగా పెంపు చేకూరుతుంది. అభిమానులున్నారు. వారి సహాయ సంపత్తి చేకూరుతుంది. రాజకీయ వాదులకు ఏమాత్రం మేలుగాదు, గ్రహించండి. స్త్రీలకు: వృత్తి వికాసం, ధనలబ్ధి, ఉద్యోగరీత్యా పెంపు.

★ **కుంభం :** ధనలోపం లేదు. అధిక వ్యయమున్నా ఎలాగో సర్దుకోగలరు. చీటికి మాటికి గొడవలు రాకుండా చూచుకోండి. ఇఋగు పొరుగు గొడవలకు ఆస్కారమివ్వకండి. సభామరియాద చేకూరుతుంది. స్త్రీలకు : వృత్తి వికాసం, ఉద్యోగ పెంపు, స్వల్పాదాయం.

★ **మీనం :** ఏమని చెప్పాలి, ఎవరి సహాయం అందుకోవాలి, అని అనుమానించవద్దు. మీకు మొదట ఏంతోస్తుందో అలాగే చేయండి. తరతరాల వృత్తి మీది, విడనాడకండి. వ్యాపార సంబంధంగా ఎలాంటి యిబ్బందిలేదు. ద్రవ్యలోపం అంతకన్న రాదు. స్త్రీలకు : వస్తు వాహన సౌకర్యమున్నది. ప్రజారంగాన అభివృద్ధి.

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

ఇదీ వరస...

కొత్త పార్టీ ప్రణాళిక విడుదల చేసింది చదవనా?




ధరలు తగ్గిస్తాం పేదరికం తొలగిస్తాం అవినీతిని అంతం చేస్తాం..



అరె..చదవకుండానే ఎలా చెప్పేసారండీ!



ఇందులో కొత్తముంది ఏ పార్టీ చెప్పినా అవేగా చెప్పేది..



# షేర్ మార్కెట్‌లో పెట్టుబడులు



—యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

ఈ వారం మనం ఈ వాటాదార్ల అలవాట్లు, అంటే దీనిమీద ఆధారపడి ఏఏరాష్ట్రాల ప్రజలకు ఏమి ఏమికావాలో తెలుసుకుందాము

మన డుంబు వున్నాడు అనుకోండి. అతనికి కూడా కొన్ని అలవాట్లు గాని లేక మానరిజమ్స్ వుంటాయి మా డుంబు తన భావాన్ని ప్రక్కవానికి పూర్తిగా తెలియ జెప్పాలి అని అనుకుంటే ప్రక్కవాని చొక్కా గుండీల పని సపా అన్నమాట ఎందుకంటే, తన బాధ ప్రక్కవానికి అర్థమయ్యే వరకు అగుండీలను వరసగా వూడదీయటం, మరల సరిచేయటం అతనికి తెలియకుండా జరిగి పోతూ వుంటుంది (మీరు కూడా పరిశీలించండి. ఇటువంటి వారు మీకు అగుపించ వచ్చు కూడా) ఒకసారి ఏమయ్యిందంటే. నేను పనివత్తిడిలో వుండటం వలన, మా డుంబును ఒక కంపెనీ షేర్ డిపార్ట్ మెంట్‌కు పంపవలసి వచ్చింది అతనికి వివరాలన్నీ ఇచ్చి. చేయవలసిన పని చెప్పి పంపాను అతను బయలు దేరిన కొద్ది సేపటికి, నాకు గుర్తుకొచ్చింది. ఆ కంపెనీలో ఈ డిపార్ట్‌మెంటుకు ఒక పంజాబీ మహిళ వుంది అని అంతే నాకు ముచ్చెమటలు పోసేసాయి ఎందుకని అంటే మాడుంబుకు వున్న మానరిజమ్ గుర్తుకు వచ్చి (గమనిక · ఈ విషయాన్ని ఎవరికి వారే వూహించుకోవాలని కోరుతున్నాను) వెంటనే కారులో బయలుదేరి ఆ ఆఫీస్ ముందు కాపలా కాస్తే నేను వెళ్ళిన అరగంట తరువాత అతను రావటం జరిగింది

భారతదేశం మొత్తం మీద బొంబాయిలో వున్న ఇన్వెస్టర్స్‌కి కాస్మోపాలిటన్ అప్రోచ్ వుంది వారు మహారాష్ట్రలో గల పరిశ్రమలలో 42 6 శాతం ఈక్విటీ వాటాలను కలిగి వున్నారు 35.9% పశ్చిమ బెంగాలులో వాటాలను, 27 9% దక్షిణాది కంపెనీల వాటాలను, 25% ఉత్తరాదిలో ఉన్న కంపెనీలలో వాటాలను కలిగి వున్నారు. దీనికి పూర్తిగా వ్యతిరేకంగా కనిపించేది ఎక్కడ అంటే కలకత్తాలో వారు 21 9% పశ్చిమ బెంగాల్ కంపెనీలలో వాటాలను కలిగి వుంది. కేవలం 7 9% మాత్రమే ఉత్తరాదిన, 5% బొంబాయి, దక్షిణభారత కంపెనీలలో వాటాలని కలిగి వుండి వారి మితవాద మనస్తత్వాన్ని చాటి చెప్పుకుంటున్నారు

ఢిల్లీ కంపెనీలలో బొంబాయి వారు 25% ఢిల్లీ వారు 18 7% అహ్మదాబాద్‌వారు 8 5% కలకత్తా వారు 7 9%, మద్రాస్ వారు 2 3%, ఇతరులు 2 2%

దక్షిణాది కంపెనీలు బొంబాయి వారు 27 9%, మద్రాస్ వారు 9 8%, ఢిల్లీ వారు 9 0%, అహ్మదాబాద్ వారు 6 4%, కలకత్తా వారు 4 9% బెంగుళూరు వారు 3 8%

మహారాష్ట్ర కంపెనీలు బొంబాయి వారు 42 6%. అహ్మదాబాద్ వారు 9 2%, ఢిల్లీ వారు 7 0%, కలకత్తా వారు 4 9%. పూనే వారు 3 2%. ఇతరులు 3 6%

పశ్చిమ బెంగాల్ కంపెనీలు బొంబాయి వారు 35 9%, కలకత్తా వారు 21 9%, ఢిల్లీ వారు 8 5%, అహ్మదాబాద్ వారు 5.2%, మద్రాస్ వారు 3 1%, బెంగుళూరు వారు 2 5%

ఎలాగ చూసినప్పటికి ఈసువిశాల భారత దేశంలో ఈక్విటీ కల్ట్ అనేది కొన్ని పట్టణాలకి మాత్రమే పరిమిత మయింది అలాకాక ఈసువిశాల భారతదేశంలో ప్రచారం పొందాలి దానికి స్టాక్ ఎక్స్‌చేంజిలు, ఇన్వెస్టర్‌లకి సహాయపడి, వారి బాధలని తీర్చకలుగుతూ వుండి అంతేకాక పరస్పర నిధులు కూడా రకరకాలవి వచ్చి వారు లాభాలను గడిస్తూ ప్రజలకు మార్గదర్శకులై వుండాలి. ఇక్కడ ఇంకొక గమనించదగ్గ విషయం ఏమంటే కొన్ని పరస్పర నిధులు గాని లేక పోర్ట్ పోలియో మానేజిమెంట్ గాని చేస్తాం అని చెప్పి, పబ్లిక్ ఇస్యూస్‌లో వచ్చిన కంపెనీలు చాలా మటుకు పరిశ్రమలలోకి వెళ్ళి పోతున్నారు ఎందుకంటే వారు చేసే వ్యాపారం మీద వారికి నమ్మకం లేక నేను ఈ మధ్య ఆంధ్రప్రదేశ్‌లో పేరున్న ఒక ఇన్వెస్ట్ మెంట్ ట్రస్టు మేనేజింగ్ డైరెక్టర్‌ను కలవటం జరిగింది అయన ఈ మధ్య షేరులలో పెట్టుబడి పెట్టటం పూర్తిగా మానేసి హయర్ పర్చేజ్, లీజింగ్ కార్యకలాపాలలో వున్నానని తెలిపారు. మీరు ఎందుకు షేర్‌లలో పెట్టుబడి పెట్టటం లేదు అని అడిగితే మేము పూర్తిగా చేతులు కాల్చుకున్నాం అందుకని అని సమాదానం ఇచ్చారు. ఈ మార్కెట్‌లో వుండే అతి ఆశావాదం లేక అతినిరాశావాదం కారణాలు కావచ్చు. సరేనని ఆయనకు నేను రెండు షేర్లు రెకమెండ్ చేయటం కూడా జరిగింది (1) ఒస్వాల్ అగ్రో ఫోరన్ ఇది ప్రస్తుతం రు 38 ధరవుంది సుమారు 33కి రావచ్చు ఇంకా బాగా పడితే 27 వరకు రావచ్చు. ఒక సంవత్సరంలో సుమారు 80 రూపాయలకు చేరడానికి చాలా అవకాశం వుంది అన్నాను దీనికి కల కారణాలు (1) ఈ కంపెనీ యొక్క పనితీరు బాగుండటం (2) త్వరలో ఈ కంపెనీ రైట్ ఇస్యూల ద్వారా ప్రజల నుంచి పెద్ద మొత్తంలో డబ్బు సేకరించాలని ఆలోచనలో వుండటం (3) ఈ కంపెనీ యాజమాన్యం వారు. ఈ షేరుల ధరలను మానిప్యులేట్ చేయటంలో సిద్ధహస్తులు అవ్వటం మూలంగా వారు ఈ మధ్యనే బిడాల్ అగ్రో అనే కంపెనీ షేర్ ధరను కేవలం రు. 82 నుంచి రు. 102 రూపాయలకు రెండు రోజులలో తేగలిగారు అంటే, వారి ప్రజ్ఞ ఎటువంటిదో వూహించండి అఫ్‌కోర్స్ ఈ ధర ఎక్కువ కాలం వుండటం జరగలేదు. కారణం ఏమిటంటే, దీన్ని గురించి నేను విశేష ప్రచారం చేయటం జరిగింది ప్రతి శనివారం వుదయం టి వి లో వచ్చే మనీ మాటర్స్‌లో దీనికి అత్యధిక ప్రాముఖ్యత ఇచ్చి. ఈ విషయాన్ని గురించి అధికారుల చెవిన పడేటట్లు చేసి వుండటం వలన వెంటనే ఈ షేరును స్పాట్ లోకి, అంటా స్పెక్యులేటివ్ సెక్షన్ అయిన 'ఎ' నుంచి, వెంటనే డబ్బు చెల్లించే లావాదేవీలను మాత్రమే అనుమతించ బడింది. ఈ విధంగా ఈయన గారు అంతకు ముందు చాలా చేశారు ఇంక ముందు ముందు కూడా చాలా చేస్తారు కూడా ప్రతి సారి అయనను ఎదుర్కొనలేము కదా ఎందుకంటే అయనకు ఉత్తర భారత దేశంలో వున్న పలుకుబడి అటువంటిది ఈ కారణాల వలన పెరగడానికి అవకాశం వుంది అని చెప్పాను. ఇన్వెస్టర్ లారా మీరు కూడా ప్రయత్నం చేస్తారా?



# ఈ రబ్బర్ ట్యూబు మార్చి ఎన్నాళ్లయిందో చెప్పండి!

మీ గ్యాస్ సిలిండరుకూ, గ్యాస్ స్టవ్‌కూ
మధ్యగల రబ్బర్ ట్యూబు తనిఖీ చేసుకోండి.
బయటి భాగంలో పగుళ్లున్నాయా?

మెత్తబడి పోయిందా?

దానిపైన కంటికి కనిపించనంత చిన్న
రంధ్రాలున్నాయా? (ట్యూబుపైన సబ్బు నీళ్లు
వేసి బుడగలొస్తున్నాయేమో చూడండి).

కొసలు చిరిగాయా? జోడించడం,
ఊడదీయడం మరీ సులువుగా జరిగిపోతున్నదా?
పై లక్షణాలలో ఏ ఒక్కటి కనిపించినా
మీ ట్యూబు అపాయకరమన్నమాటే!

## 2 సంవత్సరాల కొకసారి చొప్పున ట్యూబు మార్చేయండి

రెండేళ్లకొకసారి మీ రబ్బర్ ట్యూబు మార్చి
తీరాలి. ఇంకా త్వరగా మార్చినా మంచిదే.
గ్యాసు సిలిండర్ తెచ్చిచ్చే అబ్బాయితో గానీ,
మీ డిస్ట్రిబ్యూటరుతో గానీ చెప్పి ట్యూబు
మార్పించుకోండి.

ఆ మీటరు పొడుగు ట్యూబు కోరినట్టు
వంగుతున్నదా, అది ఐఎస్ఐ ఆమోదం
పొంది ఉన్నదా అన్నది నిర్ధారించుకోండి.

ట్యూబు మెలికలు, ముళ్లు పడరాదు. దానికి
దగ్గరగా మంట, వేడి ఉండరాదు.

ట్యూబు మీద బట్ట గానీ, లోహపు కాండ్యూట్
కవరు గానీ ఉండరాదు. వీటివల్ల తనిఖీ
చేసుకునే పని కష్టమవుతుంది.

ట్యూబుపైన ఆహార పదార్థాలు ఒలికి నిలిస్తే
ఎలుకల వంటివి కొరికెయ్యవచ్చు గనుక
ట్యూబును సదా శుభ్రంగా ఉంచాలి.

రెండు మూడు నెలల కొకసారి ట్యూబు తనిఖీ
చేస్తుండండి. నిజానికి మీరీ పని మీకు గ్యాసు
తెచ్చిచ్చే అబ్బాయితో చెప్పి చేయించుకోవచ్చు.

## భద్రతకై ఇతర ముందు జాగ్రత్తలు

గ్యాస్ స్టవ్ వెలిగించేటప్పుడు ప్రతి సారీ
ముందుగా అగ్గిపుల్ల వెలిగించి, ఆటు తర్వాతే
గ్యాసు మర తిప్పాలని గుర్తుంచుకోండి.

గ్యాస్ సిలిండర్ని ఎప్పుడూ నిలువెత్తుగా ఉంచాలి.
ప్రతి రాత్రీ బర్నరును, రెగ్యులేటరును మూసెయ్యాలి.
ఈ చిన్న చిన్న జాగ్రత్తలన్నీ పాటించారంటే
మీ యిల్లు భద్రం, మీకు క్షేమం.



మీ యిల్లు భద్రంగా,
క్షేమంగా ఉంచుకోండి.
గ్యాసు లీకయ్యే
అవకాశం రానియ్యకండి.

భద్రతా దృష్టితో
విడుదల చేసినవారు:



**ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ లిమిటెడ్**

Sistas'-10C-447/88 TEL

# క్రీడారంగంలో పురుషులతో సమానంగా స్త్రీలు!



పి. టి. ఉష

పురుషులు మొదటనుండి సమాజంలో ఆధిక్యత పొందుతున్నారు. అందుకు వారి శరీర నిర్మాణము ఒక్కటే గాక, స్త్రీలకు అవకాశములు యివ్వక దూరముగా యుంచి ఆధిక్యత చెలాయించుచున్నారు ఈ శతాబ్ది ప్రథమ భాగము వరకు ఆడదాన్ని అబలగా చిత్రించి పురుషులు పెత్తనం చెలాయించారు. ఇది మన దేశంలో నే కాదు పాశ్చాత్య దేశాల్లో, అభివృద్ధి చెందిన దేశాల్లో సహితం కనిపించింది. "గుర్రము కష్టపడి చెమట ఊడ్చును, పురుషుడు చెమట పోయునట్లు చేయును. స్త్రీ మిణుగురు పురుగు వలె ప్రకాశించును" అనే సూక్తి ఐరోపా దేశాల్లో యిప్పటికి వినిపిస్తూంది.

ఆడది అప్పటికి యిప్పటికి ప్రకాశిస్తూంది. వివిధ రంగాల్లో అగ్రస్థానము పొందుచున్నది. క్రీడారంగములో నిన్నటి పురుషుల రికార్డులను నేడు ఆడది అధిగమించు చున్నది. ఆడదానికి మొదటి నుండి క్రీడా రంగములో అవకాశము ఇవ్వక ఈనాడు యిచ్చారు. కాని కొద్దికాలములో నే వారు పురుషుల రికార్డులను పమ్ము చేయుచున్నారు.

క్రీడారంగంలో మహిళలకు అవకాశము పురుషులకన్న వంద ఏళ్ళ తర్వాత లభించినది. 1952 హెల్సింకి ఒలింపిక్స్‌లో మారథాన్ పరుగులో స్వర్ణ పతకము సాధించిన ఎమిల్ జటోపక్ 2 గం. 23 ని.03.2 సె.లలో పరుగెత్తి సంచలనం సృష్టించాడు. కాని 10 ఏళ్ళ తర్వాత 1983లో అమెరికన్ మారథాన్ మహిళ జోన్ బెనాయాట్ 2 గం. 22 ని. 43 సె. లలో పరుగెత్తి ఎమిల్ జటోపక్ సృష్టించిన రికార్డును అధిగమించినది. అంతేగాక 1956 మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో అలాయిన్ మిటెన్ ఓ కబ్బా రికార్డు 2 గం 25 ని. కన్న ఎంతో తక్కువ. అంటే మహిళలు క్రీడారంగములో అవకాశము లభించిన కొద్ది కాలములో ఎంతో అభివృద్ధి చూపారు అనవచ్చును.

ఇక 'జిమ్నాస్టిక్స్'లో పురుషులతో పోల్చితే స్త్రీలు ఎంతో నైపుణ్యము చూపుతున్నారు ముఖ్యముగా 'ఫ్లోర్ ఎక్సర్‌సైజ్', 'బీమ్' 'పార్లల్ బార్' లో మహిళలు ఆధిక్యతలో యున్నారు. రుమేనియా క్రీడాకారిణి నాడియా కోమనేసీ 'పది' స్కోరు చేసిన ప్రథమ జిమ్నాస్టిక్ క్రీడాకారిణి. కాని యిప్పటికి ఆడవారు క్రీడలలో పాల్గొనుటకు సమాజంలో అనేకులు వ్యతిరేకిస్తున్నారు.

1896 లో ఏథెన్స్‌లో ప్రప్రథమ ఆధునిక ఒలింపిక్ క్రీడోత్సవాలు జరిగినప్పుడు మహిళా క్రీడాకారిణి మెల్పొమెనీ మారథాన్ పరుగుపోటీలో పాల్గొనుటకు అనుమతి కోరగా మహిళలకు అవకాశము లేదని నిరాకరించారు. నాలుగు సంవత్సరాల తర్వాత పారిస్‌లో జరిగిన ద్వితీయ. ఒలింపిక్స్‌లో 11 మంది మహిళలు పాల్గొన్నారు వారిని గాల్ఫ్, టెన్నిస్ పోటీలలో అనుమతించారు. ముఖ్య క్రీడాంగణము (మెయిన్ స్టేడియం)లో జరిగిన పోటీలలో పాల్గొను అవకాశము యివ్వలేదు. మహిళలను 'బాలెట్' ప్రదర్శనలో పాల్గొన నిచ్చారు. అక్కడకూడా ఆడవారిని ద్వితీయ శ్రేణిగా లెక్కించారు. పారిస్ ఒపేరా బృందాన్ని ఇరాన్‌షాకు ఫ్రెంచి అధ్యక్షుడు పరిచయం చేసినప్పుడు షా స్త్రీలకై ప్రత్యేకస్థానములన్ని తన రాణివాసం స్త్రీలకై టికెట్లు కొన్నాడు.

'1904 సెయింట్ లూయిస్ ఒలింపిక్స్‌లో 8 మంది స్త్రీలను విలువిద్య (ఆర్చరీ) పోటీలలో అనుమతించారు. 1908 లండన్ ఒలింపిక్స్‌లో 36 మంది ఆడవారు పాల్గొన్నారు. విజేతలకు పతకాలు యివ్వక డిప్లొమోలు బహూకరించారు.

మహిళలకు ఎథలిటిక్ పోటీలలో పాల్గొనుటకు అనుమతించినప్పుడు ఒలింపిక్స్‌లో నిజంగా మహిళలు పాల్గొన్నారు అనవచ్చును. 100 మీ. పరుగు, 4×100 మీ రిలే, 800 మీ. పరుగు, హైజంప్, డిస్కస్ త్రో మొదటిసారిగా మహిళలకు అనుమతించిన పోటీలు. ఆధునిక ఒలింపిక్ క్రీడల్లో పితామహుడుగా గుర్తింపు పొందిన బారన్‌పిర్రీ డికోబర్టిన్ ఆడవారు ఒలింపిక్ క్రీడలలో

## ఒలింపిక్ క్రీడలలో పాల్గొన్న మహిళల సంఖ్య

| | నగరం | ఒలింపిక్స్ జరిగిన సంవత్సరం | పోటీలలో పాల్గొన పురుషులు | పోటీలలో పాల్గొన్న స్త్రీలు |
|---|---|---|---|---|
| 1. | ఏథెన్స్ | 1896 | 295 | – |
| 2. | పారిస్ | 1900 | 1066 | 11 |
| 3. | సెయింట్ లూయిస్ | 1904 | 546 | 8 |
| 4. | లండన్ | 1908 | 1998 | 36 |
| 5. | స్టాక్‌హోం | 1912 | 2447 | 57 |
| 1916 ఒలింపిక్స్ మొదటి ప్రపంచ యుద్ధం వలన జరగలేదు | | | | |
| 6. | ఆంట్‌వర్ప్ | 1920 | 2527 | 64 |
| 7. | పారిస్ | 1924 | 2939 | 136 |
| 8. | ఆమ్‌స్టర్‌డాం | 1928 | 2708 | 263 |
| 9. | లాస్‌ఏంజల్స్ | 1932 | 3652 | 328 |
| 10. | బెర్లిన్ | 1936 | 3652 | 328 |
| 1940, 1944 ఒలింపిక్స్ రెండవ ప్రపంచ యుద్ధము వలన జరగలేదు. | | | | |
| 11. | లండన్ | 1948 | 3677 | 385 |
| 12. | హెల్సింకి | 1952 | 5349 | 518 |
| 13. | మెల్బోర్న్ | 1956 | 2958 | 384 |
| 14. | రోమ్ | 1960 | 4859 | 537 |
| 15. | టోక్యో | 1964 | 4854 | 732 |
| 16. | మెక్సికో | 1968 | 5782 | 844 |
| 17. | మ్యూనిచ్ | 1972 | 8485 | 1603 |
| 18. | మాంట్రియల్ | 1976 | 4915 | 1274 |
| 19. | మాస్కో | 1980 | 4625 | 1247 |
| 20. | లాస్ ఏంజల్స్ | 1984 | 4381 | 1101 |

పాల్గొనుటకు గట్టిగా వ్యతిరేకించాడు. 1932 లాస్ ఏంజిల్స్ ఒలింపిక్స్ వరకు మహిళా క్రీడాకారులు పాల్గొనుట అస్తవ్యస్తంగా యుండినది. మిల్‌డ్రెడ్ డ్రెరిక్సన్ అనే క్రీడాకారిణి 80 మీ. హార్డిల్సు 11 7 సె. లలో పూర్తి చేసి ప్రపంచరికార్డు. జావలీన్ 43.68 మీ దూరము విసిరి ఒలింపిక్ రికార్డు నెలకొల్పి ఉత్తమ క్రీడాకారిణిగా గుర్తింపు పొందినది. హైజంప్‌లో ఆమెకు లభించిన ప్రథమస్థానమును గుర్తించక రజితపతకం యిచ్చారు.

మరొక అగ్రగామి క్రీడాకారిణి స్టానీస్లవా (స్టెల్లావాల్ష్) 100 మీ.లు 11 సెకండ్లలో పూర్తిచేసిన ప్రథమ మహిళ. ఆమె పోలెండులో పుట్టినది. కుటుంబం ఆమె చిన్న వయసులో అమెరికా వలస వెళ్ళారు. కాని ఒలింపిక్స్‌లో ఆమె అమెరికా తరఫుగాక తన మాతృదేశం అయిన పోలెండు తరఫున పాల్గొని బంగారు పతకం గెల్చినది


డెనీలా సిల్వాస్

అమెరికావాసి ఎవ్లిన్ ఆష్‌ఫోర్డ్ 10 79సె. 100మీ పరుగెత్తి రికార్డు నెలకొల్పినది లాస్‌ఏంజిల్స్‌లో పురుషుల 100 మీ పరుగులో అమెరికాకు చెందిన నీగ్రో ఎడ్డీటాలాన్ 10 3 సె లలో పరుగెత్తాడు అప్పటి ప్రపంచ రికార్డు 10 2 సె మాత్రమే కార్ల్‌విన్ స్మిత్ 100 మీ 9 93 సె లలో పరుగెత్తి సంచలనం సృష్టించాడు.

1936 బెర్లిన్ ఒలింపిక్స్ వరకు మహిళలకు ఎథలిటిక్స్‌లో నాలుగు క్రీడలలో పోటీలు జరిగేవి 1948 లండన్ ఒలింపిక్స్‌లో క్రొత్తగా మూడు క్రీడలు – లాంగ్‌జంప్ 200 మీ పరుగు షాట్‌పుట్ ప్రవేశపెట్టారు 1940 1944 ఒలింపిక్స్ రెండవ ప్రపంచ యుద్ధము వలన జరగలేదు లండన్ ఒలింపిక్స్‌లో అద్వితీయ ప్రతిభ చూపిన క్రీడాకారిణి ఫానీ బ్లాంకర్స్– కోయిన్ 1936 బెర్లిన్ ఒలింపిక్స్ సమయమున ఆమె వయసు 18 ఏళ్ళు ఆ పోటీలలో జెస్సీ ఓవన్స్ ఆటోగ్రాఫ్ పొందుటకు ఆమె ఎంతో శ్రమ పడినది 1948 లండన్ ఒలింపిక్స్‌కు ఆమె 30 ఏళ్ళ వయసు వచ్చినది 100 మీ 200 మీ 4×100 మీ పరుగు, 80 మీ హర్డిల్సులో అయిదు బంగారు పతకాలు గెల్చి జెస్సీ ఓవన్స్ రికార్డు సరిచేసినది ఆటోగ్రాఫర్లు ఆమె వెంట యీసారి పడ్డారు



అరూలియాడోబ్రే

ఇటీవల కాలములో మహిళలు ఎథలిటిక్స్‌లో ఎంతో ఆసక్తి చూపుతున్నారు, పురుషుల రికార్డులతో పోల్చితే స్త్రీలు ఎంతో సాధించినట్లు ఆధారాలు ఉన్నట్లు డా కె ఎఫ్ డయర్ తన పుస్తకం క్యాచింగ్ అప్ విత‌మెన్ లో తెల్పాడు ఉదాహరణకు 800 మీ పరుగులో పురుషుల రికార్డు 1 41 72 సె అయితే స్త్రీలరికార్డు 1 53 28 సె మాత్రమే అనగా మహిళలు ఎంతో దగ్గరకు వచ్చారు ఇక యిరవై ఏళ్ళలో యింకా దగ్గర చేరవచ్చుని 20 20లో మహిళలకు పురుషుల పరుగు రికార్డులలో వ్యత్యాసము ఉండదని డా డయర్ ఆధారాలతో చెప్తున్నారు స్త్రీ క్రీడాకారులలో పురుషులకన్నా ఎక్కువ సహనం, ఓపిక ఉంటాయి ముఖ్యముగా దూరపు పరుగు పోటీలలో మహిళలు ఎక్కువ ప్రతిబ చూపకలుగుచున్నారు మొదటలో

మహిళలు పోటీల సమయం సహజమైన భయంతో ప్రతిబ కనపరచలేధు 1963లో 'కల్వర్ సిటీ మారథాన్ పోటీలో అమెరికన్ మహిళా మెర్రీ లెప్పర్

3 గం 37ని 07 సె లతో పరుగెత్తి విజయం పొందినది అధికార రీత్యా 1967లో కాదరీన్ స్విట్జర్ ప్రదమ మహిళా మారథన్ విజేత గత 21 ఏళ్ళలో మహిళల మారదన్ 3 37 07 నుండి 2 22 43 సె లకు వచ్చినది నేడు స్త్రీ పురుషుల మారథన్‌లో వ్యత్యాసము 15 నిమిషాలు మాత్రమే అనటం అతిశయోక్తి కాదు

ఈతలో కూడా ఆడవారు మంచి నైపుణ్యం చూపగలుగు చున్నారు 1956 మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో అఖండ విజయం పొందిన ఆస్ట్రేలియా మహిళా డాన్ ఫ్రాజర్ అంటే పురుష 'ఈత' గాళ్ళకు భయం కలిగింది.

ఇకమనదేశంలో మహిళా క్రీడాకారిణిలు పి టి ఉష, షానీ అబ్రహంలు అనేక మంది పురుషుల కన్న ఎంతో నయం అనిపించారు.

ఎథిలిటిక్స్‌లోనే గాక జిమ్నాస్టిక్స్, స్విమ్మింగ్, టెన్నిస్, షటిల్ బాడ్మింటన్, టి టి. లతో బాటు ఫుట్‌బాల్, హాకీ, గుర్రపు స్వారీలలో కూడా మహిళలు ఎంతో ప్రతిభ చూపుచున్నారు.

–ముకరమ్

1988 వరల్డ్ క్రాస్ కంట్రీ విజేత ఇంగ్రిడ్ క్రిష్టియన్‌సెన్





# దూరదర్శనం

లత

## రాణి

తెలుగు నాటిక- కన్నడ మూలం వాసుదేషన్ - రాణి అత్తవారింట్లో అత్తగారి ఆచారాల్నీ - సూర్య నమస్కారాల్నీ మూర్ఖత్వాన్ని కేవలం నాలుగు డైలాగులతో మార్చి వేస్తుంది- అత్తగారి భారత స్త్రీత్వాన్ని గురించి ఒకడైలాగు కొట్టించారు. రాణి వేషం వేసిన అమ్మాయి అత్తింటి కోడలుగా లేదు- సరికదా ఝాన్సీరాణి పోజులు కొడుతున్నది. ఈ అమ్మాయి నెక్కడో చూశాను. డైలాగుల్లో అక్షరాల ఒత్తులు కొన్ని చోట్ల ఎక్కువగానూ కొన్ని చోట్ల తక్కువగానూ ఉన్నాయి. నాటకం ఏమిటో గా ఉంది. ఇలాటి నాటకాలే టి. వి. వారికి దొరుకుతాయి మన ఖర్మకొద్దీ.

## వాగ్లేకీ దునియా

ఒక ఇంగ్లీషు హాస్య గ్రంథానికి వాగ్లేకీ దునియా అని కిందటి వారం, ఈ వారం చూపించారు. ఈ వారం ఇల్లు కొనాలని వెడితే ఏజంటు ఆరుబయట గాలిలో కిచెన్, బెడ్‌రూమ్ అని చూపిస్తాడు. కాని లక్కీగా ఉంటున్న ఇల్లూ పక్కభాగం కొంటాడు. పైల్సు కట్టలూ వాటి కింద కనిపించకుండా మోగుతున్న ఫోనూ- అరటి పళ్ళవాడి బేరం అలాటివి బాగున్నాయి.

## నిర్మల

ప్రేమచంద్ నవలకు నాటకీకరణ- ఇది చివరి భాగం- మనూభండారీ డైలాగులు బాగున్నాయి. పుత్రశోకంతో భర్త ప్రాక్టీసు మూలబడేసరికి ఆర్థికంగా బాధలు పడలేని నిర్మల కఠిన చిత్తంతో ఉన్న పిల్లవాడిని సరిగా చూడదు- ఆ చిన్నవాడు సన్యాసుల్లో కలిసి పోతాడు. ఆ పిల్లవాడిని వెతకటానికి నిర్మల భర్త వెడతాడు- నిర్మల కోపంతో రోగంతో ప్రాణం విడుస్తుంది. ఈ నవలలో డాక్టరు చావటం తీశేసారు. అయినా ఆనాడు ద్వితీయ వివాహం చేసుకున్న వారిపాట్లు ఇలా ఉండేవి కాబోలు. నిర్మల మంచి నవలే గాని బాబు దేవిడ్ వకీల్ తోతారాం వేసిన నటుడు బాగా నటించాడు- "నిర్మల, గణదేవత" లాంటి నవలలు తీయటం కష్టం- తీసినా బాగా రాణించవేమో? నిర్మలలో ఒక తండ్రి ముగ్గురు కొడుకుల్నీ పోగొట్టుకోడం చూడలేక పోయాం.

## అభిరామ కృష్ణం

రచన: ఎమ్. కె. రాము- ఈ సంగీత నాటిక శుక్రవారం ప్రసారం చేశారు. ఓ మోహన వంశీ- అని శైలు పాడిన పాట చాలా హృద్యంగమంగా ఉంది. వంశీ అన్న పిలుపులో నే వేయి వెన్నెలలూ, వెన్నెలకి వేయి కళ్ళూ పదివేల రాగాలూ- లక్ష అనురాగాలూ ఉన్నాయి. టి. వి. ఈ మధ్య ప్రసారం చేసిన కార్యక్రమాల్లో ఈ పాట పెద్ద రిలీఫ్.




## ముంగేరీ లాల్

నీరజ్ కుమార్ రచనలాగుంది. ఢిల్లీ మహా నగరంలో ముంగేరీలాల్ వానర వనస్పతి కంపెనీలో పని చేస్తాడు. మహా కాలచక్రంలో మహానగరంలో అతని రకరకాల జీవితానుభవాలే ఈ సీరియల్ అని చెప్పారు. శుక్రవారం ఇది కొత్త సీరియల్- మామూలు గుమాస్తా అయిన ముంగేరీలాల్ బ్రహ్మాండమైన కలలు కంటూ ఉంటాడు.... లతాజీ (నేనుకాదు) కచేరీకి రాకపోతే ముంగేరిని పాడమంటే బ్రహ్మాండంగా పాడినట్లూ.... ఆఫీసరు తనే అయి నీకు ఇంగ్లీషు రాదని గుమాస్తాల్ని చివాట్లు పెడుతున్నట్లూ కలలు. హాస్యం కరుణ కలిసి ఉన్న నాటకం ఇది.

## ఫెయిరీ టేల్సు

అనే ఇంగ్లీషు జానపద కథల్లో- మేమందరం సరదాపడి చదివిన నైటింగేల్- అనే కథ ఈ రోజు దృశ్య రూపకంగా చూశాం. ఇది చైనీస్ కథ, ఇంగ్లీషులోకి వచ్చింది. ప్రతి పాశ్చాత్య కవీ నైటింగేల్ వర్ణన లేకుండా కవిత్వం వ్రాయలేదు. మన కోకిలకీ ఈ నైటింగేల్‌కీ కొంచం భేదం ఉంది. నైటింగేల్ మరణించే చైనా ఎంపరర్‌ని బ్రతికించటమే కాకుండా తన నేస్తం అయిన పేదపిల్లని అతని రాణిని చేస్తుంది. ఈ కథ చక్కని చైనా సెట్టింగులతో బాగా చూపించారు. ఇలాటి పిట్ట మనకీ ఉంటే బాగుండును అనిపిస్తుంది.

## శ్రీ కాళోజీతో పరిచయం

అనేక యుద్ధముల ఆరియు తేరిన ఆ వృద్ధమూర్తిని వృద్ధసింహాన్ని పేర్వారం జగన్నాథం చచ్చు ప్రశ్న మరింత రెచ్చ కొట్టింది. యవ్వనంలోని తిరుగుబాటు- ఆ నాటి విరగ బాటు ఒక్కతడవ మళ్ళీ వచ్చి తెలంగాణా మాండలికంలో చక్కగా కవిత్వం చదివారు శ్రీ నారాయణరావు గారు. ఆయన డెబ్బయి అయిదేళ్ళ జీవన స్రవంతిలో నల్గొండలో నాజీల దగ్గరనుంచి నరసింహస్వామి వరకూ అందరూ కవితా వస్తువులే. □

Printed and published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75589 Editorial : 75667.

సంస్కృతం ఒక వర్గం భాష అనే అపోహ మనలో చాలమందికి ఉంది నిజానికి ఏ భాషా ఏ వర్గం·వారిసొమ్మూ కాదు. ఇంగ్లీషు ఎవరిది? ఒక్క ఇంగ్లీషు వారిదేనా? కానేకాదు. ప్రపంచ ప్రజలందరిదీ. అట్లే నేడు పెద్ద భాషగా రూపొందుతున్న హిందీ కూడ. హిందీ ఉత్తరాదుల భాష మాత్రమే కాదు దాక్షిణాత్యుల భాషకూడ. అలాగే ఒకప్పుడు విశ్వ విజ్ఞానాన్ని స్వాయత్తం చేసుకొని ప్రజలకందించిన ప్రాకృత సంస్కృతాలూ. స్వరం మారితే అర్థం మారడం, అనర్థాలు జరుగడం అనే కాలం కాదిది. సంస్కృతం ఒక కులం భాష అనే కాలం కాదిది. వేద ఋషుల జాతికులాలేవో! కనుకనే కబీర్ అన్నాడు.

జాత్ నపూఛో సాధుకే

# సంస్కృత భాషా ప్రచారం

పూఛ్‌లీజియే జ్ఞాన్
మోల్‌కరో తలవారకా
పడా రహనదో మ్యాన్

సాధుపుంగవుని జాతి అడుగకండి; జ్ఞానం ఏమిటి అని అడిగింది. కత్తి విలువ చూడండి గాని, ఒరను అలా పడవేయండి- అని. ఇలాటి వారెందరు సాధుపుంగవులు, ఋషులు దర్శిస్తే వేదభండారం నిండారిందో! ఈ అందరి సొమ్మూ అయిన సంస్కృతం నేర్చుకోడం కష్టమనే అపోహ వుంది చాలా మందికి. ఏ భాష అయినా, కొన్ని వందల పదాలు నేర్చుకొంటే రాజ్యం ఏలవచ్చునంటారు భాషావేత్తలు. ఇంగ్లీషు 750 పదాలు నేర్చుకొన్న వారు భారతదేశం పాలించారు. ఈ వ్యవహారానికి మించిన పాండిత్యానికి మరొక రెండు వందల పదాలు వస్తే మహాపండితుడు. ఆధునిక సకల శాస్త్రాలను స్వాయత్తం చేసుకొన్న ఇంగ్లీషే అలా ఉన్నప్పుడు, తెలుగు మొదలయిన ఆధునిక భారతీయ భాషలలో మూడు నాలుగు వందల పదాలు నేర్చితే నిత్య వ్యవహారం మహా యిదిగా జరుపవచ్చు. ఇది సంస్కృత విషయంలోను అపవాదమేమీకాదు. నేను కాంగి గురుకులంలో చూచాను. అక్కడ వడ్రంగం, కమ్మరం, కుమ్మరం, నేత మొదలయిన వృత్తులూ విద్యార్థులకు నేర్పేవారు ఛాటికి తగిన సంస్కృత పదాలు, క్రియలు- మొత్తం వేయిలోపు పదాలతో ప్రతి విద్యార్థి వ్యవహరించేవాడు కావ్యజ్ఞానం కలవాడు మరికొంతముందుండేవాడు. విద్యార్థులు అతి సులభంగా సరళంగా సంస్కృతంలో సంభాషించే వారు. కనుక సంస్కృతం కష్ట వ్యవహార భాషేమీ కాదు. వెంకటరమణనగర్ సంస్కృత భాషా ప్రచార సమితి వారు ఈ విషయాన్ని 10 రోజుల సంస్కృత శిక్షణ శిబిరం ఏర్పాటు చేసి నిరూపించారు. దీనిని నిర్వహించినవారు శ్రీ సి. ఎం. కృష్ణశాస్త్రి. ఈయన వయస్సు 32 సంవత్సరాలు. ఈయన సంస్కృత భాషాబోధనం అత్యంత సరళం. విద్యార్థుల మనస్తత్త్వం తెలుసుకొని, ఆధునిక విషయాలు ఆధారంగా చిన్న చిన్న మాటలతో బోధించడం ఈయన పద్ధతి. ఈ విధంగా 10 రోజులలో సంస్కృతంలో సామాన్య వ్యవహారం చేయవచ్చునని ఈయన సిద్ధాంతం. ఈయన ఇంత వరకు వివిధ రాష్ట్రాలలో మూడు వేల శిబిరాలలో ఈ విధంగా లక్షా 20 వేలమందికి సంస్కృతం నేర్పారు. ఈయన మరి కొందరు కర్నాటక రాష్ట్రంలోని శివమొగ్గ జిల్లా మత్తూరు గ్రామాన్ని స్వాయత్తం చేసుకొని సంస్కృతం నేర్పి సంస్కృత మయం చేశారు. ప్రజలకు సంస్కృతంలో ఆసక్తి కలుగడానికి కృష్ణశాస్త్రి మరొక పద్ధతి అనుసరిస్తున్నారు. సంస్కృతో పాధ్యాయులు ఇద్దరు నియమిత సమయాలలో బెంగుళూరు సిటీ బస్సులలో ఎక్కి పయనిస్తూ వివిధ విషయాలపై సరళమైన సంస్కృతంలో మాట్లాడుకొంటారు. దానితో జనానికి కుతూహలం, జిజ్ఞాస కలుగుతాయి. హైదరాబాద్‌లో ఈ శిబిరం ఒయాసిస్ పాఠశాలలో నిర్వహించారు. సమాపనోత్సవం జరిగింది. రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పమిడిగంటం కోదండరామయ్య ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. అధ్యక్షులు డాక్టర్ మల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ సి. ఎం. కృష్ణశాస్త్రి ప్రసంగించారు.

## సమన్వయానికి సైకిల్ యాత్ర

మద్రాసులోని శ్రీ రాం ఫైబర్స్ లిమిటెడ్ సంస్థలో గుమాస్తాగా ఉన్న శ్రీ జె. మనోహర్‌కు సాహసంతో పాటు సమన్వయ దృష్టి ఉంది. దేశ ప్రజల భావ సమన్వయం కోసం దేశమంతా సైకిల్ యాత్ర సాగించాలని నిర్ణయించు కొన్నాడు, 30 రోజులలో దేశమంతా పర్యటించ నిశ్చయించాడు. మండే ఎండలో యాత్ర ప్రారంభించాడు. విజయవాడ మీదుగా ఒరిస్సా, బిహార్, నేపాల్, ఢిల్లీ, రాజస్థాన్, మధ్యప్రదేశ్, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో ప్రధాన పట్టణాలను చూచి, 25 రోజులలో దాదాపు 6000 కిలోమీటర్లు పయనించి, హైదరాబాద్ చేరారు. యువకులలో సాహస దృష్టి, సమైక్యభావం కలిగించడం తన ఉద్దేశ మన్నాడు. ఈయన ఇంతకు ముందు 1983లో దక్షిణ భారత మంతా తిరిగాడు- దాదాపు 3500 కిలోమీటర్లు. రోజుకు ఎన్ని మైళ్లు తొక్కుతున్నారని ప్రశ్నించగా, రోజుకు 300 కిలోమీటర్లు తొక్కుతా నన్నాడు. మద్రాసు నుంచి 22 గంటల 35 నిమిషాల్లో విజయవాడ చేరానని, 434 కిలోమీటర్లు తొక్కానని అన్నారు. ఏమైనా జబ్బు చేస్తే, సైకిల్ పంచరయితే



జె. మనోహర్

తప్ప ప్రయాణం ఆలస్యం కాదని, దారిలో ఎలాటి దుర్ఘటనా జరుగలేదని అన్నాడు. ఏమిటీ అప్రదక్షిణ-ప్రయాణం? అన్నాను. క్లాక్‌వైజుగా పోవచ్చు కదా! అన్నాను. లడ్డును ఎటుకొరికి తిన్నా ఒక్కటే- అన్నాడు. ప్రపంచ యాత్రకు పథకాలు ఉన్నాయా?- అనడిగాను. వచ్చే ఏప్రిల్ నుంచి ఆసియా-యూరోప్ యాత్ర చేద్దామను కున్నాను. 15 వేల కిలోమీటర్ల మేర 21 దేశాలు పర్యటిస్తాను. ఇది 90 రోజులలో ముగిద్దా మనుకున్నాను- అన్నారు మనోహర్.

### ఉపశ్రుతి:

ఏం సార్! మీ సాతవాహనపురం మహానాడు వట్టి ఫ్లాప్ అని అంటున్నారే, మీ ప్రతిపక్షులు!- అనడిగాను ఒక తెలుగుదేశం నాయకుణ్ణి. వాళ్లు అలా అనక ఏం చేస్తారు? బాగా జరిగిందంటే ఢిల్లీలోని వారి బాసులు వుండనిస్తారా వాళ్లను?- అన్నారు ఆయన మందహాసంతో. □




## సుమన్‌తో శ్రీ అన్నపూర్ణ సినీచిత్ర

"సుమన్ సరసన రజనితో పాటు మరో బొంబాయి తార ఉంటుంది", అన్నారు కాట్రగడ్డ ప్రసాద్. ఈయన "బందిపోటు" అనంతరం సమర్పించే శ్రీ అన్నపూర్ణ సినీ చిత్ర వారి ద్వితీయ చిత్రంలో నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, రంగనాథ్, నర్రా, చలపతిరావు, రాజ్‌వర్మ, కె. ఆర్. విజయ ఇతర పాత్రధారులు. ఓంకార్ కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలు, రాజ్-కోటి సంగీతం, కబీర్‌లాల్ ఛాయ, రామచంద్రసింగ్ శిల్పం, విజయన్ సాహసాలు, శివశంకర్ నృత్యాలు, నాయని చంద్రమోహన్ సంయుక్త దర్శకత్వం, వేమూరి వీరభాస్కర్- ఎం.వి. సత్యనారాయణ సహకార దర్శకత్వం, మురళిరామయ్య కూర్పు, రాజేంద్ర ప్రసాద్- రాజశేఖర్ ప్రొడక్షన్‌తో రమణబాబు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. టి. ఆర్. తులసి నిర్మిస్తున్న ఈ చిత్రానికి బి. ఎల్. వి. ప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.



"రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ 14వ చిత్రంలో రమేష్‌బాబు, ఎ. ఎన్. ఆర్., రజని

## కృష్ణంరాజు "ధర్మతేజ"

"మొదటి షెడ్యూల్ అగస్ట్ 16 నుంచి సెప్టెంబర్ 5 వరకు జరిగింది. రెండో షెడ్యూల్ సెప్టెంబర్ 25 నుంచి అక్టోబర్ 5 వరకు. ధర్మ స్థాపనతో కొన్ని కుటుంబాలను పరిరక్షించిన మహోజ్వలమైన పాత్రలో కృష్ణంరాజు విజృంభించారు. 'పూందోట కావల్ కారన్' అనే విజయవంతమైన తమిళ చిత్రం ప్రేరణ", అన్నారు పేరాల. ఈయన దర్శకత్వం వహించే కల్యాణి కంబైన్స్ వారి "ధర్మతేజ" చిత్రంలో రాధిక, వాణీ విశ్వనాధ్, తాతినేని రాజేశ్వరి, జగ్గయ్య, రంగనాధ్, శివకృష్ణ, కోట శ్రీనివాసరావు, ఆనంద్ ఇతర నటవర్గం. సాయినాధ్ మాటలు, సీతారామ శాస్త్రి పాటలు, విద్యాసాగర్ సంగీతం, జానీలాల్ ఛాయ, రంగారావు శిల్పం, సాహుల్ సాహసాలు, తార నృత్యాలు, సుధాకర్ సహకార దర్శకత్వం, సాయి ప్రొడక్షన్, మురళీరామయ్య కూర్పు తెర వెనుక హంగులు.

## "ప్రతిబింబాలు" తుది మెరుగుల్లో

"షూటింగ్ ముగించాం", అన్నారు జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి. ఈయన నిర్మించే విష్ణుప్రియా కంబైన్స్ వారి పై చిత్రంలో ఎ. ఎన్. ఆర్ , జయసుధ, తులసి, అన్నపూర్ణ, అనూరాధ, జయమాలిని, పుష్పలత, గుమ్మడి, కాంతారావు, వేలు, సాక్షి రంగారావు, అశోక్‌కుమార్ ప్రభృత తారాగణం. ఆత్రేయ, కాశీ విశ్వనాధ్ మాటలు రాశారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, సెల్వరాజ్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, శివసుబ్రహ్మణ్యం- శీను నృత్యాలు, కృష్ణారావు- భాస్కర్ సహకార దర్శకత్వం, వీరప్ప కూర్పుతో సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు. రాజేంద్రన్ సంయుక్త దర్శకుడు.

## కృష్ణంరాజు, జగపతి బాబుతో "సింహస్వప్నం"

ఆంధ్రులు గర్వించే అత్యుత్తమ చిత్రాలను నిర్మించే సంస్థలలో జగపతి ఆర్ట్ పిక్చర్స్ ఒకటన్న విషయం ఎవ్వరికీ తెలియనిది కాదు. "గుఱ్ఱపు స్వారీ, స్కేటింగ్, ఫైటింగ్, ఆంగిక వాచకాభినయంలో చక్కని తర్ఫీదు పొందాడు గనుక జగపతిబాబు డయెల్ రోల్‌ను ఎంతో ఈజ్‌తో చేస్తున్నాడు.," అన్నారు వి. మధుసూదనరావు. ఈయన దర్శకత్వంలో వి. బి. రాజేంద్రప్రసాద్ నిర్మిస్తున్న జగపతి ఆర్ట్ పిక్చర్స్ "సింహ స్వప్నం" భారీ చిత్రంలో కృష్ణంరాజు, గుమ్మడి, గొల్లపూడి, రంగనాథ్, గిరిబాబు, ఎ. జె. వి. ప్రసాద్, నర్రా, వినోద్, త్యాగరాజు, చలపతిరావు, జయసుధ, వాణి, హంస, అనిత ఆదిగాగల వారు తెర ముందు; ఎం. డి. సుందర్, డి. ప్రభాకర్, ఆత్రేయ, చక్రవర్తి, డి. ప్రసాద్‌బాబు, కె. నాగేశ్వరరావు, ఎ. సంజీవి, సాహుల్, ప్రకాష్, పింజల శ్యామ్, ఆర్. వెంకటేశ్వరరావు, మహ్మద్ ఉస్మాన్, ఎస్. సురేష్‌కుమార్ తెర వెనుక కృషి చేస్తున్నారు.

## ఉషాకిరణ్ మూవీస్ "ఓ భార్య కథ"

ఇదుగో పులి అంటే, అదుగో తోక- అంటుంది లోకం. అందుకే లోకులు కాకులు- అన్నారు..... తమ జీవితాల్లోకి తొంగి చూసుకొనే తీరిక వారికి ఉండదు గాని, ఇతరుల సంసారాల్లో లోపాలున్నాయేమో అని అన్వేషిస్తుంటారు. ఆ విధంగా శివరామ్ బతుకు ఇప్పుడు నలుగురి నోళ్ళలోనూ పడింది. ఎక్కడబడితే అక్కడ అతని గురించి అనుకునేది వారే. ఆ రోజు శివరామ్ తన స్నేహితుడు మాణిక్యంతో కలిసి ఆఫీసులోంచి బయటకు వచ్చాడో లేదో వాచ్‌మన్ "ఏం, సార్! ఏమైనా తెలిసిందా? అదే. సార్, శివరామ్‌గారి ఆడోళ్ళ అమాకీ ఏమైనా తెలిసిందా? నా డౌటేంటంటే, సార్.... అమ్మగారు కిడ్నాపింగ్ అయిపోయారేమోనని,"

అంటూ నసిగాడు. అఖరికి శివరామ్ సైకిల్ టయర్‌కి గాలి కొట్టిన మనిషి కూడా "ఇంతకీ, అమ్మగారు నగలేమైనా పట్టుకెళ్ళారాండి? మరేం లేదండీ. ఈమధ్యన పోకిరీ కుర్రాళ్ళు ఫామిలీ ఆడోళ్ళ ఒంటి మీది నగలు చూసి, మంచి మాటలతో లేపుకెళ్ళిపోతున్నారండీ. ఆ తర్వాత నగలు కాస్తా ఒలిసేసుకుని, లాడ్జీల్లో వదిలేసి పోతున్నారండీ.. ఇదీ అళ్ళ పనేమోనని నా అనుమానం", అన్నాడు.

తలకొక రకంగా ఊహాగానాలు చేసే పరిస్థితి ఎందుకొచ్చింది శివరామ్ జీవితంలో? అసలతని భార్య ఎక్కడికి వెళ్ళింది? ఆమె ఏమైందో బయటకి చెప్పుకోలేని స్థితి అతనికెందుకు పట్టింది?



"అగ్నినక్షత్రం"లో రజని, మోహన్‌బాబు

ప్రతి భార్యకూ, ప్రతి భర్తకూ ఓ కథ ఉన్న దేశం ఇది. భార్యల కథలు కన్నీటి గాథలైతే, భర్తల కథలు మరోలా ఉంటున్నాయి. కష్టాల కొలిముల్లో నిత్యమూ కాలిపోతూ, ఎప్పటికప్పుడు ఆ అగ్నిపరీక్షల్లో అపరంజిలాగ బయటకు వచ్చే అనేకానేక మంది భార్యల్లో 'ఓ భార్య కథ' ఇది. మౌళి దర్శకత్వంలో రామోజీరావు నిర్మించిన ఉషాకిరణ్ మూవీస్‌వారి ప్రతిష్టాత్మక చిత్రానికి అట్లూరి రామారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.

## "ధ్రువ నక్షత్రం"

"సెప్టెంబర్‌లో షూటింగ్ ప్రారంభించి, నవంబర్‌లో ముగిస్తాం," అన్నారు బి. నాగేశ్వరరావు. ఈయన దర్శకత్వంలో డి. రామానాయుడు "రక్త తిలకం" అనంతరం సమర్పించే చిత్రంలో వెంకటేశ్, ఊర్వశి శారద వగైరా తారాగణం. అశోక్‌బాబు నిర్మాత.

## ఎ. ఎన్. ఆర్. రాజేంద్రప్రసాద్‌లతో సాయిసుధ కంబైన్స్ చిత్రం

"అక్టోబర్‌లో పాటల రికార్డింగ్. నవంబర్, డిసెంబర్‌లలో షూటింగ్. వినోదభరిత చిత్రం", అన్నారు బి. బుల్లి సుబ్బారావు. ఈయన సమర్పణలో జి. సత్యప్రతాప్, బి. సాయి శ్రీనివాస్‌లు నిర్మించే సాయిసుధ కంబైన్స్ వారి చిత్రంలో ఎ. ఎన్. ఆర్. సరసన జయసుధ, రాజేంద్రప్రసాద్ సరసన వాణీ విశ్వనాథ్ నటిస్తారు. కోడి రామకృష్ణ దర్శకుడు.

## మనోజ్ఞ జానపద సంగీత సమాహారం 'మావూరు'

తెలంగాణా గ్రామాలలోనే కాదు, దేశంలోని ఏ పల్లెటూరిలో విన్నా అక్కడ మట్టి వాసన గుభాళించే జానపదసంగీతం వీనులవిందు చేస్తుంది. సంగీతమంటే ఎలక్ట్రానిక్, ఎలక్ట్రిక్ యంత్ర వాద్యాల హోరే అనుకునే అధికసంఖ్యాక ఆధునికులకి 'మావూరు' విభ్రాంతికరమైన ఒక జానపద సంగీతకోశం కానుంది.

తెలుగునాట ఆర్ట్ సినీమాకు పర్యాయపదంగా మారిన నవ్యధోరణి దర్శకుడు బి. నరసింగరావు తాజా చిత్రం 'మావూరు' లో తొలినుండి తుదివరకు జానపద సంగీతం అమృతవర్షంలా కురియనుంది. దర్శకుని మాటల్లోనే చెప్పాలంటే 'మావూరు' మన (తెలుగువారి) పల్లెసంగీత ధోరణులకు ప్రతిధ్వని వంటిది.

ఊరి గుడిలో పాడుకునే భజనలు, బహురూపుల వాళ్ళు వినిపించే వీర, కరుణ రసాత్మక కధగానాలూ, దూలా, కోలాటం వంటి పలు జానపదసంగీత ప్రక్రియలూ, పశులకాపరి, పిల్లన గ్రోవి నుంచి అల్లనల్లన తేలివచ్చే వెదురు పాట బాణీలూ– ఇలా ఈ యాభై నిముషాల లఘుచిత్రం నిండా అచ్చ తెలుగు జానపద సంగీతపు సెలయేళ్ళు ప్రవహిస్తూ వుంటాయి.

వందలాది తెలంగాణా గ్రామాలనుంచి సేకరించిన వేలాది జానపద గీతాలనుంచీ, బాణీలనుంచి తాను 'మావూరు' చిత్రానికి అవసరమైన సంగీత శకలాలను ఏర్చి కూర్చినట్లు దర్శకుడు నరసింగరావు చెప్పారు. రీ రికార్డింగ్‌లో కూడా అన్నీ జానపద



'ఇండోర్' షూటింగ్ ఎందుకయ్యా, చాలా దూరం! ఇక్కడ దగ్గర్లోనే అవుడ్డోరు షూటింగ్ పెట్టుకుందాం!

సంగీత వాద్యాలనే ఉపయోగించినట్టూ, ఇలా చేయడం వల్ల కల్తీ లేని 'పరిశుద్ధమైన' జానపద సంగీతాన్ని వినే అవకాశాన్ని ప్రేక్షకులకు కలిగిస్తున్నట్టు ఆయన వివరించారు.

భారతీయ జానపదానికి (పల్లెటూరు) ప్రాతినిధ్యం వహించడానికా అన్నట్లు నిసర్గ సుందరంగా, అతి సాదసీదాసూటి శైలిలో రూపొందించిన ఈ చిత్రంలో తన కృషి యెంతో సంతృప్తి కరంగా ఉన్నట్టు తన కనిపించిందని ప్రఖ్యాత ఛాయా గ్రహణ దర్శకుడు ఏ. కె. బీర్ అన్నారు. అటు ఆర్ట్ సినిమాలకూ, ఇటు వ్యాపార ధోరణి సినీమాలకు పనిచేస్తున్నా 'మావూరు' వంటి నిరాడంబర చిత్రాలకు పనిచేయధంలో వున్న ఆనందం మరొక చోట లభించదని ఆయన అభిప్రాయపడ్డారు.

'రంగుల కల'తో సహా నరసింగరావు నిర్మించిన, దర్శకత్వం వహించిన అన్ని చిత్రాలకు ఎడిటర్‌గా వ్యవహరించిన ప్రముఖ ఫిలిమ్ ఎడిటర్ డి. రాజగోపాల్ 'మావూరు'ను ఎడిట్ చేయడాన్ని ఒక అపురూపమైన అనుభవంగా అభివర్ణించారు. ఇటువంటి అపురూపమైన చిత్ర నిర్మాణంలో పాలు పంచుకొంటున్నందుకు తనకెంతో సంతోషంగానూ, సంతృప్తిగానూ వుందని ఆయన ఆనందం వ్యక్తం చేశారు. రానున్న జనవరిలో ఢిల్లీలో జరుగనున్న అంతర్జాతీయ చలన చిత్రోత్సవం లఘు చిత్రాల విభాగంలో పాల్గొనడానికి వీలుగా 'మావూరు' ను శరవేగంగా సిద్ధంచేస్తున్నట్టు దర్శకుడు నరసింగరావు తెలియజేశారు.

భారతీయ జానపదాల యధార్థ దృశ్యాల మణిహారంగా నిలిచిపోయే 'మావూరు'కు కెమెరా : ఏ. కె. బీర్, స్క్రిప్టు, కె. ఎన్. టి. శాస్త్రి, బి. నరసింగరావు, ఎడిటింగ్ డి. రాజగోపాల్ సౌండ్ : అరుణ్‌శర్మ, ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ : వి. మల్లికార్జునరావు, లొకేషన్ ఇన్‌చార్జి : వేద్‌కుమార్, అసోసియేట్ డైరెక్టర్ : వి. కృష్ణారావు, అసోసియేట్ ఆర్ట్ డైరెక్టర్, సుదర్శన్, కళ, సంగీతం, సినేరియో, దర్శకత్వం : బి. నరసింగరావు. తెలుగు సినిమా చరిత్రలో మరొక మైలు రాయిగా నిలిచిపోయే ఈ చిత్రాన్ని బి. రామచంద్రరావు నిర్మిస్తున్నారు.



"మావూరు"లో ఒకదృశ్యం




గవర్నరు శ్రీమతి కుముద్‌బెన్ జోషి సెప్టెంబరు 18న కాకినాడలో లేడీస్ రిక్రియేషన్ క్లబ్ ప్లాటినం జూబిలి ఉత్సవాల సందర్భంగా రూ. 10 లక్షల ఖర్చుతో నిర్మించే "ఇందిరా సుబ్బరామిరెడ్డి ఇండోర్‌స్టేడియం"కు శంకుస్థాపన చేశారు. ప్రముఖ రచయిత్రి శ్రీమతి మాలతీచందూర్, క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి ముత్తా లక్ష్మి కార్యదర్శి శ్రీమతి బొడ్డు సత్యవతి చిత్రంలో ఉన్నారు.




## రచయిత్రి విదేశయాత్ర

ప్రముఖ రచయిత్రి శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలా ప్రసాద్– వారి భర్త శ్రీ ఎం. వి. ప్రసాద్, బ్రిటిష్ విద్యా సంస్థల ఆహ్వానం మీద అక్కడి విద్యాలయాలలో భారతీయ సంస్కృతి- సాహిత్యాల గూర్చి- ఉపన్యసించుటకు ఆరు వారాల పర్యటనకు ఇంగ్లండు వెళుతున్నారు. గత మూడు సంవత్సరాలుగా వీరిరువురు బహుళ సాంస్కృతిక విద్యా విధానాల గూర్చి కృషి చేస్తున్నారు. ఆ సందర్భంగా గతంలో కూడా వీరు ఇంగ్లండు వెళ్ళి వచ్చారు.

శ్రీమతి పుణ్యశీలా ప్రసాద్ రచన లనేకం వివిధ తెలుగు మాస- వార- పక్ష పత్రికలలో ధారావాహికంగా ప్రచురింపబడి బహుళ ప్రజాదరణను పొందాయి. కొన్ని బహుమతులను



కూడా పొందాయి. శ్రీ ఎమ్. వి. ప్రసాద్ ప్రముఖ విద్యావేత్త- భారతీయ విద్యాభవన్ పబ్లిక్ స్కూల్ ప్రిన్సిపాల్. □

## సినిమా పాటల పోటీలు

( 82 వ పేజీ తరువాయి)

సభలో ముఖ్య అతిధిగా పాల్గొన్న జిల్లా గ్రంథాలయ సంస్థ చైర్మన్ శ్రీ కాకుమాను పెద పేరిరెడ్డి ప్రసంగిస్తూ, సాంస్కృతిక కళల పోటీలు యువతరంలోని నిగూఢ శక్తి వెలికి తీసి వారు ఆయా రంగాలలో రాణించడానికి దోహదపడగల వన్నారు. నేటి సినీ పత్రికారంగంలో "సినిమా రంజని" సామాజిక విలువలతో కూడి కుటుంబ సభ్యులు యావన్మంది చదివి ఆనందించటానికి దోహదం చేస్తున్నదని ప్రశంసిస్తూ జేసీస్ సేవలను కొనియాడారు.

స్థానిక లేడీస్ రిక్రియేషన్ క్లబ్ కార్యదర్శి శ్రీమతి మద్ది రామకుమారి ప్రసంగిస్తూ "నాట్యం", ఇతర కళలు సంగీతంపైనే ఆధారపడి ఉన్నాయన్నారు.

సంగీతం అన్నది గంధర్వుల నుండి తెచ్చుకున్న దని సంగీతం ద్వారా ఎదుటి వారు లీనమయి పోయేటట్లు చేయాలన్నారు. ఇలాంటి సంగీత పాటల పోటీలను నిర్వహించిన నిర్వాహకులను అభినందించారు.

"సినిమారంజని' అసోసియేట్ ఎడిటర్ శ్రీ పొట్లూరి వెంకట్రావు ప్రసంగిస్తూ నేటి యువతలో నిద్రాణమై ఉన్న ప్రతిభను, వెలుగులోకి తీసుకొని రావటానికి 'సినిమారంజని' సినిమా పాటల పోటీలను నిర్వహించి సినిమా పత్రికా రంగంలో క్రొత్త ఒరవడి సృష్టించిందన్నారు.

గుంటూరు జేసీస్ ఇంత విజయవంతంగా ఈ పోటీలను నిర్వహించడం రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుండి యువతీ యువకులు ఇంత పెద్ద సంఖ్యలో రావడం హర్షదాయకమన్నారు.

జేసీస్ అధ్యక్షులు శ్రీ వి. సి. ఆర్. రెడ్డి తన ప్రసంగంలో యువతరం కోసం జేసీస్ ఈ ఏడాది ఎన్నో కార్యక్రమాలు నిర్వహించిందని వాటన్నిటిలో కెల్లా "ఆంధ్రపత్రిక"తో సంయుక్తంగా నిర్వహించిన పోటీలు ఉన్నత స్థాయిలో నిలిచాయన్నారు.

సుదూర ప్రాంతాల నుండి యువతీ యువకులు ఇంత పెద్ద సంఖ్యలో పాల్గొనడం చూస్తే "సినిమా రంజని" కొద్ది కాలంలో సినిమా అభిమానుల హృదయాలను ఎంతగా దోచుకున్నదో అర్థమవుతున్నదని వక్తలు ప్రశంసించారు.

ఈ సభలో జేసీస్ కో ఆర్డినేటర్ శ్రీ గంధం కృష్ణ, కార్యదర్శి శ్రీ సాంబిరెడ్డి, రాష్ట్ర కోశాధికారి శ్రీ ఎస్. ఎస్. జహీర్, జేసీస్ ఉపాధ్యక్షులు శ్రీ కె. గాంధీ శ్రీయుతులు వి. ఎస్. ప్రసాద్, ఉమామహేశ్వరరావు, రామస్వామిరెడ్డి, మల్లికార్జునరెడ్డి, రాజా, తదితరులు పాల్గొన్నారు.

ఈ పోటీలకు న్యాయనిర్ణేతలుగా పాల్గొన్న శ్రీ కె. సూర్యనారాయణ, పి. ఎస్. రావులకు, అతిధులకు శ్రీ వి. సి. ఆర్. రెడ్డి జ్ఞాపికలందజేశారు.

నిమ్మరాజు చలపతిరావు వందనసమర్పణ చేశారు

### మహిళా విభాగంలో విజేతలు

ప్రథమ బహుమతి-శ్రీమతి పద్మకుమారి (సావిరహే తవదీనా)

ద్వితీయ -శ్రీమతి కె. బాలాజో సఫిన్ (కొండ కోనల్లో వెండి వెన్నెల్లో)

తృతీయ- కుమారి శివలీల (ఇది మౌనగీతం)

ప్రత్యేక బహుమతులు శ్రీమతి కె. నిర్మల (అష్టపది)

కుమారి పి. శారద (చల్లగా వీచె పిల్లగాలిలో)

### పురుషుల విభాగంలో విజేతలు

ప్రథమ- శ్రీ టి. నాగేశ్వరరావు (ఓంకార నాదాను సంధానమే)

ద్వితీయ-శ్రీ ఇ. వి. రమణ (రసికరాజ.. .)

తృతీయ- శ్రీ ఎస్. కె. ఎన్. బాబు (శంకరా శివశంకరా)

ప్రత్యేక-శ్రీనివాస్, కె. మురళీధర్, వెంకటేశ్వరరావు.

తర్వాత రోజు జరిగిన బహుమతి ప్రదానోత్సవ సభలో ఇన్‌కంటాక్స్ డిప్యూటీ కమీషనర్ శ్రీ జంధ్యాల సురేష్, శ్రీమతి సురేష్ విజేతలకు బహుమతులందజేశారు.

- చలపతిరావు